

వింధ్యాల ఫణిశేఖర్‌రెడ్డి
సమర్పించు
సత్యం ఎంటర్‌టైన్‌మెంట్
యువతరం సంగీత దర్శకుడు చక్రి అందించిన మరో మ్యూజికల్ హిట్
త్వరలో
ధనలక్ష్మీ... ఐ లవ్ యూ!
బి. సత్యనారాయణ చక్రి శివనాగేశ్వర రావు
సిద్దిక్‌లాల్ కొలికపూడి రవి భాస్కరభట్ల రవికుమార్ రాజేంద్రప్రసాద్.కె శంకర్ ఇ. వి. వి. గిరి కె.వి. రమణ వేణు
Designed by : AELAY

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

26

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం













'సెంటర్ స్ప్రెడ్'లో - 'ధనలక్ష్మీ ఐ లవ్ యూ' 'పిలిస్తే పలుకుతా' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'జెమిని'లో వెంకటేష్, భైరవి

ఇటీవలే 'హాసం' పరిచయం అయింది. ముంబాయిలో ఉంటున్న నావంటి వారికి ఇంత చక్కని పత్రిక ఉందని ఇన్నాళ్లుగా తెలియనే తెలియదు. నోస్టాల్జియా ఉన్నవారికి మీ పత్రికలోని కొన్ని శీర్షికలు చాలా నచ్చుతున్నాయనేది పాఠకుల లేఖల ద్వారా స్పష్టం అవుతూనే ఉంది. శాస్త్రీయ సంగీతానికి, సీరియస్ సాహిత్యానికి తగిన గుర్తింపు నిచ్చే 'ఫోరమ్స్' కొన్నయినా ఉన్నాయి. మన సంస్కృతి వారసత్వంలో భాగాలైన లలిత సంగీతానికి, హాస్యానికి, పాత సినిమాలకూ అటువంటి సదుపాయాన్ని కల్పించినది మాత్రం మీ పత్రిక ఒకటేననుకుంటాను. నేటి తరం పాఠకుల దృష్టిని కొన్ని మంచి విషయాల వైపుకు మళ్లించే మీ ప్రయత్నం ఎంతైనా అభినందనీయం. అందుకు తనికెళ్ల భరణిగారి వంటి సమర్థులు. మీకు తోడ్పడడం వారి "నిజ స్వరూపాన్ని" బయట పెడుతోంది!

-కొడవటిగంటి రోహిణీప్రసాద్, ముంబాయి

విజయవంతంగా, రసికజనమనోరంజకంగా సంవత్సరం పూర్తి అయిన సంతోషంలోనో ఏమో - "హాసం" సెప్టెంబర్ 16-30 సంచిక సంగీత ప్రియులను ఆనంద డోలికల్లో ఊపివేసింది. 'నూర్జహాన్' పాటలనన్నిటిని చక్కగా పొందుపరచి అందించి ఆనందింప జేసిన మీరు ఎంతయు అభినందనీయులు - ఎమ్మెస్ సుబ్బలక్ష్మి, లతా మంగేష్కర్ గురించిన వ్యాసాలు కూడా ఎంతగానో అలరించాయి. ఈ సంచికలోనిదే మరొక ఆణి ముత్యం-ఘంటసాలగారి "భగవద్గీతావతరణం". ఆచంద్రతారార్కం నిలిచిపోయే ఈ శ్లోకాల అవతరణం గురించి సావిత్రి గారు వివరిస్తుంటే కళ్ళు చెమ్మగిల్లాయి.

-సోంపేట చంద్రశేఖరాచారి, ఏలూరు

సాహితీ విలువలు పడిపోయి, టి.వి. మహమ్మారి వల్ల పుస్తకం పఠనం రోజురోజుకీ కృష్ణ పక్షచంద్రునిలా క్షీణిస్తోన్న ఈ రోజులలో మీ (మన) పత్రిక ఎప్పుడొస్తుందాని వేచిచూసే స్థితికి తెచ్చింది. నా పేరున చందాకట్టి ఈ అద్భుతమైన పత్రికను నాకు పరిచయం చేసి పుణ్యం కట్టుకున్న మా అక్కయ్య శేషక్కయ్యగారికి సదా కృతజ్ఞుడ్ని.

-క్రొవ్విడి హరగోపాలకృష్ణ, సికింద్రాబాద్

గత సంవత్సరకాలంగా 'హాసం' పత్రిక సంచిక కూడా మీ అందరి సమిష్టి కృషి వలన సర్వాంగ సుందరంగా తయారై మా చేతులలోకి వచ్చి మమ్మల్ని పరమానందభరితులను చేస్తోంది. అటువంటి 'హాసం' ఎలా తయారవుతున్నది. రచనలు ఎన్నుకోవడం దగ్గర నుంచి తుదిగా మాకు చేరడం వరకు - 'హాసం' ఆంతరంగిక వ్యవహారం గురించి ఒక వ్యాసాన్ని ప్రచురించాల్సిందిగా కోరుతున్నాను.

-మామిడి మహేంద్ర, పూణే

మారుమూల పల్లె అయిన మా వూరిలో వుండి




'హాసం' చదువుతుంటే అందులోని ప్రముఖుల ముందే వుంటున్న అనుభూతి కల్గుతోంది. అన్ని సంచికలు కలెక్ట్ చేసుకున్నాము.

-ఎస్.శిరీషాగోపాలన్, బూరుగుపల్లి

ఘంటసాల గారి జీవితం గురించి వ్యాసాలు ఎప్పుడు ఏ పత్రికలో వస్తాయా అని ఎదురు చూస్తున్న నాకు మీ హాసం పత్రిక కనిపించడం అదృష్టం. సావిత్రమ్మ గారి అడ్రస్సు, ఫోన్ నెంబర్లు ఇస్తారని ఆశిస్తున్నాను. భగవంతుడు వారికి అష్టైశ్వర్యాలని అందించాలని కోరుతున్నాను.

-ఎం.ఆంజనేయులు, ధర్మవరం

హాసం ప్రతి సంచిక ఒక ఆణిముత్యమే కాని ఆపాత (ట) మధురాలు వేయకపోతే మన స్పెందుకో చివుక్కుమంటుంది. అదంటే అంత మక్కువ మరి. "ఇద్దరు మిత్రులు" వేస్తున్నందుకు ఎంతైనా అభినందనీయులు. సంచిక రూ.15-00 చేసి ఎక్కువ సంగతులు విశేషాలు, పాత సినిమాల పాటలు పూర్తిగా (విశ్లేషణతో కూడి) ఒక బుక్‌లెట్ లాగా యిస్తే బాగుంటుంది.

-పి.పాపారావు, విశాఖపట్నం -4

'హాసం' పత్రిక సంగీతాభిమానులకు కరదీపికలా ఉంది. పాత కొత్త పాటల కలయికతో మా కుటుంబ సభ్యులనే కాకుండా మా పాఠశాల ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటోంది. 'హాసం' కాన్వాస్ ఎంతో పెద్దది!

-సి.హెచ్.స్మిత, జగిత్యాల

'మా మావయ్య ఘంటసాల' కథను వారి శ్రీమతి వ్రాస్తున్న తీరు అమోఘం. అయిపోయిందని తెలియగానే అయ్యో అనిపించింది. ఇంకా వుంటే బాగుండేది అనిపించింది. రామాయణ గాథలా ఘంటసాల గాథ ఎంత విన్నా తనివి తీరదు. సావిత్రమ్మ గారి చేత ఘంటసాల జీవితంలో మరి కొన్ని సంఘటనలు వ్రాయించగోర్తాను. మీ ఆడియో రివ్యూలో బాగుందని వ్రాసిన ప్రతి క్యాసెట్టు నా ఆర్థిక పరిస్థితి కూడా రివ్యూ చేసుకోకుండా వెళ్లి కొనేస్తున్నాను.

-వై.రోశిరెడ్డి, సత్తెనపల్లి

నా మనసు దోచిన తొలిపత్రిక 'హాసం'. ప్రతి పక్షం ఎవరో ఒక ప్రముఖ సంగీత కళాకారుణ్ణి స్మృతికి తెప్పించి వారి జీవితంలో మధుర ఘట్టాలను మా కళ్ల ముందుకు తెచ్చే మీ ప్రయత్నం అద్భుతం. అమోఘం. 'చౌచౌ చౌరస్తా' ఒక్కొక్కసారి ఆపివేస్తున్నందుకు మనసుకు బాధగా ఉంటుంది.

-సురేష్, లక్ష్మీనరసుపేట, శ్రీకాకుళం జిల్లా

'హాసం' నిజంగా కలక్టర్స్ ఐటమ్స్‌తో నిండి వున్న పత్రిక. నా గురించి ప్రచురించిన వ్యాసానికి కృతజ్ఞతలు.

-వేదవతీ ప్రభాకర్‌రావు, హైద్రాబాద్

గత రెండు సంచికలుగా 'హాసం'లో పాత పాటలు, అపురూపమైన పాటలు తక్కువగా వేయడం మాకు నిరాశ కలిగించింది. ఇంకా కొన్ని వేల మంచి పాటలు వున్నాయి. వాటిని పాఠకులకు అందించవలసిన బాధ్యత మీదే. దయవుంచి వాటి సంఖ్య తగ్గించకండి.

-వై.సాయిబాబా, ఏలూరు

ఈ పక్షం సంచికలో సంపూర్ణ కళాకారుడు 'కిషోర్‌కుమార్' వర్థంతి సందర్భంగా ప్రారంభించిన సీరియల్ వండర్‌ఫుల్. సింగర్, మ్యూజిక్ డైరెక్టర్, యాక్టర్, లిరికిస్ట్, ప్రొడ్యూసర్, డైరెక్టర్ ఇలా అన్నీ కలిగి ఉన్న సంపూర్ణ కళాకారుడు కిషోర్‌కుమార్. ఇలాంటి ఇమ్మోర్టల్స్‌ను స్మరిస్తూ వెలువడుతున్న 'హాసం' పత్రిక నిజంగా ప్రశంసించదగ్గది.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్

నేను మొదటిసారిగా ఈనాడు దినపత్రిక జిల్లా అనుబంధంలో 'హాసం' ప్రకటన చూసి ఏప్రిల్ 1-15 సంచిక కొన్నాను. నాకు యిలాంటివి చదివినప్పుడు, గత సంచికలు మిస్సయ్యానే ఎలా అని ఆలోచిస్తాను. కానీ మీ పత్రికలో ఆ విషయం కూడా ఉండటంతో ముందుగా పాత సంచికలు తెప్పించి కొత్త వాటి కొరకు చందా కట్టాను. ఎంత అభివృద్ధి చెందినా ఎన్ని సాధనాలు ఉన్నా కొన్నింటి విలువ వాటిదే. చదువుతున్నప్పుడు ఊహించుకున్నంత చూస్తున్నప్పుడు (టి.వి.) ఊహించుకోలేము. హాసంలో జరిగిన వాటి గురించి అవి చదువుతుంటే ఆ సంఘటనలు నేను చూడకున్నా (నా వయసు 29 సం॥) కళ్ళముందు జరిగినట్లే అనిపిస్తుంది.

-టి.వెంకటేష్, జడ్చర్ల

'హాసం ఆల్బమ్' ఇచ్చినందుకు మాకెంతో ప్రయోజనం కలిగింది. మా అభిమాన గాయకుడు కిషోర్‌కుమార్ సీరియల్ వేసి సాహసం చేశారు. 'ఇద్దరు మిత్రులు' సినిమా నవల కొంగ్రొత్త ప్రయోగం భలే రంజుగా ఉంది.

-వి.రామ్‌మోహన్, సత్యాఅల్వాల్

'భార్యపుట్టినరోజు' కథ చాలా బాగుంది. మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. 'అర్జున్'గారి దసరా కార్టూన్లు నవ్వించాయి.

-వై.రత్నరాజేశ్వరి, ఏలూరు

సంపుటి : 2 సంచిక: 2

16- 31 అక్టోబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

26

'**ఏ**డాది క్రితం "హాసం" ఏ అట్టహాసమూ లేకుండా వచ్చి జనాల మధ్య నిలబడింది. అవిష్కరణ సభలు, అభిభాషణలు, ఉద్ఘాటనలు ఏమీ లేకుండానే పత్రిక పాఠకులకు చేరింది. ముంబయ్‌లో 'హాసం' అభిమానులు వార్షికోత్సవ సమావేశం ఏర్పాటు చేస్తూ సంపాదకవర్గాన్ని ఆహ్వానించినప్పుడు అది ఆవిష్కరణసభల్లా కాకుండా సమీక్షాసమావేశంలా ఉపకరిస్తుందని అనిపించింది. హైదరాబాదులో జరిగే పుస్తకావిష్కరణ సభలకు ఎంతమంది హాజరవుతారో తెలుసు కాబట్టి, ఆ సభకు విచ్చేసిన సభికులను చూసి ఆశ్చర్యపడడం జరిగింది. శనివారం సాయంత్రమయినా 250 మంది వచ్చి సుమారు 3 గంటలపాటు సీట్లలోంచి కదలకుండా కార్యక్రమాలన్నీ తిలకించారు!

మర్నాడు సాహితీసమావేశానికి కొంతమంది 60 కి.మీ. దూరం నుండి కూడా వచ్చేరంటే ఇంకా ఆశ్చర్యం వేసింది. ఈ రెండు సమావేశాలలోనూ "హాసం" గురించి సభికులు వెలిబుచ్చిన అభిప్రాయాలు చెప్పుకొస్తే అది స్వోత్కర్షకు దారితీస్తుంది కనుక దాన్ని పక్కకుబెట్టి, ప్రవాసాంధ్రుల అభిరుచుల పైననే దృష్టి సారిస్తే - ముందుగా చిన్న సవరణ - "ప్రవాసాంధ్రులని పిలవొద్దు - పైకొచ్చారు - పరివ్యాప్తాంధ్రులు" అన్నారు - అంబల్ల జనార్దన్ తన "బొంబాయి నానీలు"లో. నిజమే! వారు ప్రవాసంలో ఉన్నారనడం కంటె, పరివ్యాప్తి చెందారనడం సబబు. ప్రసిద్ధి కెక్కారనడం ఇంకా సబబు. మన సంస్కృతిని, సంప్రదాయాన్ని ఇతరులకు పరిచయం చేసేది వారే!

రాష్ట్రంలో ఉంటున్నంతకాలం మన కల్చర్ గురించి పట్టించుకోకపోయినా బయటకు వెళితే మాత్రం తెలుసుకోవాల్సిన అవసరం పడుతుంది... అక్కడి వాళ్లు అడుగుతారు కాబట్టి! పైగా మనకూ మమకారం పెరుగుతుంది - ఇక్కడ ఉండగా మనం కట్టుకున్న గోడలు బీటలు వారతాయి కాబట్టి. లాంగ్‌షాట్‌లో అందరూ ఒకేలా కనిపిస్తారు కాబట్టి. బయట కెళితే భాష చక్కటి వారధి! యాస ఎలా ఉన్నా, మన భాష మాట్లాడితే చాలనిపిస్తుంది.

అన్నిటినీ మించి నోస్టాల్జియా ఒకటి బాధిస్తుంది. అమ్మ ఒడి దూరమయిన కొద్దీ జ్ఞాపకాలు ముప్పిరిగొంటాయి. గతం హాయనిపిస్తుంది. అందుకే మన సంప్రదాయం కాపాడుకోవాలన్న తాపత్రయం, మనలో విశిష్టత ఏమిటో పిల్లలకు నేర్పాలన్న తపన, సాంస్కృతిక వారసత్వంలో మేమూ ఎవరికీ తీసిపోమని పొరుగువారికి చాటి చెప్పాలన్న ఉబలాటం కనబడతాయి.

అందువల్లనే ప్రవాసాంధ్రులలో అంత చైతన్యం కనబడుతుంది. ఇక్కడ ఉన్నవారితో పోలిస్తే వారి శాతం తక్కువే! ఆ శాతంతో పోలిస్తే వారి కల్చరల్ ఔట్‌పుట్ ఎక్కువే! శ్రామిక వర్గాలు కూడా తరలి వెళ్లినా, ముఖ్యంగా విద్యాధికులు, ఉద్యోగస్తులు రాష్ట్రం బయట కనబడడం వల్ల పుస్తక పఠనం పట్ల వారికి ఉన్న ఆసక్తి కొట్టవచ్చినట్టు కనబడుతుంది.

ఈ నేపథ్యంలో "హాసం" వంటి పత్రిక వారి మనసుకు దగ్గరవడంలో ఆశ్చర్యం లేదు. తమ స్కూలు రోజులను, కాలేజిరోజులను గుర్తుకు తెచ్చే పాటల ప్రస్తావన వచ్చినప్పుడు ఎవరు మాత్రం చలించకుండా ఉండగలరు? హాస్య విభాగంలో కూడా సున్నితమైన హాస్యాన్ని ఆస్వాదించగల మేధస్సు, అభిరుచి వారికి సహజంగా ఉంటుంది. మీ బంధుమిత్రులలో ప్రవాసాంధ్రులుంటే వారికి 'హాసం' పరిచయం చేసి చూడండి. వారి స్పందనను అనుభూతిలోకి తెచ్చుకుని మా పరిశీలనలో నిజానిజాలు స్వయంగా తెలుసుకోండి.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



బహుముఖ ప్రజ్ఞాశాలి కొడవటిగంటి కుటుంబరావు గారి వచన రచన రచయితలందరికీ ఆదర్శప్రాయం. 1909లో జన్మించిన కుటుంబరావుగారు 1931 నుండి 50 సం॥ల పాటు సాగించిన సాహితీ వ్యవసాయంలో వెలయించిన పలురకాల రచనలు ఇప్పటికీ పరిమళాలను వెదజల్లుతూనే ఉంటాయి. కొ.కు గారి హాస్యరచనలలో 'డిటెక్టివ్‌కేయాస్ కథలు' విలక్షణమైనవి. తన బావమరిది, ప్రఖ్యాత డిటెక్టివ్ నవలా రచయిత కొమ్మూరి సాంబశివరావును దృష్టిలో పెట్టుకుని ఆయనపేరు కలిసివచ్చేట్లు 'కేయాస్' (chaos) అనే డిటెక్టివ్ పాత్రను సృష్టించారు. ఈ కథల రచయితగా టి.వి.శంకరమ్ అనే పేరు కనబడింది. 'అది మీ కలం పేరా?' అంటే 'కాదు అది నేను సృష్టించిన పాత్ర పేరు' అన్నారు కొ.కు. సాహిత్య చరిత్రలోనే ఇలాటి ప్రయోగం అరుదేమో! ఈ కథలు రాసే టైములో (1956) డిటెక్టివ్ రచనలపట్ల యువతకు చాలా వ్యామోహం ఉండేది. డాన్ క్విక్‌సోట్ వంటి 'కేయాస్'కు శాంకోపాంజా వంటి అసిస్టెంటు భద్రం ఒకడుంటాడు. డిటెక్టివ్ నవలల మూసధోరణిని ప్యారడీ చేస్తూ రాసిన 'వింత భూకంపం' కథను కుటుంబరావుగారి శ్రీమతి వరూధినిగారి సౌజన్యంతో 'హాసం' పాఠకులకు అందిస్తున్నాం-

# వింత భూకంపం

రెండో ఫారం తెలుగుమాష్టరులాగా జగత్ప్రఖ్యాత డిటెక్టివ్ కేయాస్ బల్లమీద కాళ్లు పెట్టుకుని కుర్చీలో వెల్లికిలా పడుకుని బడేఖాన్ లాగా మినార్ సిగిరెట్టు దమ్ములాగి కప్పుకేసి పొగచిమ్ముతున్నాడు. కేయాస్ "సెక్రటరీ" చెంచి టైపు మెషీన్ వాయిస్తున్నది. కేయాస్ అసిస్టెంటు భద్రం గొంతుకూచుని గోళ్లు గిల్లుకుంటున్నాడు.

కేయాస్ ఆఫీసు తీసుకుని ఏడాది అయింది. ఒక్క "క్లయింటు" వచ్చిన పాపాన పోలేదు.

"చెంచీ, టీ!" అన్నాడు కేయాస్. చెంచి మేడమీదినించి కిందికి దూకింది.

"గురో, ఈ డిటెక్సను అచ్చిరావటం లేదు. కూరగాయలంగడి పెట్టుకుందాం" అన్నాడు భద్రం.

చెంచి టీ తీసుకొచ్చి బల్లమీద పెట్టింది. ఎవరోవచ్చి కేయాస్ కెదురుగా కూర్చున్నారు. "మిమ్మల్ని ఎవరూ ఎరగరు. అందుచేత ఈ కేసు మీరే పట్టాలి. నా పేరు సర్. నా భార్య చచ్చిపోయింది. ఒకరోజు పొద్దున గదిలోకి వెళ్లి గడియవేసుకుని చావుకేక పెట్టింది. వంటమనిషీ, తోటమనిషీ తలుపు పడగొట్టి లోపలికి వచ్చి చూస్తే చచ్చిపోయి ఉంది. మెడకు మఫ్లర్ బిగించి ఉంది".

"ఎవరి మఫ్లర్?" అన్నాడు కేయాస్. అతని బుర్ర అప్పుడే తిరిగిపోతున్నది.

"నాదే, కాని నాకు ఎలిబీ ఉంది. నేను ఇంకోచోటున్నాను".

"భద్రం?"

"గురో?"

"ఎలిబీ అంటే ఏంటి?"

"అదే, గురో అదుంటే అంతకుడనటానికి వీల్లేదు".

"మీకు అదే ఉందా, సర్? తగ్గాం. వంట మనిషి? తోటవాడు?"

"వంట మనిషికి వంటింట్లో ఎలిబీ ఉంది. తోటమనిషికి తోటలో ఎలిబీ ఉంది... అసలు నా భార్య చచ్చిన గది తలుపులోపల గడియేసుంది".

"హత్యాశ్చర్యం! వొండ్రుఫుల్!" అన్నాడు కేయాస్ ఆనందంతో చేతులు ఆడిస్తూ. "మీ ఆవిడకి రంకు మొగుళ్లున్నారా?"

కేయాస్‌ను సర్ డొక్కలో తన్ని, "అటువంటిదేమీ లేదండీ!" అన్నాడు విచారంగా.

కేయాస్ బాధగా మొహంపెట్టి, "లేరని ఎట్లా చెప్పగలరూ?" అన్నాడు.

కేయాస్‌ని రెండో డొక్కలో తన్ని "ఉంటే నాకు తెలీకుండా ఉంటుందాండి?" అన్నాడు కంట తడిపెడుతూ.

కేయాస్ కూడా కంట తడిపెడుతూ, "మీ భార్య పేరేమిటన్నారూ?" అని అడిగాడు.

"పద్మావతండి!"

"పద్మావతి వయసెంత?"

సర్ కేయాస్ మెడమీద ఒక్కటిచ్చుకుని, "పద్మావతిగారనండీ! ఆవిడకి సరిగా పాతికండి" అన్నాడు.

"మీరెప్పుడు పెళ్లి చేసుకున్నారండీ?"

"అయిదేళ్లయిందండీ?"

"అప్పుడావిడ వయసెంతా?"

"ఇరవై అయిదులో అయిదుపోతే ఇరవయ్యండి!"

"ఓ మీకు లెక్కలు కూడా వచ్చే! పెళ్లి ఎక్కడయింది?"

"బర్మాలోనండీ?"

"ఓయాస్! మీ కేస్ తీసుకుంటాను, సార్. ఫీజు పారేయించండి."

సర్ చెక్కురాసి చించి ఇచ్చాడు. దానిమీది సున్నాలుచూసి కేయాస్ మూర్చపోయాడు. "చెంచీ! ఇది తీసుకుపోయి సిగిరెట్టు కొట్టులో మార్చి నాలుగు పెట్టెలు మినార్ సిగిరెట్లు పట్టుకురా! నేను దూరప్రయాణం వెళుతున్నాను", అన్నాడతను లేస్తూ. చెంచి కిందకి దూకింది.

"ఇంకో విషయం మీకు చెప్పాలి, సార్. మా ఆవిడ చచ్చేముందు గుడ్డల సాయిబొకడు వచ్చి ఏవో బట్టలు చూపించి వెళ్లాడు, సార్!" అన్నాడు సర్.

"అది కథలో ఇప్పుడు రాదులే. బర్మాలో మీ ఆవిడ బంధువు లెవరూ?" అన్నాడు కేయాస్.

"మేనత్త!"

సర్ వెళ్లాక కేయాస్ మినార్ సిగిరెట్టు ఘాటుగా ఊపిరి తిత్తుల్లోకి పీలుస్తూ; "భద్రం, ప్రయాణం. చెంచీ, నువ్వు టైపు కొడుతూ ఉండు. చిల్లర ఏదీ? ఇందులో పదివేలు నువ్వుంచుకుని మిగతా పదివేలూ ఇట్లా ఇచ్చెయ్యి" అన్నాడు.

"ఎలికాపటరు తీద్దునా, గురో?" అన్నాడు భద్రం.

"తియ్యి" అన్నాడు కేయాస్.

తరవాత కాస్సేపటికి హెలికాప్టర్ రయ్యిన బర్మాకేసి దూసుకు పోతోంది. "ఆ ఆవు పొదుగల్లే అదేంటి, భద్రం?" అని అడిగాడు కేయాస్.

"అది బరమాగాదా, గురో?" అన్నాడు భద్రం

"అహహహాయ్! నీ ఎదాన బండబడ! నిన్ను మాదిగాడు గొయ్యి?" అని హెలికోప్టర్ను అదిలిస్తూ.

"మంచి చోటు చూసి దింపు!" అన్నాడు కేయాస్.

హెలికోప్టర్ను ఒక చెట్టుకు కట్టేసి ఇద్దరూ హోటలుకు వెళ్లారు.

"రండి! మీరు వచ్చినందుకు చాలా సంతోషం" అన్నాడు హోటలు మేనేజరు.

"పద్మావతి తెలుసా?" అన్నాడు కేయాస్ సూటిగా చూస్తూ.

"తెలీకేం? పదిహేడేళ్ల అయిదునెల్ల మూడురోజుల క్రితం ఈ హోటలుకు వాళ్లనాన్నతో వచ్చిన అమ్మాయేగా" అన్నాడు మేనేజరు.

"పద్మావతికొక నాన్న ఉన్నాడని నాకు తెలీదింకా. తప్పుడు క్లూలివ్వకు. పద్మావతి మేనత్త ఎక్కడుంటుంది?"

"మొగలాయీ దర్బారులో ఇరవయ్యో నెంబరిల్లు!"

"థాంక్స్ యూ!"

హెలికాప్టర్ రయ్యిన మొగలాయీ దర్బారు ఇరవయ్యో నెంబరుకు దూసుకుపోయింది.

"రండి! మీరు వచ్చినందుకు చాలా ఆనందంగా ఉంది. నేను నిజంగా మేనత్తను కాను. వాళ్లనాన్న నన్ను పెంచమని మిడ్లాండ్ బ్యాంకుమీద ఇరవై వేల రూపాయలకు 2 బీ 95468612 02002 చెక్కిచ్చాడు. అందుకని!" అన్నది యాభైఏళ్ల యువతి. "అప్పుడు పద్మావతికి అయిదేళ్లు కాదు.... పాతికేళ్లు. ఇప్పుడు పద్మావతికి యాభైఏళ్లు. కులాసాగా ఉందాండీ?"

"చచ్చిపోయింది. ఆవిడ హత్య మీరుగాని చెయ్యలేదుగదా?"

"నాకు ఎలిబీ ఉందండీ!"

"అది నీకూ ఉందీ!... భద్రం. మిడ్లాండ్ బాంకుకు పోనీ."

రయ్యిన దూసుకుపోయింది.

"రండి, దయచెయ్యండి. మీరు వచ్చినందుకు చాలా సంతోషం" అన్నాడు బ్యాంకు ఏజెంటు.

"మీకు పద్మావతి తండ్రి తెలుసా?"

"బెంగుళూరు నించి వచ్చినాయనేనా?"

"భద్రం, బెంగుళూరు పోనీ!"

"అహహహహై! నిన్ను మాదిగాడు గొయ్యా!" అన్నాడు భద్రం. హెలికాప్టర్ రయ్యిన దూసుకుపోతున్నది.

"ఆ తెల్లగా కనపడేదేంటి, భద్రం".

"అది బెంగుళూరే, గురో!"

"బ్రేకెయ్యి!"

"హోయ్! హోయ్! ఆగశా!"

హెలికాప్టర్ నిలిచిపోయింది. అందులోంచి దూకి కేయాస్ బోర్లాపడి లేచాడు.

"రండా! దయచెయ్యండా! మీ దర్శన దల్లి బహవాద సంతోష" అన్నాడు చెప్పుల ఫాక్టరీ మేనేజరు.

"పద్మావతి తండ్రి -"

"నాకు తెలీదు, సార్. మేస్త్రీ -"

కేయాస్ మేస్త్రీ ఇంటికి వెళ్లాడు. బయటి అరుగుమీద పిల్లవాడికి పాలిచ్చే ముప్పై మూడేళ్ల మూడుమాసాల మూడు రోజుల వయస్సుగల స్త్రీ కేసి మూడు నిమిషాలు కన్నార్పకుండా చూశాడు. లోపలికి వెళ్లి ఎదురుగా కూర్చున్నాడు.

"పద్మావతి తండ్రి -"

"నాకు తెలీదండి. ఆ పిల్ల మైసూరులో హాస్టల్లో ఉండేది. మా అమ్మాయితో కలిసి ఆడుకునేది."

"మీ అమ్మాయితో ఇప్పుడు మాట్లాడగూడదు ఇంకా చాలా పేజీలు గడవాలి"అని కేయాస్ బయటికొచ్చి, "భద్రం, మైసూరు దూసుకుపో!" అన్నాడు.

మైసూరు స్కూలు ప్రిన్సిపాలు కెదురుగా కూచుని కేయాస్ సిగిరెట్టు ముట్టించి దమ్ములాగాడు. ప్రిన్సిపాలు సిగిరెట్టు లాగేసి అవతల పారేశాడు.

"నే




అయితే... పద్మావతి" అన్నాడు కేయాస్.

"పద్మావతికి జబ్బు చేసినమాట అబద్ధం. కడుపయింది. అయిదోనెల. వేసవి సెలవలయిరాగానే కనుక్కున్నాం. కడుపు చేసిందెవరని మగపిల్లల్నందర్నీ అడిగాం. మేంకాదంటే మేం కాదన్నారు. అయితే బెంగుళూరులోనే ఎవరో చేసి ఉండాలనుకున్నాం" అన్నాడు ప్రిన్సిపాల్.

కేయాస్ బుర్ర అయోమయంగా ఉంది. బయటికొచ్చి, "భద్రం, బెంగుళూరు దూసుకుపో!"

"చల్, బేటా!" అంటూ భద్రం హెలికాప్టర్ని అదిలించాడు.

మళ్లీ మేస్త్రీ ఇల్లు. పాలిచ్చే ఆడమనిషి.

"నీకు పద్మావతి తెలుసా?"

"బాగా తెలుసండీ. ఆడుకునే వాళ్లం".

"రంకు మొగుళ్లున్నారా?"

"ఛీ! ఛీ! అటువంటిది కాదండీ. అసలు ప్రేమంటే ఏమిటో తెలీదండీ. ఒకసారి నేనూ పద్మావతీ అట్టా వెళ్లాం. ఇద్దరు అత్తరు సాయిబులు కనిపించి మమ్మల్ని వాళ్ల గుడిసెకు తీసికెళ్లారు. ఏదో తాగటానికిచ్చారు. ఘాటుగా వుంది గాని తాగితే మంచి ఉషారుగా ఉంది. తరవాత మమ్మల్ని వాళ్లేదో చేశారు. ఆనందంగా ఇంటికొచ్చేశాం".

కేయాస్ మెదడులో దీపారాధన వెలుగుతున్నది. నూనె కెరటాలు మెదడుని అటూ ఇటూ తాకుతున్నాయి.

"భద్రం, మద్రాసు దూసుకుపో!"

హెలికాప్టర్ దిగంగానే కేయాస్ అంతా కలయచూసి, "మళ్లా నదాప్రసాదంకు వచ్చినట్టున్నామే?" అన్నాడు.

"అవును, గురో!" అన్నాడు భద్రం.

"భద్రం, మనకో కాన్పుల ఆస్పత్రి కావాలి. ఏదో ఒకటి కోరుకో".

భద్రం కళ్లు మూసుకుని వేలు పెట్టాడు. అక్కడికి వెళ్లారు.

డాక్టరు మోహాక్షి పకపక నవ్వి, 'ఇవాళే ఒకమ్మాయికి పురుడొచ్చింది. మీకు కావాలంటే నాతో రండి" అన్నది.

కేయాస్ ఆత్రుతగా లేచి లోపలికి వెళ్లాడు.

"నేను బీచిలో ఒకమ్మాయిని చూసాను. ఇద్దరం కాస్సేపు ప్రేమించుకున్నాం. ఇంకా పెళ్లి కాకుండానే మా ప్రేమకు పురుడు అడ్డుతగిలింది" అన్నాడు కేయాస్.

"పద్మావతి సరిగ్గా ఈపనే చేసింది. పిల్లవాడు

పుట్టాడు. సాయిబు మొహం. పద్మావతి మీద దయదలిచి పిల్లవాణ్ని ఒక బీడి వర్తకుడికి ఇచ్చేసాను. అంతే పద్మావతి అంతా మరిచిపోయింది" అన్నది డాక్టరు.

"అంతా?" అన్నాడు కేయాస్.

"మొత్తం!"

"హాశ్చర్యం! హత్యాశ్చర్యం" అంటూ కేయాస్ ఎనిమిది, తొమ్మిది భావాలతో బయటికి నడిచాడు.

డాక్టరుగారు ఖాళీగా ఉన్నాడు. కేయాస్ ఎదురుగా కూచుని మినార్ అంటించి లాగి వదిలాడు.

"మీకేం రోగం?" అని శ్రద్ధగా అడిగాడు డాక్టరు.

"భూకంపాలను గురించి మీకేం తెలుసు?" అన్నాడు కేయాస్. డాక్టరు చెప్పాడు.

"అబ్బా!" అన్నాడు కేయాస్.

"షాక్!" అన్నాడు డాక్టరు.

"అబ్బా!" అన్నాడు కేయాస్.

"అంతా పోతుంది. పద్మావతి కేమయింది? అంతా పోయింది. మొత్తం! షాక్! మెదడులో భూకంపం! నేను వెళ్లేప్పటికి గొంగళిపురుగు. వచ్చేప్పటికి అంతలోనే సీతాకోక చిలుక!"

కేయాస్ బయటికి ఉరికాడు. బీడీ వర్తకుడి యింటికి దూసుకుపోయాడు. మార్వాడీ సేఠ్ ఉన్నాడు.

"బీడీ వర్తకుడెక్కడ?" అని అడిగాడు కేయాస్.

"సిన్మాథ్యాటర్లో యిచారించీ చూడండి!"

సినిమా థియేటర్లో అడిగితే సినిమాతార యిల్లు విచారించమన్నారు.

సినిమాతారకోసం వెళితే చచ్చిపోయి ఉంది.

"గురో, కొత్తకేసు!" అన్నాడు భద్రం.

"ఎవరు మీరు?" అన్నాడు సినిమాతార తండ్రి.

"బీడీ సాయిబులం - కాదు బీడీ వర్తకుడి యిల్లు కావాలి" అన్నాడు కేయాస్.

"ఢిల్లీ!"

"భద్రం, చలో ఢిల్లీ!"

హెలికాప్టర్ రయ్యిన దూసుకుపోయింది.

ఇంపీరియలిస్టు హోటల్.

"అలోవ్!" అన్నాడు కేయాస్ రిసీవరు ఎత్తి.

"అలోవ్!" అన్నది ఆడగొంతు.

"అలోవ్!"

"అది విన్నా! తరవాత చెప్పు!"

"బీడీసాయిబు -"

"ఆస్పత్రిలో."

"థాంక్స్ యూ!"

బీడీసాయిబు మంచంమీద పడుకున్నాడు. కేయాస్ ఎదురుగా కూచుని మీనార్ దమ్ము ఊపిరి తిత్తుల్లోకి లాగాడు.

# లతా వెంట పడ్డ రోమియో!

లతాకు తొలిరోజుల్లో బాగా పేరు తెచ్చిన పాట 'ఆయేగా ఆనా వాలా ..(మహల్). ఆ పాటకు సంగీతం సమకూర్చిన ఖేమ్‌చంద్ ప్రకాశ్‌ను ఆమె పితృసమానుడిగా భావిస్తే ఆ పాట రాసిన నక్షబ్ అనే కవి ఆమె పాలిట శనిలా దాపురించాడు.

నక్షబ్ సామాన్యుడు కాదు. ప్రేమగీతాలు రాయడంలోనే కాదు, ప్రేమవ్యవహారాలు నడపడంలో కూడా ఘనత వహించాడు. నాదిరా (శ్రీ 420 ఫేమ్), సితారా, హంసావాడ్కర్ (శ్యామ్ బెనగల్ 'భూమికా' సినిమా ఈవిడ ఆత్మకథ ఆధారంగానే తయారయింది). - వీళ్లందరూ అతని ఎదుట తలవంచినవారేనట!

యవ్వనంలో కుటుంబ బాధ్యత నెత్తినపడి సినిమారంగంలో ప్రవేశించిన లతాకు అప్పట్లో లోకం పోకడ అంతగా తెలియదు. అప్పట్లో ఆమె వద్ద పార్కర్ పెన్ ఉండేది. దాని మీద తన పేరు కూడా ముచ్చటపడి చెక్కించుకుంది. ఓసారి రికార్డింగు థియేటరులో నక్షబ్ కంటపడింది ఆ పెన్ను. 'బాగుంది' అన్నాడు. లతాకో దురలవాటు. ఎవరైనా నచ్చిందంటే వెంటనే 'అయితే నువ్వుంచుకో' అని ఇచ్చేసేది. అలాగే ఈ పెన్ను నక్షబ్‌కి ఇచ్చేసింది - దాని మీద తన పేరు ఉన్న విషయం మర్చిపోయి! అది కొంప ముంచింది.

ఓ 20 ఏళ్ల అమ్మాయి ఇలాటి బహుమతి తనకిచ్చిందనగానే నక్షబ్ తల తిరిగిపోయింది. తనంటే లతా పడిఛస్తోందనుకున్నాడు. అనుకోవడమే కాదు, కనబడ్డ ప్రతీవాడికీ చెప్పనారంభించాడు. ఈ మాట లతా చెవులకు సోకినా ఏం చేయలేకపోయింది. వెళ్లి ప్రతీవాడికీ అలాటిదేమీ లేదని చెప్పలేదుకదా! అలా అయితే పేరు చెక్కించి పెన్ను ఎందుకిచ్చావంటే!?

ఈ ఇబ్బందిని నక్షబ్ బాగా ఉపయోగించుకున్నాడు. బాహాటంగా అనడమే కాక నౌషద్ సంగీతం ఇస్తున్న ఓ సినిమా రికార్డింగు సందర్భంలో లతా దగ్గర కొచ్చి ఎదుట నిలబడి "నేను రాసిన ఈ పాటలో ప్రేమంతా కురిపించాలి. నీ ప్రియుడు నీ ఎదుటే ఉన్నాడనుకుని పాడు." అన్నాడు. నక్షబ్ అప్పట్లో పెద్ద గీతరచయిత. అతను ఛీత్కరిస్తే కెరియర్ మీద ఆశ వదులుకోవలసినదే! లతా పళ్లు నూరుకుని ఊరుకుంది.

అలా ఊరుకోవడంతో నక్షబ్ ధైర్యం మరింత పెరిగింది. ఓ మధ్యాహ్నం లతా ఉండే నానా చౌక్‌లో చాల్ దగ్గరకి వచ్చేశాడు. ఇక లతా ఉండబట్టలేకపోయింది. బయటకు లాక్కువచ్చి "చెప్పాపెట్టకుండా ఇలా దిగడంలో నీ ఉద్దేశ్యం ఏమిటి? మళ్లీ ఇక్కడ కనబడ్డావో ముక్కలు, ముక్కలు చేసేస్తా జాగ్రత్త" అని హుంకరించింది. తన కెరియర్ ఏమైనా కానీ, తనపై ఆధారపడ్డ చెల్లెళ్ల భవిష్యత్తు ఏమైనా కానీ, ఆత్మగౌరవం లేకుండా బతకడానికి ఆమె సిద్ధపడలేదు.

తన కృపావీక్షణాలకై కొత్త గాయనీగాయకులు పడిగాపులు కాస్తూ ఉంటే ఓ సీదా-సాదా అమ్మాయి ఇలా కాళికారూపం ఎత్తడం నక్షబ్‌కి మింగుడుపడలేదు. రోజు బాగోలేదని వెళ్లిపోయాడు కానీ ఆశ వదులుకోలేదు. ఎందుకంటే హంసావాడ్కర్ విషయంలోనూ ఇలాగే జరిగింది. తిట్లు, గుద్దులు, నౌకర్ల చేత బయటకు విసిరేయించడాలు - ఇన్ని జరిగినా అతను మళ్లీ ఇంట్లో దూరేవాడు, చివరికి సాధించేడు. లతా విషయంలో కూడా కాస్త ఓపిక పట్టాలనుకుని లోకల్ ట్రయిన్ ఎక్కి లతాను సతాయించడం మొదలుపెట్టాడు. అతని బాధపడలేక ఫస్టుక్లాసు పాసు ఉన్నా సెకెండ్ క్లాసు లేడీస్ కంపార్టుమెంటులో ఎక్కేదామె. ఓ రోజు అది కూడా ఎక్కేశాడు మన మజ్నూ. ఆడవాళ్లందరూ గొల్లుమన్నారు. "నేనెవరో తెలీదూ పెద్ద ఫేమస్ రైటర్‌ని' తెలుసా అని హూంకరించాడు ఇతను. 'వీడు కవీ గాడు, ఏమీ కాడు. పట్టుకు తన్నండి' అంది లతా. బాగా దేహశుద్ధి జరిగింది. అయినా మన విక్రమార్కుడు వదలకపోతే లతా ఖేమ్‌చంద్ ప్రకాష్‌తో మొరపెట్టుకుంది. "ఎక్కడ ఉన్నాడా బద్మాష్!" అంటూ ఖేమ్‌చంద్ వెళ్లి అతని దగ్గర పెన్ను లాక్కుని లతాకు ఇచ్చేశాడు. ఆ తరువాత తన శిష్యులనిద్దరినీ రోజూ లతాకు తోడుగా రమ్మనేవాడు. అంటే రోజూ 25 కి.మీ. రానూ, పోనూ ప్రయాణంలో లతాకు ఏ ఇబ్బందీ కలగకుండా చూడడం వాళ్ల బాధ్యత. క్రమంగా నక్షబ్ లతాను విడిచిపెట్టేశాడు.

కళారంగంలో ప్రవేశించే ఆడపిల్లలందరూ తెలుసుకోదగిన ఈ కథ లతా ఆత్మీయులొకరు చెప్పారు కాబట్టి నమ్మవచ్చు. ఈ కథ విని నీతి గ్రహించడంతో బాటు ఇంతకీ అన్ని సమస్యలకు మూలకారణమైన ఆ పెన్ను చివరికి ఏమయిందాన్న సందేహం వస్తుంది కదా!

ఈ గొడవల్లోంచి బయటపడ్డాక లతా ఓ రోజు చౌపాటీ బీచ్ వెళ్లింది. నీట్లో నడుచుకుంటూ చాలా దూరం వెళ్లి పెన్ను తీసి తన శక్తి కొలదీ సముద్రంలోకి విసిరేసింది. తిరిగిచూడకుండా ఇంటికొచ్చిపడింది. జన్మలో పార్కరు పెన్ను కొనకూడదనీ, కర్మం చాలక కొన్నా పేరు చెక్కించుకోకూడదని ఒట్టు వేసుకుంది.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

"మీరు పెంచుకున్న అబ్బాయి -"

"ఆర్ఫనేజ్ - అంటే శిశు శరణాలయం"

కేయాస్ ఆర్ఫనేజ్‌కి దూసుకుపోయి "సెక్రటరీ" ముందు దూకాడు.

"మీరేనా సెక్రటరీ?"

"అవును".

"బీడీసాయిబు పెంపుడు కొడుకు".

"ఇక్కడ లేడు. ఇంజనీరింగ్ కంపెనీ, మేనేజరు."

"దావూద్ గోపాల్ తెలుసా?"

"తెలుసు".

"ఉన్నాడా?"

"లేడు. బట్టలషాపు"

బట్టలషాపు మేనేజరు.

"దావూద్ గోపాల్ తెలుసా?"

"తెలుసు".

"ఉన్నాడా?"

"లేడు".

"ఎందుకులేడూ?"

"మూటేసుకుని ఊళ్లు తిరగబోయాడు".

"వాళ్లిల్లు?"

మేనేజరు చెప్పాడు.

దావూద్ గోపాలం ఇంట్లోనే ఉన్నాడు.

"నేను డిటెక్టివ్ కేయాస్‌ను"

దావూద్ గోపాల్ భయపడుతూ, "నేను పద్మావతిని చంపలేదండీ!" అన్నాడు.

"నాకా సంగతి మొదటినించీ తెలుసు. నువేం భయపడకు".

కేయాస్ ఇంటికి తిరిగొచ్చాడు.

"ఇప్పుడంతా తెల్లగా ఉంది!" అన్నాడు చెంచితో.

చెంచీ పరిగెత్తుకుంటూ వచ్చి ప్రేమ ఆపుకోలేక అతనిమీద పడింది.

"చెంచీ, సర్ నన్ను ట్రంకు చేసాడా?"

"రోజుకు 30 సార్ల చొప్పున 10 రోజులకూ మూడొందలసార్లు చేసాడు".

"వాండ్రుఫుల్! వాండ్రుఫుల్!"

టెలిఫోన్ మూడొందలొకటోసారి మోగింది.

"అలోవ్!"

"ఈకొసని సర్. ఏమయింది?"

"అంతా తెల్లగా అయింది"

"నేను రానా?"

"వొద్దు నేనే వస్తా".

కేయాస్ బట్టలు మార్చుకుని వెళ్లాడు.

"ఓ తోటవాడా!"

"అయ్!"

"ఇప్పుడు చెప్పు, పద్మావతి చావకమునుపు ఏం చేసింది?"

"బట్టలసాయిబు దగ్గిర పదిరూపాయలు బట్టలుకొని, యాభై రూపాలిచ్చిందయ్యా!"

"అప్పుడు నువేమన్నావ్? జ్ఞాపకం ఉందా?"

"ఆయ్! ఈ బట్టలబ్బి సాయిబల్లే ఉన్నాడన్నానయా!"

"ఆ మాట అన్నావ్?"

"ఆయ్!"

కేయాస్ బుర్ర గిర్రున తిరిగింది. సాయిబు! అగ్నిపర్వతం! ఫటాఫట్! కేయాస్ పరిశోధన ముగిసింది!

"ఏమయింది?" అంటూ వచ్చాడు సర్.

"ఏం కాలేదు. పద్మావతి ఆత్మహత్య చేసుకుంది!"

"ఇన్ని రోజులూ తిరిగి ఇదేనా నువు కనుక్కున్నది?"

"ఆయ్... అంటే నా ఉద్దేశం, అంతేనండి"

"ఇందుకేనా అంత డబ్బు నీ బొందన పోసింది?" అంటూ సర్ సర్రున తుపాకీ తీసి కేయాస్ గుండెలోకి సూటిగా ఆరుగుళ్లు పేల్చాడు.

సరిగా అదే సమయాన చెంచి, కేయాస్ విడిచిన చొక్కాజేబులు పరిశోధన చేస్తున్నది.




## మహామేధావి రాంబాబు!




**నందూరి పార్థసారథిగారు సృష్టించిన విలక్షణ హాస్యపాత్ర రాంబాబు! రాంబాబు ఓ 20 ఏళ్ల కాలేజీ కుర్రవాడు. 'సుజనమిత్ర' అనే లార్జెస్ట్ సర్కులేటెడ్ డెయిలీ ఫ్రమ్ చింతల్‌బస్తీ (సర్కులేషన్ 2 వేల కాపీలు)లో పార్ట్‌టైము ఉద్యోగం. తన అరకొర తెలివితేటలతోనే తను మహామేధావిననుకుంటాడు రాంబాబు. ఇంగ్లీషు, తెలుగు సరిగా రాక కొంత, 'స్వేచ్ఛా'నువాదాల వల్ల కొంత, కుతర్కం వల్ల కొంత, అమాయకత్వం, అజ్ఞానం, అతితెలివి వల్ల కొంత - రకరకాలుగా తనకు తెలియకుండానే బోల్డంత హాస్యాన్ని పంచాడు రాంబాబు.'రాంబాబు డైరీ' (రెండవభాగం)లో వింత ఆలోచనా ధోరణికి కొన్ని ఉదాహరణలు:**

* ఇదివరకు పదిపైసలు అడుక్కునే వాళ్లు ఇప్పుడు అర్ధరూపాయి, రూపాయిలు అడుక్కుంటున్నారు. రూపాయి విలువ అంతగా దిగజారి పోయిందన్నమాట.
* పాశ్చాత్య దేశాలలో సైతం బిచ్చగాళ్ళున్నారు. అయితే వాళ్లు ఇండియాలో మాదిరిగా చింకిపాతలు ధరించి, బొచ్చెలు చేతబట్టుకుని అడుక్కోరు.
* ముష్టివాళ్ల నుంచి కుష్టు వాళ్లను వేరు చేసి, మిగిలిన వాళ్లందరికీ ఆదరణ పథకం కింద యూనిఫాం సూట్లు, బూట్లు, హ్యాట్లు సరఫరా చేయాలి. నీటుగా క్షవరం చేయించి, కొంచెం మేకప్ చేయించి ట్రిమ్ముగా తయారుచేయాలి. తర్వాత సెంటు పూసి ఏర్‌పోర్ట్ - హైటెక్ సిటీ రూటులోనూ, క్లింటన్ మున్నగు విదేశీ ప్రముఖులు వెళ్లే ఇతర రూట్లలోను అడుక్కోడానికి అనుమతించాలి. ఇంగ్లీషులో అడుక్కోడానికి వీలుగా వాళ్లకి ఒక క్రాష్‌కోర్సు నిర్వహించాలి.



* ప్రస్తుతం కొందరు భిక్షకులు గాంధీ వేషంలో జనాన్ని ఆకర్షిస్తున్న దృష్ట్యా, ఇతర జాతీయ నాయకుల వేషాలను, ప్రస్తుత రాష్ట్ర నాయకుల వేషాలను సైతం అనుమతించే విషయం శ్రద్ధగా పరిశీలించవలసి ఉంది.
* అసలు దుఃఖం వల్లనే మానవులకు ఏడ్పు వస్తుంది. ఏడ్పువల్లనే దుఃఖనివృత్తి కలుగుతుంది. ఏడ్చే వాళ్ళను ఏడవనీ అనే పాత సినిమా పాట ఇది వరకు అప్పుడప్పుడు రేడియోలో వినిపిస్తూ ఉండేది. అది రాసిన కవి భావమేమిటో అప్పట్లో అర్థం కాలేదు. ఇప్పుడు అర్థమవుతోంది.
* నిజానికి ఏడుపంత సహజమైన, తేలికైన పని మరొకటి లేదు. మనిషి భూమ్మీద పడగానే ఎటువంటి ప్రోద్బలం లేకుండా అప్రయత్నంగా చేసే పని ఏడవడమే కదా! అందుచేత ఇక నుంచి తీరికైనప్పుడు శాయశక్తులా ఏడవాలని నిర్ణయించుకున్నాను. చెప్పొచ్చేదేమిటంటే ఏడవడానికి నేను పడినఅవస్థ తలుచుకుంటే చచ్చే నవ్వొస్తోంది. (- వచ్చే సంచికలో మరికొన్ని)



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## ఏడు కొండలపైకి ఎక్కాలి

ప॥ ఏడుకొండలపైకి ఎక్కాలి - ఎంకన్న పాదాలు మొక్కాలి
గోవిందనామాలు పలకాలి - మా పిలుపులో ఆసామి కులకాలి
గోవిందా గోవిందా వెంకట రమణ గోవిందా
ఏడు కొండల వెంకట రమణ గోవిందా గోవిందా

1. చ॥ ఓ.... ఈ దూరవాసులు నీ చరణదాసులు - ఇడలేరు నీ వడ్డికాసులు
నినుతలచిన చాలు పొంగే హృదయాలు - నీ పూజకు విరిసే కుసుమాలు
ఆ.... శ్రీదేవి వలపుతో అలమేలు అలకతో - బంధించే సరసాల వేళ
దరిశించి తరియించ రావాలి - యీ హృదయకుసుమాలు తేవాలి ॥గోవింద నామాలు పలకాలి॥

2. చ॥ ఓ... పెదవుల రాజిల్లు నవ్వుల హరివిల్లు - దీనులపై దీవెనలే జల్లు
నీ చల్లని కళ్ళు వెన్నెల పొదరిళ్ళు - నీ చూపే దయచూపే యిల్లు
ఆ... నినుచేరలేము నినువీడ లేము - మా మనసే కోవెల చేసేము
ఆ కొండ దిగి నువ్వు రావాలి - గుండెల్లో కాపురము చేయాలి ॥గోవింద నామాలు పలకాలి॥



రచన : కీ॥ శే॥ కోపల్లె శివరాం
గానం : ఎం.చిత్తరంజన్
సంగీతం : ఎల్. నిర్మల్‌కుమార్
రాగం : హరికాంభోజి ఖమాజ్ థాట్ (హిందుస్తానీ సంగీతం)
28వ మేళకర్త రాగం తాళం: త్రిశ్రఏక (కర్ణాటక సంగీతం)
దాద్రా (హిందుస్తానీ)

ఆరోహణ : స రి గ మ ప ద ని స
అవరోహణ : స ని ద ప మ గ రి స

షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం చతుశృతి దైవతం కైశికి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

ఈ పాటకు కూర్చిన బాణీలో అన్యస్వరమైన కాకలి నిషాదమును కూడా ఉపయోగించారు స్వరకర్త. జానపద సంగీతంలో ఈ విధమైన స్వరాల కలయికే మనకు ఎక్కువగా కనబడుతూ వుంటుంది. సంప్రదాయ జానపద గీతాలు - మామానాగులో, అంతే నాకు చాలు తమ్మలపాకు తొడిమే పదివేలు, చిల్లర రాళ్ళకు మొక్కుతుంటే, నెరానెరా నెరబండి మొ॥ ఎన్నో పాటలలో హరికాంభోజి రాగపు స్వరాలతో కాకలి నిషాదం చేరి ఉన్న మిశ్రమ పోకడలు దర్శనమిస్తాయి. భారతదేశంలోని యించుమించు అన్ని ప్రాంతాల జానపద సంగీతంలోనూ ఈ మిశ్ర హరికాంభోజి (మిశ్ర ఖమాజ్ హిందుస్తానీ) స్వరాల పోకడలు కనిపిస్తాయి. దక్షిణాది రాష్ట్రాలలోనే కాక బెంగాలీ, మరాఠీ ప్రాంతాల్లో కూడా మిశ్ర హరికాంభోజి బాణీలు వినబడుతాయి. బెంగాలీ సంగీతంలోనూ ముఖ్యంగా రవీంద్ర సంగీతంలో కూడా ఈ మిశ్రమంతో పాటు శుద్ధ దైవతాన్ని కూడా చేర్చి బాణీలు కూర్చటంతో ఆ ప్రాంతీయ సంగీతానికి ఒక ప్రత్యేకత, విశిష్టత ఏర్పడింది.

లలిత సంగీతంలో కూడా జానపద సంగీత రీతులతో కూర్చిన బాణీలు ఎన్నో మనం తరచూ వింటున్నవే. గీత రచన జానపద శైలిలో లేకున్నా నూతనత్వం కోసం దానికి జానపద సంగీత శైలిని జోడించి మట్లు కూర్చటం కూడా లలిత సంగీతంలో ఒక ప్రత్యేకత. ఆ విధంగానే స్వరకర్త నిర్మల్‌కుమార్ "ఏడుకొండలపైకి ఎక్కాలి" అనే ఈ పాటకు జానపదరీతిని అన్వయించి సంగీతం కూర్చారు.





# కీ॥శే॥ కోపల్లె శివరాం



అది 1969వ సంవత్సరం. ఒక రోజు సాయంత్రం నేను, మిత్రుడు మోహన్‌రాజు ఒక పని మీద కాచిగూడ లోని టూరిస్టు హోటల్‌కి వెళ్ళాము. అక్కడ ఎన్.డి.బాబూరావు అనే సంగీత దర్శకుడు తన పక్కనే కూర్చున్న ఎర్రట్లగా ట్రిమ్‌గా వున్న ఒక కుర్రవాణ్ణి చూపించి "ఇతను పాటలు బాగా రాస్తాడండీ. మీ కార్యక్రమాలకు ఉపయోగించుకోండి" అని నాకు పరిచయం చేశాడు. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నేను రెండు రోజులలో కుటుంబ సంక్షేమ కార్యక్రమానికి కొన్ని పాటలు రికార్డు చేయవలసి వుంది. అతడిని "మరుసటి రోజుకి కుటుంబ నియంత్రణ గురించిన 2 పాటలు రాసి తెస్తావా" అని అడిగాను. అతను ఆ మరునాడు 2 చక్కటి పాటలతో స్టూడియోలో ప్రత్యక్ష మయ్యాడు. ఆ విధంగా ఆకాశవాణికి పరిచయమైన ఆ యువకుడు కోపల్లె శివరాం. అప్పటి నుండి అతని అవిశ్రాంత సాహితీ యాత్ర ప్రారంభమైంది. ఈమని శంకరశాస్త్రి, పాలగుమ్మి విశ్వనాథం, నిర్మల్‌కుమార్, పి.వి.సాయిబాబా, ఉషాకాంత్ మొదలగు స్వరకర్తల బాణీలకు చక్కని పాటలు రాశాడు. ఆకాశవాణిలో శివరాం రచించిన పాటలు, సంగీత రూపకాలలో అధిక శాతం నేను సంగీతం కూర్చినవే ఉన్నాయి. త్రిపథ, ఆవంతిక వంటి సంగీత రూపకాలు, "ఇది చల్లని తల్లిరా", "ప్రణయానికి చల్లదనం" (గజల్) మొదలైన పాటలు శివరాం రచించగా నేను స్వరపరచినవి ఆకాశవాణిలో విస్తృత ప్రచారాన్ని పొందిన వాటిలో మచ్చుకు కొన్ని మాత్రమే. 1960లో పాటలు రాయడం ప్రారంభించిన యీ యువకవి 1962లో 'రత్నభర్గ' అనే దిన పత్రికను తన సంపాదకత్వంలో కొంతకాలం నడిపాడు తన స్వగ్రామమైన ఏలూరులో. శివరాం మంచి రచయిత మాత్రమే కాదు చక్కని చిత్రకారుడు కూడా. కమర్షియల్ ఆర్టిస్టుగా 1965-66 ప్రాంతంలో 'జ్యోతి' మాసపత్రికలో ఆర్టికల్స్‌కి చక్కని బొమ్మలు వేసేవాడు. 1969 నుండి ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంతో అనుబంధాన్ని పెంచుకొని మంచిగేయ కవిగా పలువురి మన్ననలు పొందాడు. అనేక చలన చిత్రాలకు సుమధుర గీతాలను అందించాడు. పెండ్యాల సంగీత నిర్వహణలో 'గాలివాన' చిత్రానికి "గలగలమని నవ్వకే సొగసు కరిగిపోతుంది" అనే

పాట, జి.కె.వెంకటేశ్ నిర్వహణలో "తరం మారింది" చిత్రానికి "రాముడే దేవుడైతే" అనే పాట, "ఇంటింటి రామాయణం"లో "ఈ తరుణము వలపే శరణము", ఉషా కిరణ్ మూవీస్ వారి కొన్ని చిత్రాలకు, డైరెక్టర్ హనుమాన్ ప్రసాద్ గారి చిత్రాలకు ఎన్నో పాటలు రాశాడు.

ఏ పాట రాసినా ఉన్నత ప్రమాణాలు కలదిగా వుండాలని, అందరినీ ఆకట్టుకునే రీతిలో సాగాలి అనే తపన అతనిలో ఎంతగానో కనిపించేది. ఏ స్వరకర్తకు పాట రాసినా దానిని నాకు చూపించి నేను బావుందని అంటే గాని తృప్తిపడే వాడు కాదు. నా యందు అతనికి అంతటి గురుభావం ఉండేది. ఇటు ఆకాశవాణిలోను, అటు చిత్రరంగంలోను మంచి కవిగా పేరు తెచ్చుకుంటున్న తరుణంలో అకాల మృత్యువు అతనిని కబళించేస్తుందని ఎవరూ ఊహించలేదు. తన 44వ ఏటే 1986లో అందరికీ ప్రీతిపాత్రుడు అత్యంత ఆత్మీయుడుగా ఎప్పుడు నవ్వుతూ అందరినీ తన జోక్స్‌తో నవ్విస్తూ మెలగే కోపల్లె శివరాం తన జీవితానికి సడెన్‌గా ఫుల్‌స్టాప్ పెట్టేసి వెళ్ళిపోవడం కడు విచారకరం.

## ఎల్. నిర్మల్‌కుమార్

అది నైజాం నిరంకుశపాలన సాగిస్తున్న కాలం. 20వ శతాబ్ది తొలిదశలో హైదరాబాదులో తెలుగు భాషకు ఏ మాత్రం గుర్తింపు లేక పోయింది. అటువంటి సమయంలో తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికి ప్రచారాన్ని కలిగించడానికి నడుం కట్టిన మహనీయులలో శ్రీ శంకర నారాయణ గారొకరు. ఆయన, మాడపాటి హనుమంతరావు మున్నగు వారు ఆ దిశగా చేసిక విశేష కృషిఫలితమే శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం యొక్క ఆవిర్భావం. శంకరనారాయణ గారు 'గోలకొండ' పత్రికను స్థాపించి సంపాదకత్వం నెరపారు. వారి కుమారుడే శ్రీ నిర్మల్‌కుమార్. చిన్నతనం నుండే నిర్మల్ కుమార్‌గారికి లలిత సంగీతం పట్ల మంచి అభిరుచి ఏర్పడింది. జన్మించింది హైదరాబాదులోనే అయిన నిర్మల్‌కుమార్ తండ్రిగారితో బాటు కొంత కాలం బొంబాయి లో నివసించారు. అందువల్ల హిందీ లలిత సంగీతం పట్ల, హిందుస్తానీ శాస్త్రీయసంగీతం పట్ల మక్కువ కలిగింది. హిందీ చిత్రసీమలో ప్రఖ్యాత సంగీత దర్శకులైన పంకజ్ మల్లిక్, ఆర్.సి.బొరాల్, కమల్‌దాస్ గుప్తా, అనిల్ బిస్వాస్, నౌషాద్, రోషన్ మొదలగు వారి గీతాలను తరుచూ వింటూ విశ్లేషించు కుంటూ జ్ఞానాన్ని పెంపొం దించు కున్నారు. వీరందరి కంటే నిర్మల్ కుమార్‌ను ఎక్కువ ప్రభావితం చేసిన వారు సలిల్‌చౌదరి. నిర్మల్ కుమార్ కొంతకాలం సలిల్ చౌదరి బృందంలో సభ్యుడుగా కూడా కొనసాగారు.



ఎల్. నిర్మల్‌కుమార్

50వ దశకం నుండి నిర్మల్‌కుమార్ హైదరాబాద్‌లో స్థిర నివాసం ఏర్పరుచుకొన్నారు. హిందీ సినీగీతాల కార్యక్రమాలెన్నిటిలోనో పాల్గొంటుండే వారు. ఎంతో మంది యువగాయనీ గాయకులకు శిక్షణనిస్తూ వచ్చారు. 1966లో 'హైదరాబాద్ ఫిలిం టాలెంట్స్ గిల్డ్' అనే సంస్థ ప్రారంభించడం జరిగింది. నేను, నిర్మల్‌కుమార్ అందులో స్థాపక సభ్యులుగా ఉండి ఎన్నో సంగీత కార్యక్రమాలను నిర్వహించాం. నిర్మల్‌కుమార్ ఆకాశవాణిలో సంగీత దర్శకుడుగా గుర్తింపు పొందినప్పటి నుండి ప్రఖ్యాత కవుల గీతాలెన్నిటికో తమ అద్భుత స్వరరచనతో శాశ్వతత్వాన్ని సమకూర్చారు. కోపల్లె శివరాం, డా॥ ఎం.పద్మినీదేవి రచించిన గీతాలకు అధిక సంఖ్యలో నిర్మల్ సంగీతం సమకూర్చారు. హిందీ సంగీత దర్శకుల ప్రభావం ఉన్నప్పటికి నిర్మల్ సంగీత రచనలో తనదైన ఓ ప్రత్యేకశైలి ఏర్పరచుకొన్నారు. 7 పదుల వయస్సులో కూడా నిర్మల్‌కుమార్ నేటికి నిత్యనూతనమైన బాణీలను సమకూరుస్తూ కళామతల్లికి సేవ చేస్తున్నారు.

### మిశ్ర హరి కాంభోజి రాగం ఆధారంగా జానపద సంగీత శైలిలో విరిసిన చిత్రగీతాలు

#### తెలుగు

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఏరువాకాసాగారోరన్నో చిన్నన్న | రోజులుమారాయి | జిక్కి | మాస్టర్ వేణు |
| 2. | ఆడుతూ పాడుతూ పని చేస్తుంటే | తోడికోడళ్ళు | ఘంటసాల, సుశీల | మాస్టర్ వేణు |
| 3. | చెట్టులెక్కగలవా ఓ నరహరి | చెంచులక్ష్మి | జిక్కి, ఘంటసాల | ఎస్.రాజేశ్వరరావు |
| 4. | చిల్లర రాళ్ళకు మొక్కుతూ | పూలరంగడు | ఘంటసాల, నాగయ్య | ఎస్.రాజేశ్వరరావు |
| 5. | ఎవరికి వారే యీలోకం | సాక్షి | కెబికె మోహన్‌రాజు | కె.వి.మహదేవన్ |

#### హిందీ (మిశ్ర ఖమాజ్ రాగం ఆధారంగా)

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | సున్‌మేరే బంధూరే | సుజాత | ఎస్.డి.బర్మన్ | ఎస్.డి.బర్మన్ |
| 2. | మేరేదేశ్‌కీ ధర్తీ | ఉప్‌కార్ | మహేంద్రకపూర్ | కళ్యాణ్‌జీ - ఆనంద్‌జీ |
| 3. | మేరామన్ ఖోలాఖోలా | బిరాజ్‌బహు | ద్విజేన్ ముఖర్జీ | సలిల్ చౌదరి |
| 4. | సఫల్ హోగీతేరీ ఆరాధన | ఆరాధన | ఎస్.డి.బర్మన్ | ఎస్.డి.బర్మన్ |
| 5. | బన్సీ క్యూఁగాయే | పరఖ్ | లత | సలిల్‌చౌదరి |
| 6. | ఓరే మాఝీ | బందిని | ఎస్.డి.బర్మన్ | ఎస్.డి.బర్మన్ |
| 7. | గంగా ఆయే కహాఁసే | కాబూలీవాలా | హేమంతకుమార్ | సలిల్‌చౌదరి |

న్యూస్ వ్యూస్

# ముంబాయిలో 'హాసం' ప్రథమ వార్షికోత్సవం

గత సంవత్సరం అక్టోబరు 1 వ సంచిక నుండి ప్రారంభమయిన 'హాసం' ప్రచురణ ఏడాది పూర్తయిన సందర్భంగా ముంబాయిలో సెప్టెంబరు 28 న జరిగిన ఒక సభలో అక్టోబరు 1-15, 2002 వార్షికోత్సవ సంచిక ఆవిష్కరణ జరిగింది. 'హాసం' అభిమాని, ముంబాయి నివాసి, బ్యాంకు మేనేజరు అయిన శ్రీ ఎం.సిద్దా రెడ్డి ఆధ్వర్యంలో వాషి (న్యూ బాంబే) లోని కన్నడసంఘం ఆవరణలో జరిగిన ఈ సభకు న్యూ బాంబేలోని తెలుగువారు పెద్దసంఖ్యలో హాజరయ్యారు. ముంబాయిలో ఒక పత్రిక గురించి ఇంతమంది అభిమానులు సభకు రావడం విశేషంగా చెప్పుకొన్నారు అక్కడివారు.

సభాప్రారంభంలో శ్రీమతి విజయాప్రసాద్, శ్రీమతి కిరణ్మయిలో ఆధ్వర్యంలో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. వాటిలో మహిళలు, పిల్లలు ఉత్సాహంగా పాలుపంచుకున్నారు. ప్రొఫెషనల్స్‌కు ఏ మాత్రం తీసిపోని స్థాయిలో స్థానికులు పాటలు పాడేరు, నృత్యం చేశారు, స్కిట్‌లు వేశారు. సభికుల హర్షామోదాల మధ్య ఆ కార్యక్రమం జయప్రదం అయ్యాక 'హాసం' సమావేశం



సమావేశం నిర్వహించిన శ్రీ యం. సిద్దారెడ్డి, ముఖ్య అతిథి శ్రీ శ్రీపాద చంద్రశేఖర్, ఆత్మీయ అతిథి ఎమ్బీయస్ ప్రసాద్, మీర్జా అలీ

జరిగింది.

శ్రీ గంగాధరరెడ్డి కంపియర్‌గా వ్యవహరిస్తూ ఆహూతులను వేదికపైకి ఆహ్వానించారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన శ్రీ శ్రీపాద చంద్రశేఖర్ రిలయన్స్ ఇన్ఫోకామ్ లో హ్యూమన్ రిసోర్సెస్ విభాగానికి ప్రెసిడెంటుగా ఉన్నారు. ఆయన తన ఉపన్యాసంలో దేశంలో ఎక్కడ ఉన్నా చిన్నప్పటినుండీ పిల్లలకు తెలుగు అలవాటు చేయాలని కోరారు. పత్రికలు చదివే అలవాటు పోగొట్టుకోవడం మంచిది కాదనీ, అసలు చదివే అలవాటంటూ అయితే అప్పుడు ఏది మంచి పత్రికో తెలుస్తుందనీ అన్నారు.

'హాసం' మేనేజింగు ఎడిటరు శ్రీ ఎమ్బీయస్ ప్రసాద్ మాట్లాడుతూ ఇలా అన్నారు - "చిన్నప్పటినుండీ రిలాక్సేషన్‌కై పుస్తకాలపై ఆధారపడినవాళ్లు టీవీలను పూర్తిగా ఎంజాయ్ చేయలేకపోతున్నారు. కొత్తపత్రికల ధోరణులకు అలవాటు పడలేకపోతున్నారు. వారిని కూడా దృష్టిలో పెట్టుకుని 'హాసం' రూపొందించబడింది. ముంబాయిలాటి నగరంలో ఒత్తిళ్లు మరీ ఎక్కువ. రిలాక్స్ కావడం మరింత అవసరం ఈ నగరవాసులకు. మానసిక ఒత్తిళ్లను ఎదుర్కోవడానికి సాధనాలైన హాస్యం, సంగీతం అనే సబ్జక్ట్‌లతో ఈ పత్రిక ఆరంభించి ఏడాది పాటు దిగ్విజయంగా నిర్వహించి, మంచి పత్రికలకు కూడా మనుగడ ఉందని నిరూపించడం జరిగింది. ముంబయ్‌లో 'హాసం' లభ్యమవుతోంది కాబట్టి ఆ అవకాశాన్ని మీరూ ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను."

శ్రీ బి.వెంకటేశ్వరరెడ్డి, మీర్జా అలీ కూడా వేదిక నలంకరించారు. శ్రీ జె.ఎం.ఎస్. గుప్తా వందన సమర్పణ కావించారు. ఇటీవలే మహారాష్ట్ర ఎడిషన్ ప్రారంభించిన 'ఈనాడు' లో ఈ సమావేశం గురించిన వార్త చోటు చేసుకుంది. మరుసటిరోజు నవీముంబయ్ లోని శ్రీమతి కిరణ్మయి, గోఖలే గార్ల ఇంట్లో 'నేటి సాహిత్యంలో హాస్యం' అనే విషయంపై సాహితీసమావేశం జరిగింది. సర్వశ్రీ కొడవటిగంటి రోహిణీప్రసాద్, కొడవటిగంటి పద్మాకర్, ఎస్.సురేంద్రనాధ్, అంబల్ల జనార్దన్, ఎ.మల్లికార్జునరెడ్డి, ఎన్.కె.రామారావు (నల్గొండ), బి.రామారావు, తులసీరాం



(కార్టూనిస్టు) ఓ. సుబ్రహ్మణ్యం, (ఆంధ్రమహాసభ), కిరణ్మయి, సిద్దారెడ్డి, బి.హరిప్రసాద్, తదితరులు పాల్గొన్న ఈ సభ రసవత్తరంగా సాగింది. ముంబయ్‌లో తరచుగా ఇలాటి సమావేశాలు విస్తృతంగా, తరచుగా, పెద్దస్థాయిలో జరగాలని సభికులు కోరారు.



ఘనంగా 'హాసం' ప్రథమ వార్షికోత్సవం

సీరియల్

6

# సినీతిచంద్రిక

రావి కొండలరావు



> **జరిగిన కథ**
>
> **ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించ సాగాం....**
>
> **(ఇక చదవండి)**

"మనది బెంగాలీ కథకు అనుసరణ అనో, మక్కీ అనో పబ్లిసిటీ చేయించామనుకోండి - దాని మజా మా మజాగా ఉంటుందిలెండి - గురూ గారూ," అన్నాడు ఫలానా.

నిర్మాత కాస్సేపు ఆలోచించి, "అయితే, ఓటిసేద్దాం. మన కతనే మనం తీసుకుందాం. తెలుగుకతే ననుకోండి. ఐతే బెంగాలీ అని ఏయించి పారేదాం" అన్నాడు.

"వ్హాట్ బ్రిలియంట్ ఐడియా! ఇండస్ట్రీలో ఉండవలసిన వారు" అని మెచ్చుకున్నాడు సలహా.

"జూసినా - సలహాలోడికే సలహాలిచ్చే పాటి వాడినైనాను" అని తనను మెచ్చుకున్నాడు నిర్మాత.

"పోనీ జానపదం ఐతే?" అన్నాను నేను.

"అదొద్దులేవయ్యా - మనం ఎక్కడ ఏస్తాం - మేడలూ. మిద్దెలూనూ, సాంగికమే చూడండి సులువులో పోతాది, కాదూ లేదూ అంటే, పల్లెటూరు పెట్టినారా - మా ఊల్లో కొట్టిపారేద్దాం".

"పౌరాణికం" అన్నాడు ఫలానా.

"పౌరాణికం పర్వాలేదు గాని - ఆల్లకి కిరీటాలూ అవీ తేవొద్దూ?"

"అవి అద్దెకు తెచ్చుకుందాం"

"అద్దెమాత్రం ఇయ్యేద్దా అని"

"సరేగానీండి - మహాభారతం తీసుకోవచ్చునండీ - యూనివర్సల్ సబ్జక్టు - సేఫ్‌టీనూ" అన్నాను నేను.

"నీ టీ, కాఫీ ఎవడిగ్గావాలయ్యా - ఇదిగో సూడు - డబ్బులు రాలేది ఆటికే. అయితే, ఆల్లకా యిగ్గులూ, చెవిఁకీ కోట్లూ తేపోతే - నాసామిరంగా ఒక్కడూ సూడ్డు. ఐనా సవకలోన ఏరపాటు సెయ్యండి - సూదాం".

"ఐతే భారతం తీసుకుందాం" అన్నాను నేను.

"నోనో - మనవాళ్లు ట్రాజెడీలు లైక్ చెయ్యరు మహాభారతా ఈజ్ ఏ ట్రాజడీ" అన్నాడు సలహా.

"దెన్?" అన్నాడు ఫలానా.

"అవునయ్యా - ఇంతంత గొప్పవాళ్ళూ చివరకు దిక్కుమాలిన చావులు చచ్చారు - యక్షుడి దగ్గర. ఇంత కృష్ణుడూ ఎరుకలవాడి చేతిలో చచ్చాడుఁ వాటీజ్ ఆల్‌దిస్? అంత గ్రేటెస్టు వారియర్సూ - వాళ్లకీ గతా - అసలు ఆ భారతంలో ఉన్న లోపమే అది. చూడండి కవిగారు! కాస్త దాన్ని ఆ విధంగా కాకుండా, ఎండింగులో అందరూ హేపీగా కలుసుకున్నట్టు చెయ్యగలిగారా - ధన్యులమే" అన్నాడు సలహా.

"అదెట్లాగండీ - ఉన్న కథ గదా అది!" అన్నాడు రచయిత.

"ఊరుకోండి - ఉన్నకథను ఎవడండీ ఉన్నదున్నట్లు తీస్తున్నాడూ? మనం మారుస్తాం.... మన యిష్టం!" అన్నాడు సలహా.

ఎవరూ మాట్లాడలేదు. మళ్ళీ అతనే అన్నాడు --

"ఈ మధ్యే ఇలాగే - ఒకాయన లైలా మజ్ను తీస్తానన్నాడు తీస్తే తీశావుగానీ - చివరకు వాళ్ళిద్దర్నీ చంపకు - కలిపి పారేయ్.... ఎడారీ అదీ ఉంచు. అయితే చివరికొచ్చేసరికి, ఇద్దరూ కలిసి ఒకటై పోవాలీ - అంటే, ఎన్ని గాలివానలొచ్చినా సరే, నిర్మల ప్రేమ జయిస్తుంది అని నీతిగానీ - చస్తే ఏముందయ్యా అని చెప్పాను. ట్రాజడీలు మనవాళ్ళు నచ్చరు - ఇదే నా పాయింటు" అన్నాడు సలహా ఉద్రేకంగా, చేత్తో టేబులుమీద బాదేస్తూ.

"ఐతే సాంఘికం కానిద్దామా?" అన్నాను నేను.

"అదేం మంసిది లేవయ్యా - ఏదేనా అటూ యిటూ అయినా



సద్దుకుపోద్దీ" అన్నాడు నిర్మాత.

"యస్. యూ మే నేరేట్ ది స్టోరీ" అన్నాడు సలహా.

నిర్మాత నాకేసి చూశాడు.

"ఏం లేదు. కథ మొదలెట్టమంటున్నారు. కవిగారిని" అన్నాను నేను.

"ఆహాఁ - కానీ"

"కానీ అంటే అదే కానీవే మరి. దానికోసమేగా ఈ అవస్థలు! మరి నాకు ఏమిస్తారో ఏం చేస్తారో ముందే అనుకోకపోతే ఎట్లా?" అన్నాడు రచయిత.

"సూదాం లేవయ్యా - అన్నట్టు నీ పేరేందయ్యా - తెలీక అడిగాను".

"దైన్యశ్రీ" అన్నాడు రచయిత.

"ఇదేందయ్యా - ఇదీ బెంగాలీయేనా?" అన్నాడు నిర్మాత.

"కాదండీ నా కలం పేరు"



"ఇదేందయ్యా నీ కలం పేరు. అదేదీ. ఫయిలటూ, పారకరూ గాదయ్యా?" అని నిర్మాత ఆశ్చర్యపోతూ "ఇదేదో కొత్త కంపెనీ పేరులా ఉంది" అన్నాడు.

మేం కొద్దిగా నవ్వాము.

"అది కాదండీ - నా మారు పేరు. రాసేటప్పుడు ఈ పేరుతో రాస్తాను".

"అట్ట చెప్పు" అన్నాడు నిర్మాత.

"మరి నా మాట..." అన్నాడు కవి.

"అది తర్వాత తేల్చుకుందాంలే ముందు కథ చెప్పు" అన్నాడు సలహా.

"సారీ... ముఖ్యంగా అసలు ఎక్కడైనా... అందులో... ఈ పరిశ్రమలో ముందుగా డబ్బు మాట్లాడుకునిగాని పనికి ఒప్పుకోరాదు." ఈ విషయమై మీకు ఓ కథ చెబుతా వినండి.

ఒకాయన సినిమా పరిశ్రమలో లాభాలు కొట్టేద్దామని ప్లానులు వేసి, అంతక్రితం తాను చేస్తున్న ఒక సినీ ఉద్యోగానికి సలాముకొట్టి, కొంత మందినీ, కొంత డబ్బునూ పోగేసి, పెద్ద సినిమా తీస్తే ఇబ్బందులకు లోనుగావలసి వస్తుందని, ముందుగా ఒక డబ్బింగు చిత్రాన్ని తయారు చేయాలనుకున్నాడు. ఆ విధంగా 'ప్లాని'అనగా 'పన్ని' అని పాఠాంతరము. పన్నుటయనగా వలపన్నుట. పన్నులు పన్నుట - యట్లే ప్లానులు పన్నుట - ఇంగ్లీషుభాష నుంచి కొన్ని మాటలల్చేసి, తెలుగై కూచున్న 'రోడ్డు' బాపతు మాటగా ఈ 'ప్లాని' కూడా నన్నమాట. ఏం చెబుతున్నానూ - ఆఁ... ప్లానేసి ఒక చిత్రాన్ని కొన్నాడు. దాన్ని తెలుగులోకి 'డబ్' చెయ్యాలి! ఒక రైటర్ను మాట్లాడాడు, మాట్లాడటం అంటే ఏమిటి - మాట్లాడలేదన్న మాట! రాత్రికి రాత్రి వెళ్ళి, ఆయన్ను లేపి, 'మీరు నాకు డబ్బింగు రాయాలి. ఇదిగో స్క్రిప్టు. తెల్లవారితే కాల్‌షీటు, మీరేం అనుకోవద్దు. మూడు రోజుల్లో పిక్చరు ఫినిష్ కావాలి' అని చెప్పేసి తుర్రుమని పోయాడు. పెద్దమనిషి అడిగాడు గదా అని, రైటరు ఒప్పుకున్నాడు. రాత్రంతా మేలుకుని చాలామట్టుకు డైలాగులు రాసేశాడు. ఉదయమే డబ్బింగు. తనకు సంబంధం లేకుండా ఉండాలని నిర్మాత తన తరుపున ఒక మనిషిని ఏర్పాటు చేశాడు. ఈ మనిషి డబ్బింగు ఆర్టిస్టులను పిల్చుకొచ్చాడు. టకటకా జరిగిపోయింది -- పని. మూడు రోజుల్లో డబ్బింగు ఐపోతే, అంత డబ్బూ ఒక్కసారే ఇస్తారు గదా అని - ఎవరూ డబ్బు సంగతి ఎత్తలేదు. అసలు 'ఎంత' అని ఎవరూ మాట్లాడుకోలేదు. పగలూ, రాత్రీ విసుగూ విరామం లేకుండా డబ్బింగ్ పూర్తి చేశారు. ఆ మర్నాడే పిక్చరు విడుదల! ఇదిగో వస్తానని, ఒక్కడికీ కానీ చేతిలో పెట్టకుండా పారిపోయాడు నిర్మాత. ఎవడికి ఎంత యిస్తాడో తెలీదు. ఏం చేస్తాడో తెలీదు. ఐతే, పాపం ఆర్టిస్టులంతా మంచివాళ్ళు. 'పోనీలే, రాగానే యిస్తాడు గదా' అనుకున్నారు.

కొన్నాళ్ళు కాయన దిగాడు. డబ్బింగ్ ఆర్టిస్టులూ, మ్యూజిక్ వాళ్ళు డబ్బుకని వెళ్ళారు. వాళ్ళతో మాట్లాడడే? పైగా 'రైటర్కే' కానీ ఇవ్వలేదు అంటాడు. మరి కొన్నాళ్ళకి మళ్ళీ వెళితే 'ఎవరు మీరు? ఎందుకొచ్చారు? ఏం కావాలి? మీరు డబ్బింగు చేశారా? ఏ చిత్రం? ఎప్పుడూ?" అంటూ మాట్లాడాడు. ఎవరేం చేస్తారు చెప్పండి - ఓ ఎగ్రిమెంటా - ఓ మాటా! ఏమీ లేదు. అందరూ కోరస్‌గా శాడ్‌సాంగ్ పాడుకుంటూ ఇళ్ళకుపోయారు. దీని సినీతి-

"ఇంత డబ్బు అని మాట్లాడుకోనిదే ఈ పరిశ్రమలో ఏ పనీ చెయ్యరాదు" అని తేల్చాడు రచయిత.

"అందర్నీ అట్టాగే గడతావా!" అన్నాడు నిర్మాత.

"అందరి మాటా నేను చెప్పానా - ఎందుకేనా మంచిది. ముందుగా మాట్లాడుకోవటం, అన్నాను గాని"

"అట్లాగేనయ్యా - నువ్వు కథ చెప్పు. ఆ కథ నచ్చితేకదా, నీ విషయం ఆలోచించేది" అన్నాడు సలహా.

"నేను ముందుగా కథ చెప్పను. తీరా మీకు నచ్చాక, నచ్చలేదని నాతో అబద్ధమాడి. అందులో ఏదన్నా ఉంటే దాన్ని కాస్తా తస్కరిస్తారు. అమ్మో! ఎంతాశ" అన్నాడు రచయిత.

"అయ్యా, నిర్మాతగారూ - ఈ రచయితలు నిక్కచ్చి మనుషులండీ!

నా మాట విని, ఏదో ఇస్తానని చెప్పండి" అన్నాడు సలహా.

"యాభై రూపాయలు సాలదా-"

"దేనికి? నా కాయితాల ఖర్చుకా? - సరిపోతుందిలెండి. కాకపోతే, చవకరకం కొనుక్కుంటాను" అన్నాడు రచయిత. ఒళ్ళుమండి.

"అడ్వాన్సు బాబూ! అడ్వాన్సు" అని సర్దాడు సలహా.

"నో నో, మినిమమ్ హండ్రెడండ్ వన్ ఈజ్ ది అడ్వాన్సు' అన్నాడు రచయిత.

"ఇదిగో నీ పట్టే నీదయ్యా -- ఇప్పుడర్థం అవుతోంది నాకు - నువ్వెందుకని ముందుకు రాలేదో," అన్నాడు సలహా.

"ఆల్ రైట్ సెలవు," అని లేచాడు రచయిత.

"కూచోవయ్యా - అయ్యా - ఆ, నూటఒక్క రూపాయీ అడ్వాన్సుగా ఇప్పించండి. మిగతా వ్యవహారం తర్వాత మాట్లాడదాం" అని నిర్మాతకు కన్నుకొట్టాడు సలహా.

"అదా, సరేకాని. కానీ, ఒక్క చనంలో ఇస్తాను. బ్యాంకు తియ్యాల" అన్నాడు నిర్మాత.

"సరే బ్రదర్ - తీసుకో. కథ కానీ ముందు -" అని కన్నుకొట్టాడు రచయితకు సలహా.

తాను రాసిన కథలోంచి, ఒక కథను తీసి వినిపించాడు రచయిత.

"బావుంది. బట్. హేపీ ఎండింగ్ ఏదీ?" అన్నాడు సలహా.

"హేపీ కాకపోవటం ఏమిటండీ -- చివరకు అంతా కలుసుకున్నారుగా" అన్నాను నేను.

"నో నో నో నో నో -- మిస్టర్... వాటీజ్ యువర్ నేమ్.... మహాశయ్! నా పాయింటు అదికాదు. ఎండింగు హేపీగా ఎప్పుడొస్తుంది? మధ్యలో చచ్చిన పాత్రలు చావగా, మిగతావన్నీ చివరకు వచ్చినప్పుడే, వస్తుంది?"

"వచ్చాయి కదా"

"నా టెటాల్. అక్కడే పొరబడుతున్నారు మీరు. మనవాళ్ళ సినిమాలు, మనమూనూ, ఒక్కమాట చెబుతా వినండి. 'మనవాళ్ళొట్టి వెధవాయలోయ్' అన్నాడు గిరీశం -- మీకెవరికన్నా తెలుసా?" అన్నాడు సలహా.

"నాకు తెలుసు" అన్నాడు వెంటనే ఫలానా.

"అంటే నీతో అన్నాడా?"

"నాతో అనలా"

"మరింకేం?"

ఇదేమిటో నిర్మాతకు తెలుసుకోవాలని పించింది.

"ఎవరా అన్నది?" అని అడిగాడు.

"గిరీశం అండీ, మన 'కన్యాశుల్కం' నాటకంలో -- మీరివన్నీ ఎక్కడచదువుతారూ? అది అసలు మాంచి నాటకం లెండి అదెవరూ? చిలకమర్తి వీరేశలింగమో, కందుకూరి అప్పారావో ఎవరో రాశారు. అబ్బ -- ఏం జ్ఞాపకం ఉంటుంది -- వీళ్ళందర్నీ ఎక్కడికని గుర్తు పెట్టుకోటం? చదివే పుస్తకాలు ఒకటా రెండా? దానికితోడు రైటర్సు పేర్లు ఎక్కడ గుర్తుంటాయి కాని -- సరే, దిస్ వీరేశలింగం రోట్ ద డ్రామా -- 'కన్యాశుల్కం' అని పేరు..." అన్నాడు సలహా.

"గురజాడ కదండి అది రాసింది" అన్నాను నేను.

"నో నో -- కన్యాశుల్కం గురించి నేను మాట్లాడుతున్నా సరే, దాంట్లో గిరీశం అని ఒక పాత్ర... వాడి దుంపతెగ..."

"హేపీ ఎండింగు గురించి చెప్పబోతున్నారు మీరు" అని గుర్తు చేశాడు రచయిత.

"యస్. యస్. హేపీ ఎండింగ్. చూశారా! టాపిక్ ఎట్లా మారిపోతుందో -- అంతేనండీ --

అక్టోబరు 29 వర్ధంతి సందర్భంగా....

# హాస్య నటునిగా గోవింద రాజుల సుబ్బారావు



గోవింద రాజుల సుబ్బారావు పేరు చెప్పగానే 'షావుకారు' టైటిల్‌రోల్ గుర్తుకురావచ్చు.'బాల నాగమ్మ'లో మాయలమరాటీ గుర్తుకు రావచ్చు.'గుణ సుందరి కథ'లో తండ్రి పాత్ర గుర్తుకు రావచ్చును. కానీ 'కన్యాశుల్కం' సినిమా చూసిన వారికి ఆయన లుబ్ధావధాన్లు పాత్ర పోషణ ఎప్పటికీ మరుపుకు రాదు.

తమాషా ఏమిటంటే అయన రంగస్థలం మీద 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రదర్శించే టప్పుడు 'గిరీశం' పాత్ర ధరించేవారు,' ప్రతాపరుద్రీయం' నాటకంలో 'యుగంధరుడి'గా, 'పిచ్చివాడి'గా ఆయన నటనచూసి నాటక రచయిత వేదం వెంకటరాయశాస్త్రి గారు' నా నాటకానికి నువ్వు సార్థకత తెచ్చావు 'అని మెచ్చుకున్నారు.

సుబ్బారావుగారి ప్రతిభ కళకు పరిమితం కాలేదు. ఆయన ఎల్.ఎమ్.పి. చదివి డాక్టరుగా ప్రాక్టీసు చేసిన తర్వాత హోమియో వైద్యు



'కన్యాశుల్కం' లో లుబ్ధావధానిగా సావిత్రి (మధురవాణి)తో

డయ్యారు. అణు విజ్ఞానం చదివి ఐన్‌స్టీన్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు.'ఇనార్గానిక్ ఎవల్యూషన్' అనే పేర ఇంగ్లీషులో ఒక వైజ్ఞానిక గ్రంధాన్ని రాశారు. రామాయణ కావ్యాన్ని అభ్యసించటమే కాదు, 20 ప్రముఖ రాగాలలో పాడటం క్షుణ్ణంగా నేర్చుకున్నారు.

సుబ్బారావు గారి రేడియో నాటకాల అనుభవం గురించి రావి కొండలరావు గారు ఒక సభలో ఇలా చెప్పారు-"ఇప్పుడయితే రేడియో స్టేషనులో చలిమంట కాచుకున్నట్లు మైకు చుట్టూరా కళాకారులు మూగి డైలాగులు చెప్పే విధానం వచ్చింది కానీ, అప్పట్లో విడివిడి స్టాండింగ్ మైకులే. రంగస్థలం నుండి వచ్చిన సుబ్బారావుగారికి మైకు ముందు నిలబడి డైలాగులు చెప్పడం కుదిరేది కాదు. మైకు చేత్తోపట్టుకుని అటూ, ఇటూ తిరుగుతూ డైలాగులు చెప్పేవారు. రికార్డింగు చేసే రేడియో స్టాఫ్ మొత్తుకునేవారు".

1895లో పుట్టి 1959లో మరణించిన సుబ్బారావు గారు లుబ్ధావధాన్లు పాత్రను సజీవంగా మన కళ్ళెదుట నిలబెట్టేరంటే అతిశయోక్తి కాదు!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

వెధవది -- ఎక్కడలేని సబ్జెక్టులూ మనం డీల్ చెయ్యటం నుంచి, ఈ చిక్కు వస్తున్నదను కొంటాను. ఒక దాంట్లోంచి ఇంకోదాంట్లోకి 'డైవ్' చేసేస్తూ ఉంటుంది - సబ్జెక్టు. అందుకనే నాలెడ్జిని లిమిట్ చేసేసుకోవాలి. చేసేసుకుంటే సపోజ్ మనకు..."

"హేపీ ఎండింగ్ గురించి చెప్పబోతున్నారు మీరు" అన్నాడు రచయిత మళ్ళీ.

"ఆఁ అదే చెబుతున్నాను. ఉదాహరణకు: మన సినిమా కథల్లో మధ్యలో ఒక పోస్టుమాన్ వస్తాడనుకోండి. ఏదో ఉత్తరం యిచ్చి వెళ్ళిపోతాడు. అంతేనా అతనిపాత్ర! మళ్ళీ కనిపించడు. ఏమయ్యాడోననే సందేహం ప్రేక్షకులను బాధిస్తూనే ఉంటుంది -- చివర్లోనన్నా రాకపోతాడా అనుకుంటారు. రాడు. వాళ్ళకో పెద్ద డిసపాయింట్‌మెంట్! మరీ హేపీ ఎండింగు ఎట్లా అయింది అది! అంచేత మీరు చూపించిన పాత్రలన్నీ చివరకు తీసుకు రావలసిందే. ఏ పాత్రను మధ్యలో వదిలెయ్య రాదు. చివరికొచ్చేసరికి బాగా జనం ఎక్కువయి పోయి, సెట్టు క్రిక్కిరిసి పోతుందంటారా -- ఏం భయం లేదు. కాస్త పెద్ద సెట్టు వేసి - ఆ ఆఖరి సీను మాత్రం విస్టావిజన్‌తోనో, వైడ్ స్కోప్‌లోనో తీస్తాం. అందరూ క్లియర్‌గా కనిపించేట్టు" అన్నాడు సలహా.

"అట్లా అయితే మధ్యలో ఒక వందమంది రోడ్డుమీద నుండి పోతున్నట్టు రాశారు. వాళ్ళంతా కూడా రావలిసిందేనా?" అన్నానునేను.

"రావల్సిందనేగా నా పాయింటు. లేదూ అసలా వందమందిని తీసిపారేయండి".

"సరే. కథలో వున్న వీక్‌నెస్‌ను చెప్పారు కారు" అన్నాడు కవి.

"ఇదొకటి వస్టు పాయింటు. ఐందా టెంపోలేదు. డ్రామా లేదు. గ్రీనరీ లేదు. క్లయి మాక్సు చాలదు" అన్నాడు సలహా.

"వాటిమాటకంటె ముఖ్యం డ్రామాలేదు" అన్నాను నేను

"ఏందయ్యా డ్రామా లేదంటారు - నాయకుడు నాయకురాలు కాలేజీలో డ్రామా ఆడతారని సదివాడుగా" అన్నాడు నిర్మాత చిరాగ్గా.

"డ్రామా అంటే అదికాదు, నిర్మాతారూ! పట్టు, మాంచి వూపు" అన్నాడు ఫలానా.

"నువ్వుంద్రా పట్టూ సిలుకునూ! డ్రామా వుంటే లేదంటారేందయ్యా?" అన్నాడు మళ్ళీ.

"అదేనండీ. వాడు చెప్పాడుగా -- అంతే. చూడండి కవీ! హీరోయిన్ తండ్రిని ఇంకా బాగా విలన్‌లాగా చెయ్యండి -- డైలాగ్సు బిగువుకోసం! విలన్ పాత్ర లేకపోతే మీకసలు డైలాగులో బిగువు దొరకదు" అన్నాడు సలహా.

- (ఇంకా వుంది)

అక్టోబరు 31 ఎం.ఎల్.వి.వర్ధంతి సందర్భంగా...

# వసంతకుమారి సినిమాలలో ఎందుకు కొనసాగలేదు?

ఎం.ఎల్. వసంతకుమారి కర్ణాటక శాస్త్రీయ గాయనిగా సుప్రసిద్ధురాలు. ఆమె సినిమాల్లో పాటలు పాడేరని తెలిసిన వాళ్ళు కూడా 'మోడ్రన్' టైపు పాటలు పాడినట్లు తెలియకపోవచ్చు. 'సమాధి' హిందీ సినిమా లోని'గోరే, గోరే, గోవాకే చోరే...' వంటి వెస్టర్న్ టైప్ పాట బాణీలో వసంతకుమారి 'ఒరే ఇరవు'(1951) తమిళ చిత్రంలో 'అయ్యాసామీ, ఆవోజీసామీ' అనే పాట పాడారంటే ఆశ్చర్య పడవచ్చు. ఈ పాటే కాదు'వాళ్కై' 'మంత్రికుమారి','తాయ్ ఉళ్లమ్', 'మధురైవీరన్' 'మన్నాదిమన్నన్' వంటి అనేక హిట్ తమిళ చిత్రాలలో, కొన్ని తెలుగు చిత్రాలలో పాటలు పాడారు. అందంగా ఉండి(ఆమె కుమార్తె శ్రీవిద్య హీరోయినేగా) పాటలు పాడటం ద్వారా సినిమా రంగంతో పరిచయం ఏర్పడ్డ వసంతకుమారి సినిమాలలో పాత్రధారణ చేయకుండా ఎలా ఉన్నారన్న ప్రశ్న వస్తుంది. చాలామందికి తెలియకపోవచ్చుగానీ ఆమె తెరపై కూడా కనపడ్డారు.

నిజానికి 1948లో (అప్పటికి ఆమెకు 20 ఏళ్ళు)లేనా చెట్టియార్ అనే నిర్మాత 'కృష్ణభక్తి' అనే సినిమాలో ఆమెచేత చిన్న పాత్ర ధరింపజేసారు. రష్యన్ రాజగురువు'రాసపుతిన్' జీవితంపై ఆధారపడిన ఈ సినిమా సక్సెసయింది. పాటలూ హిట్ అయ్యాయి. వెంటనే వసంతకుమారికి 'రాజముక్తి' అనే సినిమాలో నటించటానికి ఆఫర్ వచ్చింది. అప్పట్లో టాప్‌హీరో ప్లస్ టాప్ సింగర్ ఎం.కె.త్యాగరాజ భాగవతార్ సినిమా అది.

1944లో లక్ష్మీకాంతం అనే జర్నలిస్టు హత్యకేసులో త్యాగరాజ భాగవతార్ నిందితుడిగా నిలబడ్డాడు. 30 నెలలు జైల్లో ఉన్నాక 1947 ఏప్రిల్‌లో నిర్దోషిగా తీర్పిచ్చి వదిలేసారు. జైల్లోంచి విడుదలయ్యాక'నరేంద్ర పిక్చర్స్' స్థాపించి 'రాజముక్తి' అనే సినిమా మొదలుపెట్టాడు. వసంతకుమారి ఆ చిత్రంలో నటించవలసిందే కానీ ఏ కారణం చేతనో భాగవతార్‌తో ప్లేబ్యాక్‌లో డ్యూయెట్స్ పాడడంతో సరిపెట్టింది. వి. ఎన్. జానకి (తర్వాత ఎం.జి. ఆర్. సతీమణి, తమిళనాడు ముఖ్యమంత్రి అయ్యారు) హీరోయిన్‌గా, భానుమతి వ్యాంప్‌గా నటించిన ఈ చిత్రంలో పాటలు హిట్ అయినా సినిమా ఫ్లాప్ అయింది.

ఇంతలో వసంతకుమారి కి నటించేందుకు ఇంకో ఆఫర్ వచ్చింది. భక్తకుంభార్ కథను 'సుదర్శన్' అనే పేరుతో తెరకు ఎక్కించడానికి రాయల్ టాకీ వారు సన్నాహాలు చేసారు. అప్పటి మేటి హీరో పి.యు.చిన్నప్ప హీరో. ఫస్ట్ హీరోయిన్ కన్నాంబ అయితే సెకండ్ హీరోయిన్‌గా వసంతకుమారి ఎన్నిక య్యారు. ఈ సినిమా తయారవుతుండగానే జెమినీ వాసన్ ఇదే కథతో నాగయ్య, పుష్పవల్లి, సూర్యప్రభలతో 'చక్రధారి' (1948) అనే సినిమా తీసి హిట్ చేసే శారు.



దానితో 'సుదర్శన్' నిర్మాణం వెనుక బడింది. కోయంబత్తూర్ వెళ్ళి వసంతకుమారి కొన్నిసీన్లలో నటించాక విసుగు పుట్టి సినిమా లోంచి తప్పుకున్నారు. చివరికి 'సుదర్శన్' 1951 లో విడుదలయిం దనుకోండి.

ఛాన్సులు వస్తున్నా వసంతకుమారి సినిమారంగం నుండి ఎందుకు తప్పుకున్నారు? ఒక ఇంటర్వ్యూలో ఆమె సమాధానం ఇచ్చారు."సంగీత రంగంలో అందరూ గొప్పవాళ్ళని చెప్పను కానీ సినిమా వాతావరణం నాకు పడలేదు. తను చెప్పినట్టల్లా ఆడలేదని ఓ డైరక్టరు నా మొహం కెమెరా కు అన్‌ఫిట్ అన్నాడు. వయసు మీరిన తర్వాత వేషాలు రాక ఎంతోమంది అవస్థపడతారు. సంగీతంలో ఆ బాధ లేదు. ప్లే బ్యాక్ పాడటం కొనసాగించవచ్చు కానీ... శాస్త్రీయసంగీతంలో ఎక్కువగా బిజీ అయినకొద్దీ నేను సినిమాలను పట్టించుకోవటం మానేసాను."

అక్టోబరు 26 రాజేశ్వరరావు వర్ధంతి సందర్భంగా...

# సరిగమలు - గలగలలు

## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకుడు)



**ఇంటిపేరులోనే షడ్జమం, రిషభం ఇముడ్చుకున్న ప్రముఖ సంగీత దర్శకుడు సాలూరి రాజేశ్వరరావుగారి కుటుంబంతో మాధవపెద్ది కుటుంబాలకి 50 ఏళ్లకి పైగా అనుబంధం ఉంది.**

మా చిన్నాన్నగారు గోఖలే గారికి ఆయన పాటలన్నా ఆయన మాటలన్నా ఎంతో ఇష్టం. ఇంకో చిన్నాన్నగారు సత్యంగారు ఎన్నో మంచి పాటలూ, పద్యాలు ఆయన సంగీత దర్శకత్వంలో పాడారు. అన్నయ్య రమేష్‌కి రాజేశ్వరరావుగారు ఒక బంగారు అవకాశం ఇచ్చారు. అది 'రాం-రహీం' చిత్రంలో మధుర గాయకుడు మహ్మద్‌రఫీతో కలిసి పాడించటం. బహుశ మహ్మద్ రఫీగారితో పాడిన ఏకైక గాయకుడు (తెలుగులో) అన్నయ్యే అవటం ఈ జన్మలో మరచిపోలేని అనుభూతి. తరువాత కూడా ఎన్నో మంచి పాటలూ, పద్యాలూ అన్నయ్యచేత పాడించారు. మా అత్తగారు కనస్తూరి గారికి రాజేశ్వరరావుగారి ప్రైవేట్ సాంగ్స్ అంటే ప్రాణం. ఆవిడ కూడా మంచి గాయకురాలు. మా అమ్మగారికీ, నాన్నగారికీ కూడా ఆయన పాటలంటే ప్రాణం.

నాకు రాజేశ్వరరావుగారి కుటుంబంతో 1970 నుంచే పరిచయం. నేనూ, అన్నయ్యా విజయవాడలో 'భావనా కళాసమితి'లో 'లైట్ మ్యూజిక్ ప్రోగ్రామ్స్' చేసే రోజుల్లో అన్నయ్యకున్న పరిచయంతో వాసు (ఇప్పటి ప్రసిద్ధ సంగీత దర్శకుడు వాసూరావు; రాజేశ్వరరావుగారి మూడో అబ్బాయి) మాకు ఎలక్ట్రిక్ గిటార్ వాయించటానికి మద్రాస్ నుండి వచ్చేవాడు. అప్పుడప్పుడు మాష్టారి రెండో అబ్బాయి పూర్ణచంద్రరావు కూడా ఎలక్ట్రిక్ గిటార్ వాయించటానికి వచ్చేవారు. అప్పటి నుండి అదే రిలేషన్‌షిప్ కొనసాగుతోంది. వారితో అద్భుతంగా ప్లే చేసేవారు.

నాకన్నా ముందు 1970 ప్రాంతాల్లో అన్నయ్య మద్రాసు వచ్చాడు, ప్లేబాక్ సింగర్‌గా స్థిరపడటానికి మా నాన్నగారు చనిపోయాక 1973 డిసెంబర్ 4వ తేదీన మద్రాసు వచ్చాను- ఇన్‌స్ట్రుమెంట్ ప్లేయర్‌గా సెటిల్ అవటానికి. యాదృచ్ఛికంగా అదే రోజు ఘంటసాలగారి జన్మదినోత్సవం అవటం నేను మరచిపోలేను.

మొట్టమొదట సినిమాల్లో ఎకార్డియన్ ప్లేయర్‌గా టి. చలపతిరావుగారు అవకాశం ఇచ్చారు. (మా అన్నయ్యకి కూడా తొలి అవకాశం ఆయనే ఇచ్చారు) రాజేశ్వరరావు గారింటికి రెగ్యులర్‌గా వెళ్తూండేవాణ్ని అవకాశాలకోసం. 1974లో ఒక చిత్రం రి-రికార్డింగ్‌లో వాయించటానికి నన్ను పిలిపించారు. ఆయన

## అంకురార్పణ....



**'సంగీతం'** మనకున్న మానసిక రుగ్మతలని పోగొట్టే గొప్ప సాధనం. 1967 నుండి 1973 వరకూ ఎన్నో ప్రోగ్రామ్స్ విజయవాడలో భావనా కళా సమితిలో హార్మోనియం ఎకార్డియన్ వాయించే వాణ్ని. 1974 నుండి 1990 ఎకార్డియన్ ప్లేయర్‌గా, తరువాత కీబోర్డ్ ప్లేయర్‌గా ఎన్నో సినిమాలకీ, కచేరీలకీ వాయించటం జరిగింది. అలాగే 1988 నుండి సంగీత దర్శకుడిగా షుమారు 42 సినిమాలు పూర్తి చేసాను. నంది అవార్డ్ (1996)తో సహా ఎన్నో అవార్డ్స్ వచ్చాయి.

గొప్ప సంగీత దర్శకులతో, వాయిద్య కళాకారులతో, గాయనీ గాయకులతో నా పరిచయం, ఎన్నో అనుభవాలన్నీ క్రోడీకరించి మీ ముందుంచటానికి ప్రయత్నిస్తున్నాను ఇంతటి సదవకాశం నాకు ఇస్తున్న 'హాసం' సంపాదకవర్గానికి అభివందనాలు....

భవదీయుడు

**మాధవపెద్ది సురేష్ చంద్ర.**

చాలా సంతోషించారు. అప్పుడు ఆయన దగ్గర ఎకార్డియన్ షోళాపూర్ రామారావుగారు, మంగళమూర్తిగారు వాయిస్తూండేవారు. అప్పుడప్పుడు జాయ్, బెన్ కూడా వాయిస్తుండేవారట. తరువాత అప్పుడప్పుడు రికార్డింగ్స్, రి-రికార్డింగ్స్‌కి వాయిస్తుండేవాణ్ణి, షుమారు 30, 40 కాల్‌షీట్స్ వర్క్ చేసాను.

అప్పుడు నాకు ఆయన ఆర్కెస్ట్రాలో కృష్ణయ్యర్, రాజగోపాల్‌గారు (రాజేశ్వరరావుగారి అసిస్టెంట్స్) వయొలిన్ ప్లేయర్ అప్పికొండగారు, ఫ్లూట్ ప్లేయర్ సంజీవిగారు, క్లే వయొలిన్ ఆదిశేషుగారు, కంపోజింగ్ ప్లేయర్ తబలా మణిగారు, ఇటువంటి ప్రసిద్ధ కళాకారులతో పరిచయం అయింది!

అవన్నీ మధురానుభూతులే.

ఇప్పటికీ కృష్ణయ్యర్ గారూ, నేనూ అప్పుడప్పుడు కలుస్తూ ఉంటాం.

రాజేశ్వరరావుగారి మ్యూజికల్ నైట్స్‌లో నేను పాల్గొనేవాణ్ణి.

1975లో కాకినాడ, విజయనగరంలో భారీఎత్తున జరిగిన ఆయన ప్రోగ్రామ్స్‌లో నేను, అన్నయ్యా పాల్గొనటం ఏనాడూ మరచిపోలేను. ఎంత అనుభూతి! మాటల్లో చెప్పటం కష్టం! ఆ ప్రోగ్రామ్స్‌లో అన్నయ్య, రాజేశ్వరరావుగారు రాం-రహీం పాటలు కలసిపాడటం ఎలా మరచిపోతాను?

అలాగే మద్రాసులో కొంతకాలం తరువాత కళాసాగర్ ఆధ్వర్యంలో డా॥సి.నారెగారి కంపోజింగ్‌లో అందరు గాయనీ గాయకులతో మద్రాసు యూనివర్సిటీ సెంటెనరీ ఆడిటోరియంలో ఎక్స్‌ట్రార్డినరీ ప్రోగ్రామ్ ఇచ్చారు. బాలుగారు, రాజేశ్వరరావుగారూ 'మల్లీశ్వరి'లో చిత్రంలోని 'ఆకాశవీధిలో' పాటను ఎంతో హృద్యంగా పాడారు. ఆ పాటలో మాస్టారు చాలా ఇంప్రొవైజ్ చేసి పాడారు (ఒక ఆలాపన అద్భుతం!

నేను సంగీత దర్శకుణ్ణి అవటానికి కొద్ది రోజుల ముందు సినీ సంగీత ప్రపంచానికి సంబంధించిన మహామహుల ఆశీర్వాదాల్ని తీసుకోవటం జరిగింది.

నా మొదటి సినిమా 'హైహై నాయకా' రికార్డింగ్‌కి (మొదటి పాట - ఇది సరిగమలెరుగని రాగము - రచన : జొన్నవిత్తుల) మాస్టారు వచ్చారు. ఎంతో ఆనందించారు పాటవిని, మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు. పైగా జంధ్యాలతో ఒక మాటన్నారు, ఇతను మంచి 'కీబోర్డ్ ప్లేయర్'గా పేరు సంపాదించాడు. భవిష్యత్తులో ఉత్తమ సంగీత దర్శకుడిగా అద్భుతంగా రాణిస్తాడని. ఎంతో స్పందించాను ఆయన ఆశీర్వాదానికి. ఆయన్ని మేమంతా నాన్నగారని పిలిచేవాళ్లం. నన్ను కూడా వారిపెద్ద కుటుంబంలో ఒక అబ్బాయిగా స్థానం ఇచ్చారు.

తరువాత నా సంగీత జీవితానికి తిరుగులేని పునాదివేసిన విజయావారి 'బృందావనం' పాటల ఆవిష్కరణకి ఆయనే ఛీఫ్‌గెస్ట్‌గా వచ్చారు.

## శ్రీ సాలూరి రాజేశ్వరరావుగారి అసిస్టెంట్ శ్రీ కృష్ణయ్యర్ గారి అనుభవాలు:

రాజేశ్వరరావుగారు చేసిన మొదటి వీణపాట 'ఏమని పాడెదనో' సింధుభైరవి. తరువాత 'పాడమని నన్నడగవలెనా' ఇత్యాది పాటలు చాలా ప్రాచుర్యం పొందాయి.

ఆయనకి నౌషాద్ గారంటే చాలా ఇష్టం. అలాగే యస్.డి. బర్మన్‌గారు, శంకర్-జైకిషన్, లక్ష్మీకాంత్-ప్యారేలాల్ అన్నా చాలా ఇష్టం. సైగల్ గారితో చాలా అనుబంధం వుంది. సైగల్‌గారు కలకత్తాలో హార్మోనియం ఇచ్చారు, మాస్టారికి.

షుమారు 1955 - 1976 వరకూ ఆయన అన్ని సినిమాలకీ అసిస్టెంట్‌గా పనిచేసారు కృష్ణయ్యర్‌గారు. రాజగోపాల్ గారు చాలా వేగంగా 'నొటేషన్స్' రాసేవారు. ఎందుకంటే మాస్టారు హార్మోనియం మీద కానీ, పియానో మీదకానీ చాలా ఫాస్ట్‌గా కంపోజ్ చేసేవారు. కండక్టింగ్ కూడా రాజగోపాల్ గారే చేసేవారు. సింగర్స్‌కి పాటలు నేర్పేవని కృష్ణయ్యర్‌గారు చేసేవారు. రాజేశ్వరరావుగారికి వయొలిన్స్ అన్నా, ఫ్లూట్, వీణ, సితార్ అన్నా చాలా ఇష్టం. ఫ్లూట్ మొదట్లో 'ముత్తు' గారు వాయించేవారు. తరువాత విజయా సంస్థలో 'గోవిందస్వామి' వాయించేవారు. తరువాత నంజప్పగారు వాయించేవారు. తరువాత సంజీవిగారు వాయించేవారు.



పియానో దివాకర్‌గారు వాయించేవారు. తరువాత మాస్టారి పెద్దబ్బాయి రామలింగేశ్వరరావు గారు వాయించేవారు. వీణ ముందు శర్మ బ్రదర్స్ వాయించేవారు (ఒకరు వయొలిన్, ఒకరు వీణ వాయించేవారు). పిలచిన బిగువటరా (మల్లీశ్వరి) వీరు వాయించినదే. తరువాత రంగారావుగారు (ప్రఖ్యాత సంగీత దర్శకులు) వాయించేవారు. అయితే ఎక్కువగా 'చిట్టిబాబు'గారు వాయించారు (ముఖ్యమైన వీణ పాటలన్నీ). సితార్ అన్నపూర్ణగారు మొదట్లో వాయించేవారు, తరువాత అప్పుడప్పుడు అహ్మద్ హుస్సేన్ ఖాన్ వాయించేవారు. తరువాత 'జనార్దన్' గారు ఎక్కువ పాటలకీ రీ-రికార్డింగ్స్ కీ వాయించేవారు. ఈమని శంకరశాస్త్రిగారు కూడా ఒకటి, రెండు పాటలకి వీణ వాయించారు.

మాస్టారికి భీంప్లాస్, మోహన, శుద్ధసావేరి ఇత్యాది రాగాలంటే చాలా ఇష్టం. మోహనరాగంలో శుద్ధమధ్యమం వాడినది (చాలా సమ్మోహనకరంగా) బహుశా మాస్టారే.

ఎక్కువగా భరణి, జెమిని (కోటేశ్వరరావుగారు సౌండ్ ఇంజినీర్)లతో రికార్డ్ చేసారు. వాహిని (కృష్ణయ్యర్, శివరాం గార్లు సౌండ్ ఇంజినీర్స్)తో కూడా రికార్డ్ చేసేవారు. అప్పుడు కె. విశ్వనాథ్‌గారు అసిస్టెంట్ సౌండ్ ఇంజినీర్ (వాహిని లో).

రాజేశ్వరరావుగారి పాటలు వినటానికి సులభంగా వున్నా పాడటానికి కొంచెం కష్టపడాలి. కాంప్రమైజ్ అయ్యేవారు కాదు. అందుకే ఆయన్ని అర్థంచేసుకున్న నిర్మాతలూ, దర్శకులే ఆయనచేత సంగీతం చేయించుకునేవారు. పనికి కొంచెం ఆలస్యంగా వచ్చేవారుట.

సింధుభైరవిలో 'ఏమిటో ఈ మాయా' (పి.లీల గారు) పాటకీ, 'ఏమని పాడెదనో' (పి.సుశీలగారు) పాటకీ ఎంతో వైవిధ్యం చూపించారు.

ఎక్కువ పాటలు ఘంటసాల గారు, లీలగారు, సుశీలగారే పాడారు.



## సితార్ జనార్దన్ గారు చెప్పిన విషయం:

### ఆయన వాయించే సితారే ఇంటిపేరు అయింది. 'సితార్ జనార్దన్' గారు ఎంతో స్పందించి చెప్పిన విషయాలు

"పూజాఫలం'లో ఒక పాట (సుశీలగారు పాడినది)కి సితార్ వాయించినప్పుడు శ్రీ బి.యన్.రెడ్డిగారు రాజేశ్వరరావుగారితో ఒక మాటన్నారుట. 'మాష్టారూ! నొటేషన్స్ ఇచ్చారు, బాగానే వుంది. కానీ సితార్‌ని భావంతో వాయించనివ్వండి. ఆయన్ని వదిలేయండి. ఆ బిట్‌ని కొంచెం మౌల్డ్ చేసుకోనీయండి పరవాలేదు' అన్నారుట. ఎందుకంటే సితార్ బిట్స్‌కి 'ఆబ్లిగేట్స్' ట్రై చేశారుట" ఏవండీ సుశీలగారికి గొను వేసినట్లుగా ఉంటుంది. ఆబ్లిగేట్స్ వద్దు" అంటూ మాష్టారు ఆబ్లిగేట్స్ కాన్సిల్ చేసారుట.

అలాగే ఎంతో పాపులర్ సాంగ్ (రాగం - జై జైవంతి) 'మనసున మనసై' జనార్దన్ గారికి కూడా ఎంతో పేరు తెచ్చిపెట్టింది. నాగేశ్వరరావుగారు నాచురల్‌గా వాయించటం, ఘంటసాలగారు పాడిన విధానం, మాష్టారి ట్యూనింగ్ సుపర్బ్. మాష్టారు చాలా మెచ్చుకున్నారుట జనార్దన్‌గారిని. ఆ పాటకి ఆయనకిచ్చిన రెమ్యునరేషన్ రూ॥100/- చాలా పెద్ద పేమెంట్ ఆరోజుల్లో.

జనార్దన్‌గారు పర్ఫెక్షన్ కోసం ఎంతో తపన పడేవారు. ఎంతో మంచి సితార్ వాయిద్య కళాకారుడైనా మాష్టారి దగ్గర ఆడిషన్ ఇచ్చి రెండు, మూడు నెలలు వెయిట్ చేస్తేగానీ అవకాశం రాలేదుట!

ఇంకో విషయం - రాజేశ్వరరావుగారిని మాధవపెద్ది వంశం మరచిపోదు. ఎందుకంటే మాధవపెద్ది వంశంలో పేకాటకి చాలా ప్రాముఖ్యత వుంది. చిన్నవాళ్లు, పెద్దవాళ్లు, ఆడా, మగా అందరూ పేకాటాడతారు. మా మామ్మ అనేది 'మన పిల్లలు పుడుతూ 'కేర్ కేర్' అనర్రా, 'పేక్ పేక్' అంటారని. అటువంటి పేకాట గురించి కొసరాజుగారు అద్భుతంగా రచించగా రాజేశ్వర రావుగారు 'అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయేనే' అనే పాటని మాధవపెద్ది సత్యంగారు, పిఠాపురం గార్లచే పాడించటం విశేషం, దైవ సంకల్పం.

మాస్టారి ఆర్కెస్ట్రాలో వారి పెద్దబ్బాయి రామలింగేశ్వరరావుగారు పియానో, కీబోర్డ్ వాయించేవారు. మాస్టారి అల్లుడు వెంకటేష్‌గారు ప్రఖ్యాత మాండొలిన్ ప్లేయర్. కె.వి. మహ దేవన్‌గారి వద్ద ఆస్థాన విద్వాంసుడు. వెంకటేష్‌గారి అబ్బాయి రాజు ఇవాళ మంచి కీబోర్డ్ ప్లేయర్. 'భైరవద్వీపం' విడుదల తరువాత ఒకరోజు నాన్నగారు 'చాలా బాగా కంపోజ్ చేసారు మీరు' అన్నప్పుడు నేషనల్ అవార్డ్ పొందిన అనుభూతిని ఎలా మరచిపోతాను?



మాస్టారు గారు అందర్నీ 'ఏవండీ', 'సార్' అని పిలిచేవారు.

ప్రైవేట్ సాంగ్స్‌కి ఒరవడి లాంగ్విటీని ఇచ్చారు. ఎంతో విద్వత్తున్న మనిషి. అప్పట్లోనే 'చంద్ర లేఖ'లో మోడర్న్ మ్యూజిక్ ఇచ్చారు. 'భక్త జయదేవ'లో ప్రణయ పయోనిధి పాటకి పది రాగాల్లో అద్భుతంగా కంపోజ్ చేసారు. వీణ పాటలు ఆయన ప్రత్యేకత. ప్రపంచంలో ఎంతోమంది ఆయన భక్తులు. ఆయన కుమారుల అభివృద్ధిని చూసుకున్నారు. అప్పుడప్పుడూ ఆశీర్వాదంకోసం ఆయన వద్దకు వెళ్లేవాణ్ని ఇప్పుడు ఆయనా, అమ్మగారూ ఇద్దరూలేరు. ఆ యింటికి వెళ్లాలంటే మనస్సులో ఎంతో వెలితి. కానీ ఆయనతో పనిచేసిన అనుభూతులు ఎప్పుడూ మరచిపోలేను. నాకు తెలిసినంత వరకూ తెలుగు సినీ సంగీత ప్రపంచంలో త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామాశాస్త్రిగార్లు ఎవరో కాదు సర్వశ్రీ రాజేశ్వర రావుగారు, పెండ్యాల గారు, ఘంటసాలగారు.

## నా గురించి... మా గురించి...

**నా పేరు** : మాధవపెద్ది సురేష్ చంద్ర - **మా అమ్మగారు** - వసుంధరాదేవి (వీణ, Vocal లో డిప్లొమా. జయపూర్ మహారాజాగారు 'ఏకాండి వీణని' బహూకరించారు. **నాన్నగారు** - నాగేశ్వరరావు -వర్క్‌షాప్ ఇంజినీర్ (ఆంధ్రా సిమెంట్స్) విజయవాడ. సంగీతం, సాహిత్యం అంటే ప్రాణం. **మా అన్నయ్య** - రమేష్ చంద్ర -(ప్లేబాక్ సింగర్) **మాధవపెద్ది** - వెంకట్రామయ్యగారు (గొప్పస్టేజీ నటులు) కొడవటిగంటి కుటుంబరావుగారు (రచయిత), వల్లభజోస్యుల శివరాంగారు (సౌండ్ ఇంజినీర్) వరసకి తాతయ్యలు. **చిన్నాయనలు** - గోఖలే (ఆర్ట్ డైరెక్షన్) సత్యం (ప్లేబాక్ సింగర్) గాంధీ (మంచి పాటగాడు) ప్రసాద్ (Retd. SBI) (టి.వి., సినిమా నటులు, పామర్తి (మ్యూజిక్ డైరెక్టర్) గారి పెద్దమ్మాయిని వివాహం చేసుకున్నారు.

నేను B.A. 1972లో S.R.R & C V R Govt కాలేజ్‌లో పూర్తిచేసాను. హింది రాష్ట్రభాష, టైప్ హైయ్యర్, షార్ట్‌హాండ్ హైయ్యర్ చదివాను. ఎన్నో మంచి బొమ్మలు వేసాను. భార్య సూర్యకుమారి (Housewife), కుమారుడు నాగసాయి శరత్ చంద్ర (B.E.), కుమార్తె నాగసాయి లక్ష్మి (B.com & Multimedia Graphics).

## చిత్రం: అమరశిల్పి జక్కన్న

రచన: సముద్రాల (సీనియర్) గానం: ఘంటసాల

నిలువుమా నిలువుమా నీలవేణి
నీ కనుల నీలినీడ నా మనసూ నిదురపోనీ ॥నిలువుమా॥
అడుగడుగున ఆడే - లే నడుము సొంపులా
తడబడే అడుగులా - నటనల మురిపింపులా
నడిసేయక - పూరించే - వయ్యారపు వంపులా
కడ కన్నుల యింపుల గడసరి కవ్వింపులా
నడిచిరా నడిచిరా నాగవేణీ
నీ కనుల నీలినీడ నా మనసు నిదురపోనీ ॥నిలువుమా॥
అద్దములో నీ చెలువు తిలకించకు ప్రేయసీ
అలిగేవు నీ సాటి చెలిగా తలపోసీ
నా ఊర్వశి రావే రావే అని పిలువనా
ఆ సుందరి నెర నీటూ నీ గోటికి సమమౌనా
రా చెలీ నిను మది దాచుకోనీ
నీ కనుల నీలినీడ నా మనసూ నిదుర పోనీ ॥నిలువుమా॥

## చిత్రం: దేశద్రోహులు

రచన:ఆరుద్ర గానం: ఘంటసాల

జగమే మారినది మధురముగా ఈవేళ
కలలూ కోరికలు - తీరినవి మనసారా ॥జగమే॥
మనసాడెనే మయూరమై
పావురములు పాడి - ఎల పావురములు పాడి
ఇదె చేరెను - గోరువంక
రామచిలుక చెంత - అవి అందాల జంట
నెనరూ కూరిమి - ఈనాడె పండెను
జీవితమంతా - చిత్రమైన పులకింత ॥జగమే॥
విరజాజుల సువాసన
స్వాగతములు పలుక - సుస్వాగతములు పలుక
తిరుగాడును తేనెటీగ - తీయదనము కోరి - అనురాగాల తేలి
కమ్మని భావమే - కన్నీరై చిందేనే
ప్రియమగు చెలిమి - సాటిలేని కలిమి ॥జగమే॥

## చిత్రం: పూజాఫలం

రచన: దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి గానం: పి.సుశీల

నేరుతునో లేదో ప్రభు, నీ పాటలు పాడ?
ఇది చల్లని వేళైన, ఇది వెన్నెల రేయైన,
నిదురరాదు కనులకు! శాంతిలేదు మనసుకు!
మదిలో వేదన యేదో కదలె రాధకు!
॥ఇది చల్లని వేళైన....॥
నీ దయలాగున వెన్నెల జగమంతా ముంచె!
నీ మధుర ప్రేమ యమున కడలంతా నించె!
మరిమరి ముల్లోకములను మురిపించే, స్వామీ,
మనసు చల్లబడ దాసికి కనిపించవేమి
॥ఇది చల్లని రేయైన॥
నీ వేణువు కోసం - బ్రతుకంతా వీనులాయె!
నీ దరిసెనమునకై ఒడలంతా కనులాయె!
బడలే బ్రతుకున ఆశలు వెలిగించే దేవా!
సడలే వీణియ తీగలు సవరించి పోవా
॥ఇది చల్లని రేయైన...॥

## చిత్రం: చదువుకున్న అమ్మాయిలు

రచన: దాశరథి గానం: పి.సుశీల

వినిపించని రాగాలే - కనిపించని అందాలే
అలలై మదినే కలచే - కలలో ఎవరో పిలిచె!
తొలి చూపులు నాలోనే - వెలిగించె దీపాలే
చిగురించిన కోరికలే - చిలికించెను తాపాలే
వలచే మనసే మనసు! ॥వినిపించని॥
వలపే వసంతములా - పులకించి పూచినదీ
చెలరేగిన తెమ్మెరలే - గిలిగింతలు రేపినవి
విరిసే వయసే వయసు! ॥వినిపించని॥
వికసించెను నా వయసే
మురిపించే ఈ సొగసే
విరితేనెల వెన్నెలలో - కొరతేదో కనిపించే
ఎదలో ఎవరో మెరిసే! ॥వినిపించని॥

## చిత్రం:భార్యాభర్తలు

రచన: శ్రీశ్రీ గానం: ఘంటసాల

జోరుగా హుషారుగా షికారు పోదామా!
హాయి హాయిగా తీయ తీయగా ॥జోరుగా॥
ఓ... బాల నీ వయ్యార మెంచి మరులుకొంటినే
చాల ప్రేమ పాఠములను చదువుకొంటినే ॥ఓ బాల॥
మరువనంటినే... మరువనంటినే ... ఓ... ఓ.... ఓ... ॥జోరుగా॥
నీ... వన్నెచిన్నెలన్ని చూచి వలచినాడనే
వయసు సొగసు తలచి తలచి మురిసినాడనే ॥నీ... వన్నె॥
కలసి రాగదే ఓ ఓ ఓ ॥జోరుగా॥
నా.... కనులలోన చెలియ నిన్నె పిలిచినాడనే
కనులు తెరచి ఎదుట నిన్నె కాంచినాడనే
వరించినాడనే..... వరించినాడనే ఓ ఓ ఓ ॥జోరుగా॥

## చిత్రం:బొబ్బిలి యుద్ధం

రచన:సినారె గానం:భానుమతి

ఊయల లూగినదోయి మనసే
తీయని ఊహల తీవెలపైన ॥ఊయల॥
వెన్నెల పూవులు విరిసేవేళ
సన్నని గాలులు సాగేవేళ
వలపులు ఏవో పలికెను నాలో
తెలుపగ రానిది ఈ హాయి ॥ఊయల॥
కమ్మని రాతిరి రమ్మని పిలిచె
మల్లెల పానుపు మనకై నిలిచె
ప్రాయము నీవై పరువము నేనై
పరిమళించగ రావోయి ॥ఊయల॥






"పాపా! మీ నాన్నగారు 2 సంవత్సరాల తర్వాత ఆర్మీనుంచి వస్తున్నారు" సంతోషంగా చెప్పింది తల్లి.

'అయ్యో! నాన్నను సర్‌ప్రైజ్ చేయటానికి ఒక తమ్ముడో, చెల్లో పుడితే బావుండేది కదమ్మా" అమాయకంగా విచారించిందా నాలుగేళ్ళ పాప.



"నాన్నా! చిన్నకోతి పిల్ల పెరిగితే పెద్ద కోతి అవుతుంది.

చిన్నగాడిద పిల్ల పెరిగితే పెద్ద గాడిదవుతుంది. మరి చిన్నబాబు పెరిగితే ఏమవుతాడు?"

"ఆ రెండింటిలో ఏదైనా అవ్వవచ్చు".

ఈ జోకులను పంపిన వారు
శ్రీమతి టి.శైలజ, కళ్యాణ్‌నగర్,
హైదరాబాద్



"అబ్బబ్బ! చెమటలు కారిపోతున్నాయి. కాస్త అద్దాలు దించవే!"

"ఊరుకోండీ అద్దాలు దించితే మన కారుకి ఏసి లేదని అందరికీ తెలిసిపోదూ?".



జైల్లో ఖైదీలు రొట్టెలు బాగాలేవని గొడవ చేస్తున్నారు.

"ఈ రొట్టెల్నే గాంధీగారికిస్తే ఎంత చక్కగా తినే వారో తెలుసా" అంటూ గద్దించాడు జైలర్.

"అవున్సార్! యివి ఆయన టైమ్‌లో చేసినవే కదా!" సమాధానమిచ్చాడు కొంటె ఖైదీ.



జులాయి జయంత్ మిలటరీలో చేరాడు.

మొదటిరోజు తెల్లవారు ఝామున 3 గంటలకే వాళ్ళ ఆఫీసర్ వచ్చి లేపాడు.

"టైమెంతయ్యిందో తెలుసా! 3 గంటలు" అంటూ గదిమాడు ఆఫీసర్.

"కనీసం యిప్పుడైనా నిద్రపోనివ్వండి సార్! మళ్ళీ ఉదయాన్నే లేవాలి" అన్నాడు జయంత్ ఆవులిస్తూ.




"బాబూ రాజమండ్రికి టికెట్ ఎంతనాయనా?" అడిగిందొక 80 ఏళ్ళ ముసలావిడ రైల్వే బుకింగ్ క్లర్క్‌ని.

"ఎనభై మూడు రూపాయలు" అంటూ చెప్పాడాయన.

"సరిపోయింది సంబడం. ఏ కిటికీలో అడిగినా యిదే చెప్తున్నారు. సరే యివ్వు".



పార్కులో కూచున్నారు ప్రేయసీ ప్రియులు. అంతలో రెండు గాడిదలు కనిపించాయి. ఆ రెండు గాడిదలు ఒకదాన్నొకటి నాక్కుంటున్నాయి.

"వాటిని చూశావా... నాక్కూడ అలాగే చెయ్యాలని వుంది..." అన్నాడు ప్రియుడు.

"వద్దు ప్రియా.... ఒక వేళ అది తంతే ఛస్తావ్" అంది ప్రియురాలు.




"నేను కొసరి కొసరి వడ్డిస్తుంటే మారుమాటాడకుండా తినే వారు..." అంటూ చనిపోయిన భర్తను తల్చుకుని మరీ ఏడుస్తోంది ఏకాంబరి...

"ఇంత చిన్న వయసులో ఎలా పోయాడా అనుకున్నాను. ఇదన్న మాట సంగతి..." అంది ప్రక్కింటి నీలాంబరి.






"మీరు కవితలు, కథలు కాకుండా ఇంకేమైనా రాస్తారా?" అడిగేడు ఎడిటర్.

"ఆ... స్నో... పౌడర్..." చెప్పింది కొత్త రచయిత్రి.



"లేదు అనే పదం నా డిక్షనరీలో లేదు..."

"అలాగా... మీ డిక్షనరీ ఓ సారి యిలా యివ్వండి చూస్తాను"

"సారీ ప్రస్తుతానికి నా దగ్గర లేదు..."

"కడగడానికి మా సర్వర్లున్నారుగా మీరెందుకు సార్ కడుగుతున్నారు" టిఫిన్ తిని హోటల్లో చంచాలు కడుగుతున్న రామేశాన్ని చూసి అన్నాడు మేనేజర్.

"అలా కడగకుండా పెట్టేసుకుంటే జేబులు పాడయిపోతాయి" టక్కున అని నాలిక్కరుచుకున్నాడు రామేశం.





"డార్జిలింగ్‌లో మనం వున్న హోటల్ పేరేమిటండీ గుర్తు రావటం లేదు."

"ఆ హోటల్ పేరెందుకు యిప్పుడు?"

"ఆ హోటల్ చాలా బావుందని మా ఫ్రెండుకు చెప్పాను. వాళ్ళు కూడా వెళ్తున్నారట. అడ్రస్సు అడుగుతున్నారు. ఏమిటా ఆ హోటల్ పేరు?"

"ఉండు మన బాత్‌రూంలో ఉన్న నాప్‌కిన్‌లు చూసి చెబుతాను."

"నన్ను నమ్ము రాధా! నాకు ఉద్యోగం రాగానే నిన్ను పెళ్ళి చేసుకుంటా...."

"నన్ను చేసుకోవడం ఇష్టం లేదని సూటిగా చెప్పొచ్చుగా...."



**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లిలేదు, తండ్రి అప్పులు చేసాడు, చెల్లెలి కాపురం చిక్కుల్లోపడింది. డబ్బుంటేఉండే కష్టాలగురించి అజయ్‌చెప్తున్నాడు. అతనికి బాల్యం లోనే తల్లిపోయింది, మేనత్త సాకింది.చదువుకై విదేశాలు వెళ్లినపుడు తండ్రిపోయాడని తెలిసితిరిగివచ్చాడు.ఎస్టేట్ మానేజర్ భానోజీయే పెత్తనం చలాయిస్తున్నాడు.... (ఇక చదవండి)

అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నెం 3



**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

స్నానాదికాలు ముగిశాక బట్టలు మార్చుకుని అత్తయ్యగదిలోకి వచ్చాడు అజయ్. అడుగుల చప్పుడునుబట్టి ఆవిడ పసిగట్టి, 'ఎవరూ అజయేనా?' అంది.

'అవునత్తయ్యా. భలే ఆకలిగా వుంది' అంటూ వచ్చి మంచం మీద కూర్చున్నాడు.

'లచ్చీ అయ్యగారికి భోజనం తీసుకురమ్మని మీ నాన్నతో చెప్పు' అంది అత్తయ్య.

పూలమాల కడుతున్న లచ్చి అదక్కడపడేసి తండ్రిని తీసుకొని వంటయింటికి వెళ్ళింది.

అంతలోనే గదిలోకి కొత్తపరిమళం, ఆ వెనక చురుగ్గా హుషారుగా పడుతున్న అడుగుల చప్పుడు, గాజుల చప్పుడు, ఉత్సాహం, కాంతివచ్చాయి.



ఇంకో అరక్షణం తరువాత 'నమస్కారం పిన్నిగారూ, నమస్తే అజయ్‌బాబూ' అంటూ ఇరవైరెండేళ్ళ బాలిక - అందాల చందాల మాలిక - సరళ, ఆగదిలో ప్రవేశించింది. ఆమె వెనక తండ్రి భానోజీరావుగారు నెమ్మదిగా వచ్చారు. ఆ అడుగుల సవ్వడికూడా విన్న అత్తయ్యగారు, మందహాసం చేసి, 'రా సరళా' మీ నాన్నగారినికూడా వెంటబెట్టుకు వచ్చినట్టుండే. ఏమిటి విశేషం?' అంది. మాటలకు అర్థాలు తెలియడంవేరు, ధ్వనులు స్ఫురించడంవేరు. భానోజీరావుగారికి ధ్వన్యలంకారం బాగా తెలుసు. ఆయన భాషావేత్త. అత్తయ్యగారి ప్రశ్నకి, అమ్మాయికన్న తనే జవాబుచెప్పడం ఉచితం అని తోచింది. ఆవిడ ప్రశ్నకూడా, అడిగింది సరళనయినా, ఉద్దేశించింది తననే.

'మా సరళ వుంది చూశారూ...' అంటూ అజయ్‌కేసి చూసి నవ్వి ఉపోద్ఘాతం ఆరంభించాడాయన.

'నువ్వుండు నాన్నా' అంటూ అజయ్ దగ్గరకు వెళ్ళింది సరళ. 'అజయ్‌బాబూ; మీకోసం ఏం తెచ్చానో తెలుసా? మీకిష్టమైన పాలకోవా. స్వయంగా నేనే తయారుచేశాను. రుచిచూసి ఎలా వుందో చెప్పరూ?' అంది ఆప్యాయంగా.



త్రుటిలో, పెద్దావిడ భ్రుకుటి ముడివడి, వడివడిగా విడి, చిరునవ్వుగా మారిపోవడం ఎవరూ గమనించలేదు.

'అప్పుడే పిండివంటలు చెయ్యడం కూడా నేర్చుకున్నావన్నమాట... కాని, ఇవాళ అజయ్ వంట్లో ఏమీ బాగాలేదు సరళా. ఈ పూటకి భోజనం కూడా మానేస్తే మంచిదన్నాను' అంది కొంచెం గాంభీర్యం నటించి.

భానోజీగారు... ఆవిడకు కనబడకపోయినా సరేనని కంగారు అభినయించి, 'అలాగా!... అమ్మాయి సరళా నువ్వెళ్ళి డాక్టరుకు ఫోన్‌చెయ్యి. అర్జంటుగా రమ్మను' అన్నాడు.



'కాదు నాన్నా! నేనే కారులోవెళ్ళి, దగ్గరుండి తీసుకొస్తాను' అంది సరళ.

'అవునవును అదే మంచిది. అజయ్‌బాబూ! మీరు రెస్టు తీసుకోండి. నాకు ఆఫీసులో అర్జంటు పనుంది. మళ్ళీ వస్తాను' అంటూ సెలవు తీసుకున్నాడు మానేజరుగారు.



తండ్రి కూతుళ్ళిద్దరూ వెళ్ళగానే అంతవరకూ తమాయించుకున్న అజయ్ గిరుక్కున అత్తయ్యకేసి తిరిగాడు. 'ఏఁవిటిది అత్తయ్యా! నాకు జబ్బేమిటి? డాక్టరేమిటి?' అన్నాడు. అతనికీ ధోరణి బొత్తిగా కొరుకుడు పడలేదు.

అత్తయ్య మందహాసం చేసింది. ఆవిడకి దృష్టి లేక పోయినా, దూరదృష్టి చాలావుంది. అది చాలా నిశితమైనదికూడా. మాటల్నిబట్టి మనుషుల్ని విలువకట్టి చెప్పగలదు.

'ఏం లేదు నయనా! నా భయం నాది. వంశాంకురానివి ఒక్కడివి మిగిలావు. ఇంత ఆస్తివుంది. ఏ క్షణంలో ఎవరికి ఏ బుద్ధి పుడుతుందో చెప్పలేం... అందుచేత ఈ యింట్లో వెంకన్నతప్ప, ఎవరు ఏమిచ్చినా తినొద్దు' అందామె నెమ్మదిగా.

అజయ్ నిర్ఘాంతపోయాడు. 'అంత భయంకరమైన పరిస్థితిలో ఉన్నానా నేను?' అన్నాడు యాంత్రికంగా...

'అవును నాయనా అవును. డబ్బు పాపిష్టిది. ఎంత పనైనా చేయిస్తుంది.'

అజయ్ అయోమయస్థితినించి ఇంకా బయటపడలేదు. ఇదంతా నమ్మశక్యంకాని విధంగా వుంది. శూన్యంగా చూస్తూ కూర్చుండిపోయాడు.

'కావలసింది తినడానిక్కూడా స్వతంత్రం లేదు. ఎందుకీ ఐశ్వర్యం' అని ఘోషించిందతని హృదయం.

ఆ మాటలే, అప్రయత్నంగా అతని నోట వెలువడ్డాయి.



రెండు మూడు రోజుల విశ్రాంతి తరువాత, తప్పనిసరిగా, ఆస్తి స్థితిగతులు తెలుసుకోవడం, ఫ్యాక్టరీల వ్యవహారాలూ, అప్పులూ, బాకీలూ, పన్నులు వగైరా లావాదేవీలలో తలదూర్చి ఒక్కొక్కటీ పరిశీలించడం ఆరంభించాడు అజయ్. మానేజరు భానోజీరావుగారు - వాత్సల్యం ప్రకటిస్తూ అతనికి సాధకబాధకాలు అన్నీ తెలియజెప్పసాగారు. ఆయన ఒక్కొక్కటీ చెబుతూ ఉంటే, లేచిపారిపోవాలనిపించినా, అత్తయ్య ఆజ్ఞ గుర్తుకు తెచ్చుకుని కుదురుగా కూర్చుంటున్నాడు అజయ్. అయినా భానోజీగారు, తలతిరిగి పోయేట్టే ఒక్కొక్కటీ విన్నవిస్తూనే ఉన్నారు... అత్తయ్యగారి ఆజ్ఞ... చెప్పక తప్పదుమరి. లేకపోతే అజయ్‌నిలా శ్రమ పెట్టడం ఆయనికీ ఇష్టం లేదు. అదీకాక, ఆస్తికి యజమాని - తనమీద ఎంత గురీ నమ్మకం ఉంచినా, తాను ఎంత దక్షతతో విశ్వాసంతో వ్యవహారాలు చక్కబెట్టినా, యజమానిగా కొన్ని తెలుసుకోవడం ఆయన విధి; భృత్యుడుగా తెలియజెప్పడం తన ధర్మం... అదీకాక, నేడు గాకపోతే రేపు అయినా, తనూ అయ్యగారి అడుగుజాడల్లో వెళ్ళిపోవలసినవాడే. అప్పుడు ఎవరు చూసిపెడతారు?... తల్లిలేని బిడ్డ - తన కుమార్తె సరళా, అజయ్‌బాబూ చిలకా గోరింకల్లా నిశ్చింతగా తిరగడం చూడాలని తనకీ కోరిక వుంది. అయినా, కొంత ఇదీ వుండాలి... ఫ్యాక్టరీ వర్కర్లు గొడవపెట్టేరామధ్య. అదంతా ఓసారి చెప్పుకువచ్చాడు భానోజీగారు. అజయ్ విసుగెత్తి వెళ్ళిపోయాడు.

మర్నాడు మళ్ళీ సంగ్రహంగా వివరించారు.

'అదీ విషయం. మన ఫ్యాక్టరీ పనివాళ్ళతో వచ్చిన తగాదా లేబర్ ట్రిబ్యునల్ దాకా వెళ్ళింది. గవర్నమెంటు తీర్పు ప్రకారం ఇప్పుడు మనం 70 వేలు పరిహారం ఇవ్వాలి' అన్నారు భానోజీగారు యజమాని ముఖం పరీక్షగా చూస్తూ.

'70 వేలే!?' అన్నాడు యజమాని ఆశ్చర్యంగా.

మానేజరుగారు తృప్తిగా మందహాసం చేశారు.

అజయ్ ఆశ్చర్యంతో, హడలుతో అబ్బా అన్నపుడల్లా ఆయన కొంచెం వ్యవహార దక్షుడి గర్వం మిళాయించి, కొంత తృప్తితో చిరునవ్వులు ప్రసరిస్తూ వున్నారు.

అక్కడికది అలావుంది. 50 వేల ఋణపత్రంపై వచ్చిన నోటీసు అజయ్ పఠించాడు. అజయ్ మళ్ళీ ఆశ్చర్యపోయాక, తురుఫాసులాటి రాబడి పన్ను నోటీసు తీసి పరిచయం చేశారు.

'ఇది ఇన్‌కంటాక్సు నోటీసు. మొదటి వాయిదా లక్షయాభై వేలూ ఈ నెలాఖరులోగా కట్టాలి'. అన్నారు ఆనందాన్ని దిగమింగుతూ.

అజయ్ ఆశ్చర్యపడేలోగా టెలిఫోను మోగింది. మానేజరుగారు ఉత్సాహంగా అందుకున్నారు.

'అవును. నేనే... నమస్తే నమస్తే...' అంటూ ఫోను మౌత్‌పీస్ మూసి, 'కంట్రాక్టర్ ప్రసాద్' అని యజమానికి విన్నవించి, అబ్బే ఎంతమాట! ఈ మాత్రానికి కోర్టులో దావా ఎందుకండీ! అజయ్‌బాబు వచ్చేశారుగా. ఏర్పాటు చేసేస్తా' అంటూ రిసీవరు పెట్టేశాడు.

'మన ఫ్యాక్టరీకి కొత్త మెషినరీ సప్లయి చేశాడు. అరవై వేలయింది బిల్లు. అదీ సంగతి' అంటూనే, బిల్లుల పుట్టలో చెయిపెట్టి, మరో బిల్లు పైకి లాగారు.

అజయ్‌కి ఆశ్చర్యపడే ఓపిక పోయింది. తలనొప్పికూడా వచ్చింది.

'ఆపండి. నే వింటున్నకొద్దీ మీరు చెబుతూనే వుంటారు. ఈవేళకీ తలనొప్పి చాలు' అంటూ లేచిపోయాడు...

--|--



'అదీ నా పరిస్థితి' అన్నాడు అజయ్‌బాబు బరువుగా నిట్టూర్చి. బీదవాళ్ళ బీదబాధలు పడితే, గొప్పవాళ్ళ గొప్పబాధలు పడతారు. బాధ అందరిదీ ఒకటే, గుచ్చుకున్నది గులాబీ ముల్లయినా, తుమ్మముల్లయినా నొప్పి ఒకటే. ముల్లు ముల్లే కాని, ఈ వేదాంతం విజయ్‌కుమార్‌కి బోధపడినట్టులేదు.

'ఐశ్వర్యాన్ని అంటిపెట్టుకుని ఎన్ని చిక్కులూ, బాధలూ వున్నాయో చూశారా?' అన్నాడు అజయ్.

'క్షమించాలి. నాకేం అర్థం కావటంలేదు. అలాంటివి కూడా బాధలేనంటారా?' అన్నాడు విజయ్‌కుమార్ సూటిగా.

అది కసికొద్దీ అన్నమాట కాదు. అందులో కపటం లేదు. అయినా, నా బాధ మీ బాధకన్న గొప్పది అన్న అహంలాంటిది వుంది.

అజయ్ కంఠంలో అప్రయత్నంగానే ఉద్వేగం జొరబడింది. 'ఇవి బాధలు కావా? నేను ఇల్లు చేరేసరికి నాన్న పోవడం, యెటు చూసినా అప్పులు - అంతుపట్టని ఆర్థిక సమస్యలు - ఏ క్షణంలో ఎవరే కీడు తలపెడతారోననే భయంతో గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని బ్రతకడం - క్షణం సుఖం లేదు. శాంతి లేదు' అన్నాడు బాధపడుతూ, తనమీద తనే జాలిపడుతూ.



విజయ్ నవ్వాడు. 'అవన్నీ మీరు ఊహించుకొంటున్న బాధలు, అవీ ఓ బాధలేనా? నేనే మీ స్థానంలో వుంటే -' అని, అర్థోక్తిలోనే ఆగిపోయాడు. 'నిజం?' అంటూ అందుకున్నాడు అజయ్. అతని కళ్ళు ఆశ్చర్యంతో, సంభ్రమంతో, ఒక కొత్త వుత్సాహంతో మెరిశాయి. ఓ గంటక్రితం, రోడ్డుమీద తూముదగ్గిర మసక వెలుతురులో యీ యువకుడి ముఖం

లీలగా చూసినపుడు, ఇట్టే మెరిసి మాయమయిన భావం ఇంతసేపూ ఏ మూలో తనలో మెదులుతూనే వుంది. ఈ క్షణంలో అది ఒక స్పష్టమైన రూపం ధరించింది.



అజయ్ హఠాత్తుగా తనకేసి అదోలా చూడడం గమనించి విజయ్‌కుమార్ కొంచెం తికమకపడ్డాడు. అలా పరీక్షగా చూడడం అతనికెలాగో వుంది.

'ఇందాకటినుంచీ మీరూ గమనిస్తున్నారు - మనిద్దరం అచ్చు గుద్దినట్టు ఒక్క పోలికగా ఉన్నాం' అన్నాడు అజయ్.



విజయ్ కేమీ అంతుపట్టలేదు. కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాడు.

'... మనిద్దరిలో ఎవరు ఎవరో దేవుడుకూడా పోల్చుకోలేడు...' అన్నాడు అజయ్.

విజయ్, కళ్లు చికిలించి, తలవంచుకుని, మళ్ళీ పైకెత్తి అజయ్ ముఖం చూశాడు.

'... అంచేత మన స్థానాలు కొన్నాళ్ళు మార్చుకుందాం. నా బాధ్యతలు మీరు మొయ్యగలరో లేదో' అన్నాడు అజయ్ ఉత్సాహంగా.

విజయ్‌కి అంతా బోధపడింది. గుండె నిబ్బరం చేసుకుని, 'మొయ్యలేనివాణ్ణినేను కాదు; మీరు...' అన్నాడు తన పాత వాదాన్నే మరోసారి స్పష్టపరుస్తూ.

'ఫరవాలేదు, కాయకష్టం చేస్తూ కలో గంజో తాగుతూ పేదవాళ్లే హాయిగా కాలంగడుపుతారు. ఈ కుట్రలూ, కుతంత్రాలూ లేని నిర్మలమైన జీవితం వాళ్ళది. కొన్నాళ్ళు అలా జీవించాలని వుంది నాకు... మీరూ మా ధనిక జీవితం అనుభవించి చూడండి' అన్నాడు అజయ్ ప్రాధేయపడుతున్నట్టు. అతను మనస్ఫూర్తిగా ఈ మాటలు అంటున్నాడనిపించింది విజయ్‌కి.

'నా పరిస్థితులు చూసి నా మీద జాలికొద్దీ మీరలా అంటున్నారు. కాని మా యింట్లో బాధల్ని మీరు ఒక్కరోజు కూడా భరించలేక పరుగెత్తుకొస్తారని నా భయం' అన్నాడు, ఒక విధంగా గర్వపడుతూ.

ఇది సవాలులా వినిపించింది అజయ్‌కి. అటు తన ధనిక జీవితం పట్ల విసుగూ, కొత్త జీవితం చూడాలన్న కుతూహలం, కొత్త సమస్యపై గెల్పు సాధించాలన్న ఉత్సాహం కలిసి, అతను ఆ క్షణంలో ఖచ్చితంగా నిశ్చయం చేసుకున్నాడు - ఈ సవాలుకు తన బలం ఎదురొగ్గి నెగ్గాలని.

'అలాటి భయం లేకుండా ముందే షరతులు పెట్టుకుందాం. ఒక్క ఏడాది గడువు. ఈ లోపుగా మనం ఏమైనా సరే స్థలాలు మార్చుకో కూడదు. అలా అగ్రిమెంటు రాసుకుందాం ఏం? సరేనా? ఏమిటలా ఆలోచిస్తున్నారు?' అన్నాడు ఉత్సాహంగా విజయ్ భుజంతట్టి రెచ్చగొడుతూ.



విజయ్ లేచాడు. పట్టుదల వుట్టిపడేలా పూరించిన నాసా పుటాలు, అతని ఉద్దేశ్యాన్ని కూడా వెల్లడించాయి.

'సరే అలాగే చేద్దాం. ఇదీ ఒక పరీక్షే. ఈ ఛాలెంజిలో ఎవరు నెగ్గుతారో చూద్దాం' అన్నాడు - తాను నెగ్గడం మాత్రం ఖాయం అన్న ధీమా వ్యక్తపరుస్తూ.

'అయితే, బాత్‌రూమ్‌కి వెళ్ళి స్నానం అదీ కానివ్వండి' అన్నాడు అజయ్‌బాబు.

అది కలిమి, లేమి చెలిమి చేసిన సన్నివేశం. ఉప్పుకప్పురాలు వేషాలుమార్చుకున్న ఘట్టం. రెండు భిన్న దృక్పథాలు స్థలాంతరాలలో సాహసయాత్రకు తరలినవేళ. తమ సమస్యలు తాము పరిష్కరించుకోలేక, ఎదటివాడి సమస్యలు, సులువని వాటిని చేపడుతున్న ఆ ఇద్దరూ తాము తప్పక నెగ్గుతామనే నమ్ముతున్నారు. ఇద్దరూ నెగ్గితే బుజువయేదేమిటి? ఈ ప్రశ్నకి జవాబు యిద్దరూ ఆలోచించలేదు. కారణం ఎదటివాడు విఫలుడవుతాడని ఇద్దరికి ఇద్దరూ నమ్మడం. అజయ్ జీవితాన్ని తాను ధరిస్తున్నానని, తన జీవితాన్ని అజయ్ ధరిస్తున్నాడనీ విజయ్ అనుకున్నాడు. అజయ్‌కూడా ఆ మాటే అన్నాడు.





పదినిముషాలలో - బింబ ప్రతిబింబాలలా ఉన్న ఆ యువకులిద్దరూ వేషాలు, తద్వారా జీవితాలూ మార్చుకున్నారు. విజయ్ దుస్తులలోవున్న అజయ్ తన ధనికమిత్రుడు విజయ్‌ని పరీక్షగా చూశాడు. ఇంట్లో అతన్ని ఎవరూ అనుమానించలేరు.



'వెరీగుడ్, కాని ఒక్క చిన్ని అడ్జస్ట్‌మెంట్' అంటూ, విజయ్ ముంగురులను కొంచెం ముందుకు దించి, రింగులా చుట్టాడు.

'రండి. అగ్రిమెంటు రాశాను. సంతకం పెట్టండి' అంటూ కాగితం బల్లమీద పరచాడు.



విజయ్ దానిమీద సంతకంచేసి, మడిచి తన జేబులోనే ఉంచుకున్నాడు - తన కొత్తయింట్లో పదిలపరచడానికి. హఠాత్తుగా అతనికి ఒక ముఖ్య సమస్య - ప్రాణతుల్యమైనది, గుర్తుకొచ్చింది.

'అజయ్‌బాబూ! మా చెల్లెలు సంగతి?' అన్నాడు

అజయ్ నవ్వి మిత్రుడి భుజం తట్టాడు.



'మీ చెల్లెలుకాదు, నా చెల్లెలు. మీరు అజయ్‌బాబు, నేను విజయ్‌కుమార్' అంటూ, తన అజయ్‌బాబు అవతారపు ముంగురులను పైకెగదోసుకున్నాడు.

విజయ్ తృప్తిగా నవ్వాడు. ఇక తన చెల్లెలుకు భయం లేదు. తనకన్న గట్టి అన్న దొరికాడు.



'వదండి' అన్నాడు అజయ్‌బాబు గదిబయటకు దారితీస్తూ.

(ఇంకా వుంది)


చదువులావు
సత్యమూర్తి BV
ఏంటీ? కథలు గానీ వ్రాస్తున్నావా?
కథలు వ్రాయడానికి పెద్ద తెలివితేటలు అక్కర్లేదు
మహాశిరగాడు. ఈయన ఏమాత్రం ఆలోచించనీయకుండా బాగా డిస్టర్బ్ చేస్తున్నాడు
ఓ...
అసలు నేను తెలివితేటలు పోయి, పరమ మూర్ఖుడ్నైపోయినప్పుడు
కథలు రాయడం మొదలెడ్తాను
అయితే మీరు తక్షణం కథలు రాయడం మొదలెట్టాలి.



త్రిపురకు చెందిన రాజవంశంలో పుట్టారాయన. రాజరికపు హంగులు ఆర్భాటాలు అతన్ని డాబు దర్పాల్లో ముంచెత్తలేదు. ఎప్పుడూ తన కిష్టమైన సంగీతాన్ని వినడంలో ఉన్న ఆనందంలో మునిగి పోయే వారు. రాజవంశంలో సంగీతం అంటే కళాపోషణలో ఒక భాగం తప్ప అదే వృత్తిగా స్వీకరించడం కాదు. అయినా సచిన్‌దేవ్ బర్మన్ చేసినది అదే! రాజ్యాలేలడానికి బదులు తన సంగీతాధికారంతో సంగీత ప్రియుల హృదయాలను ఏలారు. తన జీవితాన్ని సంగీత కళ "ఆరాధన"లో తరింపజేసుకున్నారు. నాలుగు దశాబ్దాల పాటు బెంగాలీ, హిందీ సినీ రంగాలను తన సంగీతంతో సుసంపన్నం చేసిన ఎస్.డి.బర్మన్ "సచిన్‌దా"గా ప్రసిద్ధులు. 1906 అక్టోబర్ 1న నేటి బంగ్లాదేశ్‌లోని కొమిల్లాలో జన్మించారు. తండ్రి నవద్వీప్‌చంద్ర దేవ్ బర్మన్ బహదూర్ సితార్ వాద్య కళాకారులుగా మంచిపేరున్న వారు. తొలినాట తండ్రి వద్దనే సితారుపై సంగీతంలో తొలి పాఠాలు నేర్చుకున్నారు. ఉత్సవాల్లో తండ్రితో కలిసి సితారు వాయించేవారు. దరిమిలా గాయకునిగా సంగీత ప్రపంచంలోకి ప్రవేశించారు.

# సఫలమైన సచిన్‌దా సంగీత "ఆరాధన"

ప్రకృతిలో, ప్రజల జీవన సౌందర్యంలో దాగున్న సంగీతాన్ని అన్వేషించడం నేర్చుకున్న వాడు బర్మన్. మత్స్యకారులు, పడవ నడిపేవారు, భిక్షకులు, రైతులు, కార్మికులు పాడుకునే పల్లె పదాలు విని మైమరచిపోయే వారు. బాల్యంలో తన ఇంట్లో కిటికీ దగ్గర కూర్చుని వచ్చిపోయే వారి చూస్తుండటం అతనికి అలవాటు. ఒక రైతు రోజూ ఉదయం పొలానికి వెళుతున్నప్పుడు, సాయంత్రం పొలం నుండి తిరిగి వస్తున్నప్పుడు "రంగీలా, రంగీలా, రంగీలా రే" అని ఓ పల్లెపదం పాడుకుంటూ తన్మయత్వంతో సాగిపోతుంటే మంత్ర ముగ్ధుడై వింటుండే వాడట బర్మన్. "ఆ పల్లె పదమే తనను సంగీతం వైపు మళ్లించిందని, తనలోని గాయకుడికి ఆ పాటే ప్రేరణ" అని చాలా ఏళ్ల కిందట ఒక రేడియో కార్యక్రమంలో చెప్పుకున్నారాయన.

కలకత్తా యూనివర్శిటీలో బి.ఏ. డిగ్రీ పొందిన తరువాత ఎం.ఏ. చదువుకోవాలనే ఆశయాన్ని ప్రక్కకు పెట్టి, తన కళకు మెరుగులద్దే విద్వాంసులను వెదుక్కోనారంభించారు.

తొలుత గ్రామఫోను పాటలు పాడిన బర్మన్‌కు టాకీలు రావడంతో సినిమా సంగీతం పట్ల ఆసక్తి పెరిగింది. ఆ ఆసక్తితోనే కలకత్తా న్యూథియేటర్స్‌కు వెళ్లి అవకాశాల కోసం ప్రయత్నం చేశారు. అయితే ఆ ప్రయత్నం నెరవేరలేదు. అప్పటికే బెంగాల్‌లో లలిత, జానపద గాయక ప్రముఖుడిగా మంచి పేరు పొందారు. 1933లో యహూదీకీ లడ్కీ చిత్రంలో పాడేందుకు అవకాశం వచ్చింది. అయితే బర్మన్ పాడిన పాటను తీసేసి పహాడీ సన్యాల్‌తో పాడించారు. రేడియోలో ఆయన పాడిన జానపద గీతాలు ఇంటింటా మారుమ్రోగాయి. 1935లో అలహాబాద్ సంగీత సమ్మేళనంలో సచిన్ గాన కౌశలం జాతీయమైంది.



భార్యా పుత్రులతో......

సరిగ్గా ఈ కాలంలోనే సచిన్ కిశోర్ చంద్ర దే 'సీత' (1934)లో నేపథ్యగానం చేసి సినిమా రంగ ప్రవేశం చేశారు. 1935లో "సాంఝేర్ పిధిమ్"లో పాడారు. అదే ఏడాదివచ్చిన "బిద్రోహి" చిత్రంలో నటించారు కూడా. బర్మన్‌ను గాయకుడిగా పరిచయం చేయడానికి ఆలస్యం చేసిన బెంగాలీ సినీ సీమ సంగీత దర్శకుడిగా చేయడానికి మాత్రం ఆలస్యం చేయలేదు. 1937లో "రాజ్గీ" బెంగాలీ చిత్రం అతను సంగీతం అందించిన తొలిచిత్రం. ఆ వెంట వెంటనే మరో పది చిత్రాలకు (బెంగాలీ) స్వరాలందించారు. కలకత్తాలో ఉండగానే

గాంధీజీని కలుసుకుని ఆయన ముందు పాటలు, భజన్స్ పాడి వినిపించారు. బర్మన్ పాటలు విన్న గాంధీజీ అభినందించారు. ఆనాటి మహాత్ముని కలయిక తరువాత బర్మన్ విదేశీ వస్త్రధారణ మానివేసి స్వదేశీ పద్ధతిలో బట్టలు వేసుకోవడం ప్రారంభించారు.

బర్మన్‌కు శాస్త్రీయ సంగీతంలో మంచి ప్రవేశం ఉండేది. కె.సి.దే, ఉస్తాద్ అల్లాఉద్దీన్ ఖాన్, ఉస్తాద్ బాదల్‌ఖాన్, బి.డి.చటర్జీ వంటి మహామహుల వద్ద శాస్త్రీయ సంగీతం నేర్చుకున్నారు. సినీ సంగీతంలో ఆయన చేసిన ప్రయోగాలు ఈ శాస్త్రీయ సంగీతం వల్లనే సాధ్యమైంది.

బర్మన్ సంగీతప్రతిభ నెమ్మదిగా బొంబాయికి వ్యాపించింది. 1944లో బొంబాయి చేరుకున్నారాయన. ఫిల్మిస్తాన్‌వారి "షికారీ" చిత్రానికి సంగీతం చేసారు. ఆయన పని చేసిన తొలి హిందీ సినిమా ఇదే. ఈ కాలంలోనే నౌషాద్ "రతన్" విడుదలవటంతో 'షికారీ' పెద్దగా హిట్ అవలేదు. తర్వాత 1945 "దో భాయి" బర్మన్‌కి హిట్ తెచ్చిపెట్టింది. ఈ చిత్రంలో గీతారాయ్ (దరిమిలా గీతాదత్)పాడిన "మేరా సుందర్ సప్నా బీత్‌గయా" పాట బాగా ప్రచారంలోకి వచ్చింది. అది మొదలు సచిన్‌దా సంగీత రథం ఇక ఎక్కడ ఆగలేదు.

ఆ రోజుల్లో అంటే 1950 దశకంలో రాజ్‌కపూర్ చిత్రాలకు శంకర్‌జైకిషన్‌ల సంగీతం ఎలాంటి ప్రధాన పాత్ర వహించేదో నవ్‌కేతన్ బ్యానర్‌పై దేవానంద్ తీసిన చిత్రాలకు, ఆయన హీరోగా నటించిన బయటి చిత్రాలకు ఎస్.డి.బర్మన్ రెగ్యులర్ సంగీత దర్శకుడు.

బర్మన్‌కు తన సంగీతం పట్ల కొన్ని పట్టుదలలు ఉండేవి. సినిమా పాటలు పాడుకోవడానికి తేలిగ్గా ఉండాలంటే వారికి వరుసలు జాగ్రత్తగా కట్టాలనే వారు. సినిమా పాటలు రాణించాలంటే కథ, పాటలు చిత్రీకరణ బావుండాలని అనుకునే వారు. తన సంగీతం చిత్ర నిర్మాతలు ఎవరు పడితే వారు కొనుక్కొనే సరుకు కాదని ఆయన భావం. అందుకే ఆయన తన దృష్టిలో మంచి నిర్మాతలు అనిపించిన వారికే పనిచేశారు. లెక్కలు కడితే 30 ఏళ్ల కాలంలో ఆయన సంగీతం చేసిన చిత్రాల సంఖ్య వందకు మించదు. రాశిలో ఇదేమి పెద్ద గొప్పది కాదు. వాసిలో మాత్రం అవి సాటిలేని చిత్రాలు. బర్మన్ సంగీత దర్శకత్వంలో తయారైన టాక్సీడ్రైవర్,



నౌదోగ్యారా, జాల్, పేయింగ్ గెస్ట్, బాజీ, కాలాపానీ, కాలాబాజార్, సుజాతా, గైడ్, ఆరాధనా, కాగజ్‌కెఫూల్, షర్మిలీ, తేరెమేరెసప్నే వంటి చిత్రాలలోని పాటలు మరుపురావు. ఇవే కాకుండా సచిన్‌దా ప్రేమ్‌పూజారి, అప్సర్, జ్యూయల్ థీఫ్, తేరెఘర్‌కె సామ్‌నే, బందినీ, అభిమాన్, అనురాగ్, ఇష్క్ పర్ జోర్‌నహీ తదితర చిత్రాలకు స్వరరచన చేశారు.

బర్మన్ ఇండస్ట్రీలోకి వచ్చేనాటికి 'నౌషాద్ - రఫీ' 'నయ్యర్ -ఆషా' వంటి కాంబినేషన్లు ఏకస్వామ్యాన్ని కొనసాగిస్తున్నాయి. వాటిని బ్రద్దలు చేసి తన పాటను పాడగలిగిన వాడే గాయకుడు అనేట్లుగా గీతాదత్, లత, ఆషా, రఫీ, కిశోర్, తలత్‌లందరికీ గొప్ప పాటలు పాడే అవకాశం కల్పించారాయన. 1969లో వచ్చిన "ఆరాధనా"తో సచిన్‌దా టాప్ మ్యూజిక్ డైరెక్టర్‌గా మరోసారి ఉన్నతస్థాయిని అందుకున్నారు. ఆరాధన పాటలు నేటికీ మెలోడియస్ సాంగ్స్. "మెరె సప్నోంకి రాణి కబ్ ఆయెగి తు", 'రూప్ తెరా మస్తానా" పాటలు ఈ తరం వారిని సైతం అలరిస్తాయి.

సచిన్‌దా స్వరాలతో రూపొందిన పాటలన్నీ రసగుళికలే. హేమంత్‌కుమార్‌తో 'హై అప్‌నా దిల్ తో అవారా' (సోల్వాసాల్), మన్నాదేతో "పూఛో న కైసే" (మేరీ సూరత్ తేరీ ఆంఖే), తలత్‌తో 'జల్తేహై జిస్ కె లియే' (సుజాతా), ముఖేష్‌తో 'ఓ జానేవాలె' (బందినీ), ఆశాతో "కాలీఘటాఛాయే" (సుజాత), రఫీతో "ఖోయా ఖోయా చాంద్" (కాలాబజార్), 'దిన్ ఢల్ జాయే' (గైడ్) వంటి పాటలు మనను నిరంతరం వెంటాడుతుంటాయి.

సచిన్‌దేవ్‌బర్మన్‌ది జీరబోయిన గొంతు. అయితే ఆ స్వరంలో అద్భుతమైన పాటలు జాలువారాయి. గాయకునిగా ఇండస్ట్రీలోకి వచ్చిన వాడవటం వల్ల సమయం, సందర్భం వచ్చినప్పుడు పది కాలాలు నిలిచి పోయే పాటలు పాడారు. 'సుజాతా'లో 'ఓమాఝీ, 'గైడ్'లో 'వహకౌన్ హై తేరా' 'బందినీ'లో 'మెరెసాజన్ హై ఉస్‌పార్' 'ఆరాధన'లో "సఫల్ హోగి తెరి ఆరాధనా పాటలు గాయకునిగా నిలబెట్టాయి.

ఆరాధనలో పాడిన పాటకు జాతీయ స్థాయిలో ఉత్తమ గాయకునిగా, "జిందగి - జిందగి" చిత్రానికి జాతీయ ఉత్తమ సంగీత దర్శకునిగా (1972), 1971లో పద్మశ్రీ అవార్డు, సంగీత నాటక అకాడమి అవార్డులు అందుకున్నారాయన. ఆ మహా సంగీత దర్శకుడు 1975 అక్టోబర్ 31న బొంబాయిలో మృతి చెందారు. సచిన్‌దా పని చేసిన చివరి చిత్రాలు 'బారూద్', 'త్యాగ్'.

బర్మన్‌దా కాలధర్మం చెంది రెండున్నర దశాబ్దాలు దాటినా తన జీవిత కాలంలో సృజించిన మధుర గీతాలు నిత్యవసంత సుమాలుగా సంగీతాభిమానుల హృదయాలపై సుగంధాలు వెదజల్లుతూనే ఉన్నాయి.

**-హెచ్. రమేష్‌బాబు**

### చిత్రం: కాలాబజార్

రచన: శైలేంద్ర గానం: మహమ్మద్ రఫీ

ఓ హో హో హో
ఖోయా ఖోయా చాంద్, ఖులా ఆస్మాఁ
ఆంఖోం మేఁ సారీ రాత్ జాయేగీ
తుమ్‌కో భీ కైసే నీంద్ ఆయేగి ఓ ఓ ॥ఖోయా ఖోయా॥
మస్తీభరీ హవా జో చలీ (2)
ఖిల్ ఖిల్ గయీ యే దిల్ కీ కలీ
మన్ కీ గలీ మేఁ హై ఖల్‌బలీ
కి ఉన్‌కో తో బులావో ఓ హోహో ఓ ఓ ॥ఖోయా ఖోయా॥
తారే చలే, నజ్జారే చలే (2)
సంగ్ సంగ్ మేరే వో సారే చలే
చారోఁ తరఫ్ ఇషారే చలే
కిసీకే తో హో జావో ఓ హోహో ఓ ఓ ॥ఖోయా ఖోయా॥
ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ
ఐసీ హీ రాత్, భీగీసీ రాత్ (2)
హాథోం మేఁ హాథ్ హోతే వో సాథ్
కహ్‌లేతే ఉన్‌సే దిల్ కీ యే బాత్
అబ్ తో నా సతావో ఓ హో హో ఓ ఓ ॥ఖోయా ఖోయా॥
హమ్ మిట్ చలే, జిన్‌కే లియే
హమ్ మిట్ చలే హైఁ జిన్‌కే లియే
బిన్ కుఛ్ కహే వో చుప్ చుప్ చుప్ రహే
కోయీ జరా యే ఉన్‌సే కహే
ఐసే నా ఆజ్‌మావో ఓ హోహో ఓ ఓ ॥ఖోయా ఖోయా॥

దేవ్ ఆనంద్ సినిమాలకు ఎస్.డి.బర్మన్ సంగీతం ఓ ట్రేడ్ మార్క్‌లాంటిది. శాస్త్రీయ సంగీతంలో దిట్ట అయినా బర్మన్ దేవ్ ఆనంద్ టైపు యూత్‌ఫుల్ సినిమాలకు వాటికి తగ్గ హుషారైన సంగీతమే అందించారు. నవకేతన్ బ్యానర్‌లో సోదరుడు విజయ్ ఆనంద్ దర్శకత్వంలో దేవ్ ఆనంద్ నిర్మించిన కాలాబజార్ (1960)లో ఈ పాట అప్పటికీ, ఇప్పటికీ హుషారైనదే! ముఖ్యంగా ఇంటర్‌లూడ్స్‌లో వినిపించే బిట్లు!

### చిత్రం: అభిమాన్

రచన: మజ్రూహ్ సుల్తాన్‌పురి గానం: లతా మంగేష్కర్

పియాబినా.... పియాబినా పియా బినా బసియా
బాజేన, బాజేన, బాజేన, పియాబినా
పియా ఐసే రూఠేకి హోంఠోసే మేరా సంగీత్ రూఠా (2)
కభీ జబ్ మైఁ గావూఁ, లగే మేరే మన్‌కా హర్ గీత్ ఝూఠా
ఐసే బిఛ్‌డే, హో ఓ ఓ ఓ, ఐసే బిఛ్‌డే మోసే రసియా ॥పియాబినా॥
తుమ్హారీ సదాబిన్ నహీఁ ఏక్ సూనీ మోరీ నగరియా (2)
కి చుప్ హై పపీహా, మయూర్ బోలే భూలే బన్ మేఁ సవరియా
దిన్ హై సూనా, ఆ ఆ ఆ ఆ, దిన్ హై సూనా, సూనీ రతియా ॥పియాబినా॥

బర్మన్ కెరియర్ చివరిదశలో వచ్చిన మాస్టర్ పీస్‌లలో 'అభిమాన్' (1973)ని చెప్పుకుని తీరాలి. నాయికా నాయకులిద్దరూ గాయకులే కావడంతో అనేక పాటలకు, బర్మన్ ప్రతిభా ప్రదర్శనకు అవకాశం వచ్చింది. అసూయతో దూరమయిన భర్త గురించి హీరోయిన్ పాడే ఈ విరహగీతానికి తెరపై జయా, తెరవెనుక లతా ప్రాణం పోశారు.

### చిత్రం: గైడ్

రచన: శైలేంద్ర గానం: ఎస్.డి.బర్మన్

వహాఁ కౌన్ హై తేరా, ముసాఫిర్, జాయేగా కహాఁ
దమ్ లేలే ఘడీ భర్, యే ఛైయాఁ పాయేగా కహాఁ ॥వహాఁకౌన్॥
బీత్ గయే దిన్, ప్యారే కే పల్‌ఛిన్
సప్‌నా బనీ వో రాతేఁ
భూల్ గయే వో, తూభీ భులాదే
ప్యార్ కీ వో ములాకాతేఁ (2)
సబ్ దూర్ అంధేరా, ముసాఫిర్ జాయేగా కహాఁ
కోయీ భీ తేరీ రాహ్ న దేఖే
నైన్ బిఛాయే నా కోయీ
దర్ద్ సే తేరే కోయీ న తడ్‌పా
ఆంఖ్ కిసీకీ న రోయీ (2)
కహే కిస్‌కో తూ మేరా, ముసాఫిర్ జాయేగా కహాఁ
కహ్‌తే హైఁ గ్యానీ, దునియా హై ఫానీ
పానీపే లిఖీ లిఖాయీ
హై సబ్‌కీ దేఖీ, హై సబ్‌కీ జానీ
హాథ్ కిసీకే న ఆయీ (2)
కుఛ్ తేరా నా మేరా, ముసాఫిర్ జాయేగా కహాఁ

దేవ్‌ఆనంద్, విజయ్ ఆనంద్, బర్మన్ కాంబినేషన్‌లో మరో ఆణిముత్యం 'గైడ్' (1965) కథానాయిక నాట్యకళాకారిణి కావడం వల్ల శాస్త్రీయ సంగీతం కూడా వినిపించే అవకాశం వచ్చింది. ప్రియురాలు చేజారిపోతుందేమోనన్న భయంతో ఫోర్జరీ చేసి జైలు కెళ్లిన కథా నాయకుడు జైలు నుండి బయటకు వచ్చాక వినబడే నేపథ్య గీతం ఇది. 'గైడ్'గా అందరికీ దారిచూపిన అతనికి దారీ, తెన్నూ తెలియక ఎక్కడో తేల్తాడు. ఈ పాటలో వినిపించిన వైరాగ్యం సినిమా క్లయిమాక్స్‌లో అతడు 'సాధువు'గా మారడానికి సంకేతం.

### చిత్రం: బందినీ

రచన: శైలేంద్ర గానం: ఎస్.డి.బర్మన్

ఓ రే మాఝీ, ఓ రే మాఝీ, ఓ ఓ మేరే మాఝీ
మేరే సాజన్ హైఁ, ఉస్‌పార్, మై మన్‌మార్ హూఁ ఇస్ పార్
ఓ మేరే మాఝీ, అబ్‌కీ బార్ లే చలే పార్, లే చల్ పార్ ॥మేరే సాజన్ హైఁ॥
హోమన్ కీ కితాబ్ సే తూ, మేరా నామ్ హీ మిటా దేనా
గున్‌తో నథా కోయీ భీ, అవగున్ మేరే భులా దేనా
ముఝ్‌కో తేరీ బిదా కా (2)
మర్‌కే భీ రహతా ఇంతజార్ ॥మేరేసాజన్॥
మత్ ఖేల్ జల్ జాయేగీ, కహతీ హై ఆగ్ మేరే మన్‌కీ (2)
మైఁ బందినీ పియాకీ, చిర్‌సంగినీ హూఁ సాజన్ కీ
మేరా ఖీంచ్‌తీ హై ఆఁచల్ (2)
మన్ మీత్ తేరీ హర్ పుకార్ ॥మేరాసాజన్॥

బందినీ (1963) బిమల్‌రాయ్ స్వంత చిత్రం. బెంగాల్ నేపథ్యం. క్లయిమాక్స్‌లో నావికుడి (మాఝీ) పాట. బర్మన్ గళ మెత్తితేనే ఆ పాటకు సంపూర్ణత్వం సిద్ధిస్తుంది. హీరో, హీరోయిన్లు విడిపోయారు. ఒకరికి తెలియకుండా ఒడ రేవులో నిరీక్షిస్తున్నారు. 'నా ప్రియుడు అవలి ఒడ్డున ఉన్నాడు. నావికుడా, నేనీ గట్టునే ఉండి పోయాను' అని మనసు రోదించే పాటను ఇంతకంటే బాగా ఎవరు రూపొందించగలరు?

# అగ్రశ్రేణి కామెడీ హీరో షమ్మీకపూర్

భారతీయ చలనచిత్ర సీమలో ఫేమస్ డైనాస్టీకి చెందినా షమ్మీ కపూర్ హీరోగా నటించిన మొదటి 17 సినిమాలు ఘోరంగా ఫ్లాపయ్యాయి.

అన్ని ఫెయిల్యూర్స్ తరువాత కూడా నిరాశపడకుండా కొత్త గెటప్‌లో అవతరించి హిట్ మీద హిట్ కొడుతూ దాదాపు పుష్కరం పాటు భారతీయ సినిమా ప్రేక్షకులను ఉర్రూతలూపాడతను.

1950 దశకంలో రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్, దేవానంద్‌లాంటి హీరోలు తమ చిత్రాల్లో అండర్‌టోన్‌లో డైలాగులు చెబుతున్న వాతావరణాన్ని తన యాహూ అనే పెద్దకేకతో బద్దలు కొట్టాడతను.

భగ్న ప్రేమికుడుకావటం కథానాయకుని లక్షణం అనే నిర్వచనానికి గుడ్‌బై చెప్పి అల్లరిపెట్టయినా అమ్మాయిని ఆకర్షింప జేసుకోవడమే ప్రజ్ఞ అనే కొత్తభాష్యం చెప్పాడు.

డైలాగులకంటే బాడీ లాంగ్వేజికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి హిందీ పెద్దగా అర్థంకాని ప్రాంతాల వారు కూడా తన సినిమాలంటే పడిచచ్చేలా చేసుకోగలిగాడు.

టీషర్టు అనే పదం బాలీవుడ్ వస్త్రపదకోశంలో లేనప్పుడే దాన్ని ధరించి సినిమాలలో టీషర్టుకు విశేషప్రాచుర్యం కల్పించాడతను.



అతడే షంషేర్ రాజ్‌కపూర్ ఎలియాస్ షమ్మీకపూర్.

1931 అక్టోబరు 21న జన్మించి న్యూ ఎరా హైస్కూల్లో మెట్రిక్‌పాసయి, రుయా కాలేజీలో కొంత కాలం చదివి తండ్రి పృథ్వీరాజ్‌కపూర్ స్థాపించిన పృథ్వీ థియేటర్ సంస్థలో 1948లో ఓ మామూలు ఉద్యోగిగా చేరాడు. అతని కుటుంబానికి సినిమా రంగంలో వున్న పేరు ప్రతిష్టలు అతని చలనచిత్ర జీవితానికి అంతగా ఉపయోగపడలేదు. 1952లో తొలిసారిగా నటించిన 'జీవనజ్యోతి' ఫేలయింది. గ్రీకు శిల్పంలాంటి పర్సనాలిటీ, ఆకర్షణీయమైన కళ్ళు, మంచి అందం ఇవేవీ 22 ఏళ్ళ షమ్మీకపూర్‌ను తొలిరోజుల్లో విజయవంతమైన హీరోగా నిలబెట్టలేకపోయాయి. మధుబాలతో చేసిన 'రైల్‌కాడిబ్బా', సురయ్యాతో చేసిన 'షమాపర్వానా', అనితాగుహాతో చేసిన 'టాంగావాలీ', నళినీ జయవంత్‌తో చేసిన 'మెహబూబా', నూతన్‌తో చేసిన 'లైలామజ్నూ', గీతాబాలితో చేసిన 'రంగీన్ రాతే' అన్నీ ఫెయిలయ్యి కూర్చున్నాయి.



అయినా హీరోయిన్ గీతాబాలి షమ్మీకపూర్‌ను ఘాటుగా ప్రేమించడం మొదలుపెట్టింది. అతన్ని విడిచి వుండడం ఆమె తరమయ్యేదికాదు. షమ్మీకపూర్‌ను సక్సెస్‌ఫుల్ హీరోగా చూడాలని ఆమె తపించేది. షమ్మీని గీతాబాలి ఎంత గాఢంగా ప్రేమించిందంటే అతని సరసన 'రంగీన్‌రాతే' సినిమాలో తనకో వేషం ఇమ్మని కేదార్‌శర్మను ప్రాధేయపడింది.

ఆ సినిమా ఔట్‌డోర్ రాణీఖేత్‌లో జరగాల్సివుంది. షమ్మీనీ విడవకుండా దగ్గరగా వుండడానికి ఆమెకదో అవకాశం.

1955 లో ఇరువురూ పెద్దల్నెదిరించి పెళ్లిచేసుకున్నారు. షమ్మీకి 24 వ ఏట ఒక కొడుకుపుట్టాడు. 24 వ ఏటకే పెళ్లయి సంతానం కూడా కలిగిఉండడం హీరోగా రాణించడానికి సినిమారంగంలో ఒక అనర్హత. అయినా షమ్మీ నిరుత్సాపడలేదు. తన కెరీర్ గురించి తనకంటే ఎక్కువగా గీతాబాలి తపన పడడం అతనికి ఉత్సాహాన్నిచ్చింది.

షమ్మీకి విజయం సాధించాలని పట్టుదల వచ్చింది. ఎల్విస్ ప్రెస్లీ, జేమ్స్ డీన్‌ల వంటి విదేశీ హీరోల ఫక్కీని ఇండియనైజ్ చేస్తే భారతీయ ప్రేక్షకులను ఆకట్టుకోవచ్చుకున్నాడు. పెన్సిల్ గీతలాంటి మీసాన్ని పూర్తిగా తీసేశాడు. హెయిర్‌స్టైల్ మార్చాడు. దీనికి గీతాబాలి ప్రోద్బలం వుంది. అలా ఒక ఇండియన్ ఎల్విస్ జన్మించాడు.

సరిగ్గా అప్పుడే నాజిర్ హుస్సేన్ 1957 లో రచయితగా, దర్శకుడిగా 'తుమ్‌సా నహీ దేఖా' మొదలు పెట్టి షమ్మీని హీరోగా, అమితాను హీరోయిన్‌గా తీసుకున్నాడు. ఫిల్మిస్థాన్ యజమాని తోలారాం జలన్ అమితాను తన సొంత ఆస్తిలాగా భావించేవాడు. అయినప్పటికీ నాజిర్ హుస్సేన్ ఆ సినిమాలో ప్రెస్లీటైప్ షమ్మీ హావభావాలను, అమితా అందచందాలను చక్కగా తెరకెక్కించి ఆ సినిమాను టాప్ హిట్ చేసాడు. ఓపి నయ్యర్ సంగీతం అందరినీ ఆకట్టుకుంది. దాని సక్సెస్‌తో ఫిల్మాలయా వారి చిత్రం 'దిల్ దెకే దేఖో' లో హీరోగా బుక్ అయ్యాడు. ఆశాపరేఖ్ హీరోయిన్. ఆమెకది మొదటి చిత్రం. ఆ చిత్రమూ టాప్‌హిట్. కొత్త సంగీత దర్శకురాలు ఉషాఖన్నా సంగీతం సమకూర్చిన పాటలన్నీ హిట్టే.

1961 వ సం॥ షమ్మీకపూర్‌ను ఉచ్చదశలోకి తీసుకెళ్లింది. 'జంగ్లీ' సినిమా కలర్‌లో వచ్చింది. కొత్త హీరోయిన్ సైరాబాను అందాలు కురిపించింది. శంకర్ జైకిషన్ పాటలన్నీ హిట్. కాశ్మీర్ అందాలు, యాహూకేకలు, సుకూ సుకూ అరుపులు మొత్తం కలిసి సినిమా వ్యాకరణపు సంకెళ్లను తెంచేశాయి. సీరియస్‌టైప్, కామెడీ, రొమాన్సు అన్నీ అద్భుతంగా చేశాడు షమ్మీ. గంతులేసే హీరోగా ఆవిర్భవించేటప్పుడు యాక్సిడెంట్లూ అవుతాయి. యాహూ కేకతో మంచు కొండ మీద నుంచి కిందికి దొర్లుతూ వచ్చినపుడు తనకు కలిగిన మోకాలి నొప్పి ఇప్పటికీ వుందంటాడు షమ్మీ!

1961-64ల మధ్య దిల్ తేరా దివానా, ప్రొఫెసర్, కాశ్మీర్-కీ-కలి, జాన్‌వర్, రాజ్‌కుమార్ సినిమాలు హిట్ మీద హిట్ కొట్టాయి. ప్రెస్లీశైలిలో డ్యాన్సులు, త్వరగా నోటికి పట్టుబడే పాటలు, ఇవన్నీ కామెడీ హీరోగా షమ్మీకపూర్‌ను నిలబెట్టాయి. ఆ దశలో రాజ్‌కపూర్, దేవానంద్,దిలీప్‌కుమార్లు దాదాపు వెనక బడ్డారు. బిశ్వజిత్, జయ్‌ముఖర్జీలు షమ్మీకపూర్ ను అనుకరించి స్థానం నిలబెట్టుకోవలసి వచ్చింది. 1965 తరువాత తీస్రీమంజిల్, ఏన్‌ఈవినింగ్ ఇన్‌పారిస్, బత్తమీజ్, లాట్‌సాబ్, ప్రిన్స్, తుమ్ సే అఛ్చా కౌన్ హైలు హిట్స్.

షమ్మీకపూర్ సినిమాలో పాటలన్నీ హిట్టే. అతనికి మొదటి దశలో తలత్‌మొహమూద్, హేమంత్‌కుమార్, మన్నాదేలు పాడినా ఆ పాటలేవీ అప్పటి ప్రేక్షకులకు నచ్చలేదు. తరువాత రఫీ పాడడం మొదలు పెట్టినతరువాత రఫీ, షమ్మీ గొంతులో పెనవేసుకపోయాయి. షమ్మీ తన సినిమాల మ్యూజిక్ సిట్టింగ్స్‌లో





పాల్గొనేవాడు. దీనికి ఆ నిర్మాతల ప్రోత్సాహం కూడా వుండేది. కాశ్మీర్‌కీ కలీ లో 'చాంద్ కా రోషన్ చహరా' అనే పాట చివర ఆ పాటలో 'తారీఫ్ కరూం క్యా వున్‌కీ' అనే చరణం కనీసం 10 సార్లు వాయిస్ తగ్గిస్తూ పాడమని రఫీకి సలహా ఇచ్చాడట. (స్లో విత్‌డ్రాయల్) ఆ ప్రయోగం చాలా విజయవంతమయింది. రఫీ షమ్మీకి పాడిన పాట చిత్రం చూడకుండానే కూడా గుర్తించేంత నైపుణ్యం ప్రేక్షక శ్రోతలకు కలిగింది.

1965 లో గీతాబాలి మరణించింది. భావనగర్ రాజకుటుంబానికి చెందిన ప్రిన్సెస్ నీలాదేవిని 1967 లో షమ్మీ వివాహమాడాడు. మొదటి సంబంధపు ఇద్దరు పిల్లల్ని నీలాదేవి సొంతపిల్లల లాగా పెంచింది.

షమ్మీకపూర్ నటన యూత్‌ను ఆకర్షిస్తుంది తప్ప అతనికి నటనేమొచ్చు అని కొందరు విమర్శకులు పెదాలు చప్పరించారు. కానీ 'తీస్రీ మంజిల్'లో హత్యా నేరం పైబడ్డ నిర్దోషిగా ఆ పాత్ర కున్న అవకాశాలను చక్కగా వినియోగించుకొని విమర్శకుల చేత ఔరా అనిపించుకున్నాడు. 'బ్రహ్మచారి'లో నటనకు గాను ఫిల్మ్‌ఫేర్ అవార్డు అందుకున్నాడు. 'విధాత'లో నటించిన షమ్మీకి బెస్టు సపోర్టింగ్ యాక్టర్‌గా 1982 లో మళ్లీ ఫిల్మ్ ఫేర్ అవార్డు వచ్చింది. ఆ మధ్య ఫిల్మ్‌ఫేర్, లైఫ్ టైమ్ అఛీవ్‌మెంట్ అవార్డు వచ్చింది.

1971 లో 'అందాజ్' లో షమ్మీకపూర్, హీరోగా నటించినా, అతిథి పాత్ర వేసిన రాజేష్‌ఖన్నాకు ఎక్కువ పేరురావడంతో కాలం మారిందన్న

# రొమాంటిక్ సీన్ల గురించి షమ్మీ...



**తె**రపై హీరోల భగ్న ప్రేమికుడి ఇమేజి మార్చివేసి, జబర్దస్తీగా హీరోయిన్ మనసుదోచి తెరవెనుక హీరోయిన్ల ఫేవరేట్‌గా పేరుపొందిన షమ్మీకపూర్ శృంగార దృశ్యాల గురించి ఏమంటారు?

1959లో 'ఫిలింఫేర్' పత్రికకు 'రొమాంటిక్ సీన్స్' అనే ఒక వ్యాసం రాస్తూ షమ్మీకపూర్ ఇలా అన్నారు.

"రొమాంటిక్ సీన్ల గురించి ఎంతో హిపోక్రసీ ఉంది. తెరమీద చూపించే శృంగారసన్నివేశాలలో మేం- అంటే నటులం- ఒక భ్రమ కలిగిద్దామని చూస్తాం. అది పొరపాటు. భ్రమ రొమాన్సును నాశనం చేస్తుంది.

నా మట్టుకు నేను నేచురల్‌గా ఉందామని చూస్తాను. కానీ నాతో నటించే హీరోయిన్లు ప్రేమంటే తెలియనట్లు నటిస్తారు. వాళ్ళ పద్ధతికి అడ్జస్టు అవుతూ క్రమంగా వాళ్ళకు చేరువకావటం ఒక క్రీడ. ఒక తమాషా ఆట. నిజం చెప్పే మగాడికి, అబద్ధం చెప్పే ఆడదానికి జరిగే మేధోయుద్ధంలాటిదది..

మాలాసిన్హా సంగతే తీసుకోండి- ఇదివరలో నేను 'రంగీన్‌రాతే'లో , ఈ మధ్య 'ఉజాలా'లోనూ ఆమెతో కలసి నటించాను. చాలా గొప్పనటి. ప్రజాదరణ పొందిన నటి. కానీ పాపం ఆమె ఉద్దేశ్యంలో శృంగారం అనేది డైలాగ్‌రైటర్ మాటలతో సృష్టించవలసినదే. అందువల్ల ఆయన రాసిన డైలాగులు బట్టీపడుతూ కూచుంటుంది. అవి సరిగా గుర్తుకురాకపోతే నెర్వస్‌అయిపోయి సీన్‌లో సహజంగా ఉండలేదు. ఇక అలా ఉన్నవాళ్ళతో ప్రేమ(తెరమీదనైనా) ఎలా పుడుతుంది చెప్పండి?

నేను తెరపై రావడమేలేటు. అప్పటికే పెద్దపెద్ద తారలు ఉద్భవించారు. హీరోలు వారికంటె ప్రసిద్ధులైన హీరోయిన్ల వద్ద, హీరోయిన్లు వారికంటె ప్రసిద్ధులైన హీరోలవద్ద లవ్‌సీన్ల గురించి 'నేర్చేసుకున్నారు'. నా హీరోయిన్లు మా అన్న రాజ్‌కపూర్, అశోక్‌కుమార్, దిలీప్‌కుమార్ సరసన ఆల్‌రెడీ నటించేసి ప్రేమ ఎలా నటించాలో నాకు నేర్పబోయారు.

దాంతో నాలోని' రెబెల్' మరింత తిరగబడేవాడు. వాళ్ళందరికీ'నా మెథడ్' ఏమిటో చూపనారంభించాను. అతి త్వరలో నాకు అర్థమయిందేమిటంటే వాళ్ళకు రొమాంటిక్ సీన్ల గురించి తెలుసు, రొమాన్సు గురించి తెలియదు! అది నేర్పే భారం నామీద పడింది.

ఉదాహరణకు మధుబాలను తీసుకోండి.'రేల్ కా డిబ్బా', 'నకాబ్' రోజులనుండీ నా ఫ్రెండే! పూనాలో మేం ఇద్దరం మంచి రొమాంటిక్ సీన్లు నటించటమే కాదు వాటి గురించి చర్చించుకొనేవాళ్ళం.

అమీతా సంగతే చూడబోతే'ఠోకర్', 'తుమ్‌సా నహీ దేఖా'లలో నాతో నటించింది. తెగ రిహార్సల్స్ చేస్తుంది. కానీ మేకప్‌రూమ్‌లో ఒంటరిగా రిహార్సల్స్ వేస్తే ఏం లాభం?

ఇవన్నీ రాస్తే వాళ్ళకు కోపం రావచ్చు. కానీ నిజాలు నిజాలే కదా! వాళ్ళు ప్రేమ డైలాగులు అప్పచెబుతారు. కంటిరెప్పలు టపటపలాడిస్తారు. గుసగుసలాడతారు, నిట్టూరుస్తారు. ఇదంతా నటన అని తెలియగానే బోరుకొడుతుంది. తాము తొలిప్రేమలో పడ్డప్పుడు హావభావాలు ఎలా ఉన్నాయో వాళ్ళకు వాళ్ళు గుర్తుకు తెచ్చుకుంటే ఇక తెరపై ఇంత కృత్రిమత్వం కనపడదు.

నూతన్('లైలామజ్నూ' 'బసంత్'లలో నాతో చేసింది) మనసులోంచి రొమాన్స్ పుట్టినట్లు నటిస్తుంది. అలాగే వైజయంతిమాల ('కాలేజిగర్ల్' లో నా సహతార) ఫ్రెష్‌గా, రిహార్సల్ లేకుండా స్పాంటేనియస్‌గా నటిస్తుంది. డైలాగ్ రైటర్‌తో 'నీ రొటీన్ డైలాగులు నాకక్కర్లేదులే ' అని చెప్పేసినట్టు నటిస్తుంది.

పెర్‌ఫెక్ట్ లవ్‌సీన్ కోసం నేనూ, మీరూ ఇంకా వేచిచూడాల్సిందే!

సత్యాన్ని షమ్మీ గుర్తించాడు. గ్రేస్‌ఫుల్‌గా హీరో వేషాల్నించి తప్పుకున్నాడు. పెరుగుతున్న బరువు , రాలిపోతున్న జుట్టు, మీదపడుతున్న వయసున్నూ గుర్తించి హుందాగా నిష్క్రమించాడు.

దర్శకుడిగా అతను తీసిన 'మనోరంజన్'(దీనికి ఆధారం 'ఇర్మాలాడూస్' అనే ఆంగ్ల చిత్రం), 'బండల్ బాజ్' సినిమాలు ఫెయిల్‌కావడంతో ఆ రంగం వదలిపెట్టాడు. జామర్, ప్రేమ్ రోగ్, పర్వరిష్ సినిమాల్లో క్యారక్టర్ రోల్స్ ధరించాడు. కొన్ని టి.వి. సీరియల్స్‌లోనూ నటించాడు.

ప్రస్తుతం షమ్మీకపూర్‌కు కంప్యూటర్ మీద అభిమానం. రోజులో ఎక్కువ భాగం ఇంటర్నెట్ మీదనే గడుపుతాడు. ఇంటర్‌నెట్ యూజర్స్ క్లబ్ ఆఫ్ ఇండియాకు ఛైర్మన్. కొన్ని సంవత్సరాల క్రింద ఒక ఫిల్మ్ మ్యాగజైన్ సర్వేలో అత్యధిక శాతం ప్రేక్షకులు అతడిని 'బెస్టు డ్యాన్సింగ్ హీరో ఆఫ్ హిందీ ఫీల్డ్ 'గా ఎన్నుకున్నారు. షమ్మీకపూర్ ఆర్ట్ ఆఫ్ లివింగ్ తెలుసు. సినిమా రంగుల ప్రపంచం నుండి బయటకు వచ్చినా తనకు నచ్చిన వ్యాపకం ఇంటర్నెట్టే కాక సిడ్నీ షెల్డన్, జాన్ గ్రీషమ్, ఆర్థర్ హెయిలీ, ఇర్వింగ్ వ్యాలెస్ లాంటి



పాపులర్ నావెలిస్టుల నవలలే కాక మెయిన్ స్ట్రీమ్ లిటరేచర్ కూడా చదువుతుంటాడు.

తెరమీదనే కాదు నిత్యజీవితంలో కూడా చలాకీగా ఉండగలగడమే షమ్మీ ప్రత్యేకత!

**- యస్. కె. రామారావు**

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : హెచ్.ఎం.వి.

వెల : రూ. 40/-

1955లో విడుదలైన అన్నపూర్ణ పిక్చర్స్ వారి 'దొంగరాముడు', 1956లో విడుదలైన నరసు స్టూడియోస్ వారి 'భలేరాముడు' చిత్రాల్లోని పాటలను కలిపి ఒక కాంబినేషన్ క్యాసెట్‌గా హెచ్.ఎం.వి. వారు తీసుకువచ్చారు. 'దొంగ రాముడు' చిత్రంలో 9 పాటలు, 'భలేరాముడు' చిత్రంలో 9 పాటలు ఈ క్యాసెట్‌లో ఉన్నాయి. 'భలేరాముడు' చిత్రంలోని 'ఎందున్నావో మాధవా' 'హరే మురారే' పాటలను ఈ క్యాసెట్‌లో మినహాయించడం జరిగింది. నిడివిని, ధరని దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే ఆ మినహాయింపు నకు తగిన కారణాలు ఉండి ఉండవచ్చు. కాని, పాత సినిమాలలోని పాటలను అన్నింటిని అపురూపంగా దాచుకునే అభిమానులు ఆంధ్రదేశ మంతటా ఎంతోమంది ఉన్నారు. అటువంటి వారికి ఇటువంటి మినహాయింపులు చివుక్కుమనిపిస్తాయి. పైగా చరిత్రకు సంబంధించిన వాటిని తొలగించడం అంత సబబుకాదు కూడా! అవి అలభ్యంగా ఉండడం, ఒక వేళ లభ్యమైనా నాణ్యత లోపించి ఉండడం జరిగితే అప్పుడు ఈ రకం మినహాయింపులకు ఒక అర్థం ఉంటుంది. కాని ఆ రెండు పాటలు చక్కని నాణ్యతతో బైట లభ్యమౌతూనే ఉన్నాయి. ఇక వ్యాపారానికి సంబందించి - నిడివి, ధర విషయంలో - ఆ మేరకు పెంచి సవరించినా అభిమాన శ్రోతలు తప్పకుండా కొని తీరుతారని ఈ సమీక్షకుని వ్యక్తిగత అభిప్రాయం. ఇప్పటికీ సినీ సంగీతాభిమానుల హృదయాలలో మారుమ్రోగుతున్న మిగిలిన పాటలను గురించి ప్రత్యేకంగా చెప్పాలా - ఈ రూపంలోనైనా ఇన్ని పాటలు ఏకమత్యంగా లభించాయని మురిసి పోవడం తప్ప! కాకపోతే 'దొంగరాముడు' సినిమాలో 'రావోయి మా యింటికి' పాటలోని జిక్కితో పాట ఉన్న మగగొంతు 'మద్దాలి కృష్ణమూర్తి'ది అని ఇన్‌లే కవర్‌పై పనిలో పనిగా ముద్రించి వుంటే మరింత బావుండి ఉండేది.

తరువాయిభాగం 43వ పేజీలో...

---

MAA TV

# మా టీవీ సమర్పించు

## పాడాలని వుంది





కార్యక్రమాల వివరాలు

సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం

న్యాయనిర్ణేత

### ఎపిసోడ్ 11 : 19-10-02



1. టి.వి.యస్. శ్రీకాంత్ (రామగుండం)
   - శంకరా నాదశరీరా పరా... - (శంకరాభరణం)
   - మాయదారి మైసమ్మో మైసమ్మ... (బాచ్‌లర్స్)
   - భలేమంచి రోజు.. పసందైన రోజు... (జరిగినకథ)



2. తేజస్విని (హైద్రాబాద్)
   - అదివో అల్లదిగో శ్రీహరివాసము... (అన్నమయ్య)
   - ఉన్నమాట చెప్పనీవు... (నువ్వు నాకు నచ్చావు)
   - జాబురాతిరి.. జాబిలమ్మ... (క్షణ క్షణం)



3. విశ్వనాథ్ (హైద్రాబాద్)
   - ఓంకార నాదాను ... (శంకరాభరణం)
   - అయ్యయ్యో చేతిలో డబ్బులు... (కులగోత్రాలు)
   - ఊరకే కన్నీరు నింప... (లవకుశ)



4. హర్షిక
   - సా విరహే తవ దీనా... (విప్రనారాయణ)
   - జో లా జోలమ్మ జోల... (సూత్రధారులు)
   - మనసా తుళ్ళిపడకే... (శ్రీవారికి ప్రేమలేఖ)

### ఎపిసోడ్ 12 : 26-10-02



1. మనోజ్ఞ (హైద్రాబాద్)
   - నారాయణ హరి నారాయణ... (చెంచులక్ష్మి)
   - ఛీ ఛీ ఛీ బుల్లెమ్మా... (నువ్వులేక నేనులేను)
   - చూడాలని ఉంది... (ముద్దుబిడ్డ)



2. అరుణ్ కౌండిన్య (హైద్రాబాద్)
   - అలైపొంగెరా కన్నా... (సఖి)
   - ఉట్టిమీద కూడు ఉప్పుచాప తోడు... (ఒకే ఒక్కడు)
   - ఏ దివిలో విరిసిన... (కన్నె వయసు)



3. మృదుల
   - తియతీయని తేనెల మాటలతో... (ఖైదీ కన్నయ్య)
   - వానకాదు వానకాదు వరద రాజా... (భాగ్యచక్రం)
   - భారతమాతకు జేజేలు... (బడిపంతులు)



4. సాకేత్
   - దినకరా... శుభకరా... (వినాయక చవితి)
   - ఓ చిన్నదాన నన్నువిడిచి... (నేనంటే నేనే)
   - ఆడవే మయూరి నటనమాడవే... (చెల్లెలి కాపురం)

# షమ్మీకపూర్ హిట్స్

చిత్రం: దిల్‌దేకె దేఖో (1959) రచన: మజ్రూక్ సుల్తాన్‌పురి
సంగీతం: ఉషాఖన్నా గానం: రఫీ

దిల్ దేకె దేఖో (3) జీ
దిల్ లేనే వాలో దిల్ దేనా సీఖోజీ (2) ॥దిల్॥
పూఛో పూఛో పూఛో పర్‌వానే సే జరా
ధీరే ధీరే జల్‌నే మేఁ కైసా హై మజా ॥పూఛో॥
ఓ హోహో తుమ్ భీ దిల్ దేకే
జల్ జానా సీఖో జీ... ఆ హోహో ॥తుమ్॥ ॥దిల్॥
సమ్‌ఝో సమ్‌ఝో సమ్‌ఝో దీవానే కీ జబాఁ
ప్యార్ జోన హోతా న హోతా యే జహా ॥సమ్‌ఝో॥
ఓహోహో తుమ్ భీ దిల్ దేకే
యే గానా సీఖో జీ.... ఆహోహో ॥తుమ్॥ ॥దిల్॥

'షుగర్ ఇన్ ది మార్నింగ్ షుగర్ ఇన్ ది ఈవెనింగ్ షుగర్ ఎట్ ది సప్పర్ టైమ్' అనే పాట ఈ 'దిల్‌దేకె దేఖో' పాటకి ప్రేరణ. ఆ పాట ఆధారంగా తీసుకున్నా, సంగీత దర్శకురాలు ఉషాఖన్నా హిందీ వెర్షన్‌లో సాంగ్‌కు అద్దినసొగసులెన్నో ఉన్నాయి. ఇంటర్నెట్‌లో 'షుగర్ ఇన్ ది మార్నింగ్' పాట దొరుకుతుంది. రెండు పాటల్నీ పక్కపక్కన పెట్టుకొని వినండి. ఉషాఖన్నా పనితనం తెలుస్తుంది. ఇదిలా ఉండగా మనవాళ్ళు ఈ 'దిల్‌దేకె దేఖో' హిందీ వెర్షన్‌ని తీసుకుని నాగేశ్వరరావు, రాజసులోచన నటించిన 'శాంతినివాసం' (1960) సినిమాలో రేలంగి, సురభి బాల సరస్వతి అభినయించిన 'చక్కనిదానా చిక్కనిదానా ఇంకా అలుకేనా' అనే కామెడీ పాటగా మార్చేశారు.

చిత్రం: తుమ్‌సానహిదేఖా (1957) రచన: సాహిర్ లుధియాన్వీ
సంగీతం: ఓ.పి.నయ్యర్ గానం: రఫీ

యూతో హమ్‌నే లాఖ్ హసీ దేఖే హై
తుమ్ సా నహి దేఖా హో
తుమ్ సా నహి దేఖా ॥యూతో॥
ఉఫ్ యే నజర్ ఉఫ్ యే అదా (2)
కౌన్ న అబ్ హోగా ఫిదా
జుల్ఫ్ హై యా బద్‌లియా
ఆంఖే హై యా బిజ్‌లియా
జానె కిస్ కిస్ కీ ఆయేగీ కజా ॥యూతో॥
తుమ్ భీ హసీ రుత్ భీ హసీ
ఆజ్ యె దిల్ బస్ మే నహీ ॥తుమ్‌భీ॥
రాస్ తే ఖామోష్ హై ధడ్‌కనే మద్‌హోష్ హై
పియే బిన్ ఆజ్ హమె చఢా హై నషా ॥యూతో॥
తుమ్ న అగర్ బోలోగే సనమ్ ॥2॥
మర్ తో నహీ జాయేఁగే హమ్
క్యా పరీ యా హూర్ హో
ఇత్‌నె క్యూ మజేరూర్ హో
మాన్ కితో దేఖో కభీ కిసీ కా కహాఁ ॥యూతో॥

ఈ పాట మన తెలుగువారికి బాగా పరిచయం ఉన్న పాట. ఇష్టమైన పాట కూడా. ఈ హిందీ పాట ట్యూన్‌ని తీసుకుని అతి తమాషాగా మారుస్తూ నాగేశ్వరరావు, జమున నటించిన 'ఇల్లరికం' సినిమాలో 'ఎక్కడి దొంగలు అక్కడనే గప్‌చిప్' అనే మలచారు సంగీత దర్శకుడు తాతినేని చలపతిరావు. ఇక హిందీ వెర్షన్ కొస్తే ఈ పాట చివరివరకు వింటే - ఈ 'తుమ్‌సా నహీ దేఖా' సినిమాలోనే ఉన్న 'జవానియా ఆయె మస్త్ మస్త్ జిందగీ' అనే పాట ట్యూన్‌ని కలుపుకుంటూ ముగించడాన్ని గమనించవచ్చు.

చిత్రం: జంగ్లీ (1961) రచన: శైలేంద్ర
సంగీతం: శంకర్-జైకిషన్ గానం: రఫీ

యాహూ (2) చాహేకోయీ ముఝె జంగ్లీ కహె
కెహనె దో జీ కెహతా రహె
హమ్ ప్యార్ కె తూఫానోఁ మె గిరే హై హమ్ క్యా కరే ॥చాహే॥
యాహూ (2)
మెరె సీనే మె భీ దిల్‌హై హై మేరే భీ కుచ్ అర్ మాఁ
ముఝె పత్థర్ తో న సమ్ ఝో
మైఁ హుఁ ఆఖిర్ ఎక్ ఇన్‌సాన్ ॥మెరె సీనే॥
రాహ్ మేరీ హోహీ జిస్ పె దునియా చలీ ॥రాహ్॥ ॥చాహే॥
యాహూ (2)
సర్ద్ ఆహే కెహ్ రహీ హై హై యే కైసీ భడ్‌కీ ఆగ్
సోతే సోతే జింద్‌గానీ ఘబ్‌రాకే ఉఠీ హై జాన్ ॥సర్ద్॥
మై యహాఁ సే వహాఁ జైసె యే ఆస్ మాఁ ॥మై॥ ॥చాహే॥
యాహూ (2)

షమ్మీకపూర్ స్పెషల్ క్రేజ్‌ని, ఇమేజ్‌ని తెచ్చి పెట్టిన పాట ఇది. ఈ పాట తెలుగునాట కూడా ఎంతో క్రేజు సృష్టించింది. ఈ పాట ఆధారంగా మనకు ఓ రెండు తెలుగు వెర్షన్‌లు కనిపిస్తాయి. అందులో ఒకటి - జగ్గయ్య, కృష్ణకుమారి నటించిన 'ఉయ్యాల జంపాల' సినిమాలో 'దాచిన దాగదు వలపు ఇక దాగుడు మూతలు వలదు' అయితే రెండోది ఎన్.టి.ఆర్. రాజశ్రీ నటించిన 'అగ్గిబరాట'లో 'మబ్బులు తొలగెనులే' అనేపాట. హిందీ వెర్షన్ పాటలో పాట రఫీది, యాహూ అన్న అరుపులు మాత్రం షమ్మీకపూర్‌వి.

చిత్రం: బ్రహ్మచారి(1967) రచన: హస్రత్‌జైపూరి
సంగీతం: శంకర్-జైకిషన్ గానం: రఫీ,సుమన్ కళ్యాణ్

అ : ఆజ్‌కల్ తేరెమేరె ప్యార్ కె చర్చే హర్ జబాన్ పర్
సబ్ కో మాలూమ్ హై అవుర్ సబ్‌కో ఖబర్ హో గయీ ॥ఆజ్ కల్॥
ఆ : అచ్ఛా
అ : ॥ఆజ్‌కల్॥
ఆ : తో క్యా.... ॥ఆజ్‌కల్॥
అ : హమ్ నెతొ ప్యార్ మేఁ ఐసా కామ్‌కర్ లియా
ప్యార్ కీ రాహ్ మేఁ అప్‌నా నామ్‌కర్ లియా ॥హమ్॥
ప్యార్ కీ రాహ్ మేఁ అప్‌నా నామ్‌కర్ లియా ॥ఆజ్‌కల్॥
ఆ : దో బదన్ ఏక్ దిన్ ఏక్ జాన్ హో గయే
మంజిలేఁ ఏక్ హుయీ హమ్‌సఫర్ బనే గయే ॥దో బదన్॥
మంజిలేఁ ఏక్ హుయీ హమ్‌సఫర్ బన్ గయే ॥ఆజ్‌కల్॥
అ : క్యూ భలా హమ్ డరే దిల్ కె మాలిక్ హై హమ్
హర్ జనమ్ మె తుఝె అప్ నా మానా సనమ్ ॥క్యూ॥
హర్ జనమ్ మె తుఝె అప్ నా మానా సనమ్ ॥ఆజ్‌కల్॥

తెలుగునాట బాగా పాపులర్ అయిన హిందీ గీతాల్లో ఇదొకటి. బ్యాగ్రౌండ్ మ్యూజిక్‌తో సహా తెలుగువారికి కంఠతా వచ్చు. ఈ పాటలోని పల్లవి ట్యూన్‌ని నిండుసంసారం (1968) సినిమాలో పద్మనాభం అభినయించిన 'మైడియర్ తులశమ్మక్కా లక్కీ ఛాన్సు కొట్టేశా మజాగా రేపోమాపో జ్యోతికి తాళి కట్టేస్తా' అనే పాట పల్లవికి యథాతథంగా మనవాళ్ళు వాడుకున్నారు. ఈ పాటలోని అర్థం చూసుకుంటే 'రైతుకుటుంబం' సినిమాలో ఘంటసాల, యల్ఆర్ఈశ్వరి పాడగా అక్కినేని, కాంచన అభినయించిన టి.చలపతిరావు - సినారె గీతం 'ఊరంతా అనుకుంటున్నారు' పాట గుర్తొస్తుంది.

## తండ్రి పేరు ఉపయోగించని ఆత్మాభిమాని

# ఎన్రిక్ ఇగ్లెసియాస్

**అతని తండ్రి ఒక ఫేమస్ సింగర్. చెట్టుపేరు కాయలమ్ముకోవడం సర్వసహజమైన ఈ రోజుల్లో అతను తండ్రి పేరు ఉపయోగించుకోలేదు. అంతేకాదు, ఇంటిపేరు చెప్పినా ఊహించేస్తారన్న భయంతో అదీ ఉపయోగించలేదు. అయినా 1995 లో కెరియర్ ప్రారంభించిన ఎన్రిక్ ఒక ఫినామినన్ అయిపోయాడు. స్వయంకృషికి ఇంతకంటె మంచి ఉదాహరణ దొరకటం కష్టం!**



లాటిన్ మ్యూజిక్‌కు అతను ఈనాటి ఐకాన్!

23 దేశాలలో 15 మిలియన్ల క్యాసెట్లు అమ్మకం

- 14 నంబర్‌వన్ సింగిల్స్

- 120 ప్లాటినం రికార్డులు

- 30 ఇంటర్నేషనల్ ఎవార్డులు

- 26 దేశాలలో టీవీలలో 230 టీవీ ప్రోగ్రాములు

ఎన్రిక్ ఇగ్లెసియాస్ ఒక ఫినామినన్ అంటే ఆశ్చర్యమేముంది?

ఎన్‌రిక్ తండ్రి జూలియో ఇగ్లెసియాస్ ప్రఖ్యాత స్పానిష్ గాయకుడు. దేశదేశాలు తిరిగుతూ పాటకచ్చేరీలు ఇవ్వడంలో ఉన్న ఆసక్తి భార్యాబిడ్డలను పట్టించుకోవడంలో లేదు. అతని తల్లి ఇసాబెల్ ప్రేస్లర్ కూడా తక్కువది కాదు. డబ్బుంది. సోషల్‌గా తిరగడంలో ఉన్న శ్రద్ధ పిలలపై కనబరచలేదు.

భార్యాభర్తలకు పొసగక ఎన్‌రిక్ పుట్టిన నాలుగేళ్లకు, అంటే 1979లో విడిపోయారు. అది ఎరిక్ హృదయంపై చెరగని ముద్ర వేసింది. ఈనాడు అతను తన అయిదుగురు పిల్లలతోనూ చాలా ఆత్మీయంగా ఉంటాడు. దేవుడిపై, మతంపై ప్రగాఢమైన నమ్మకం.

తన ఎనిమిదవయేట ఎన్రిక్ మాడ్రిడ్ (స్పెయిన్) విడిచిపెట్టి మియామీలోని తండ్రి వద్దకు చేరాడు. తల్లి దగ్గరలేదు. తండ్రికి తీరికలేదు. ఎప్పుడూ టూర్లే! అందువల్ల తండ్రి నియమించిన ఆయా ఎల్విరావద్ద పెరిగాడు. క్రమంగా అతను



తండ్రికి, తండ్రి సంగీతానికి దూరంగా జరిగాడు. 15వయేట తండ్రికి తెలియకుండా చిన్న చిన్న హవానారెస్టారెంట్లలో పాటలు రాసిపాటలు రాయడం, పాడడంపాటలు రాయడం, పాడేవాడు. కానీ అవి అతనికే నచ్చేవి కావు.

రెండేళ్లు అలాగ తంటాలు పడ్డాక, తన తండ్రికి 9 సంవత్సరాల పాటు మేనేజరుగా పనిచేసిన మార్టినెజ్‌ను ఆశ్రయించాడు. మార్టినెజ్ అతని పాటలు విన్నాక మెస్మరైజ్ అయిపోయాడు. ఇంగ్లీషు పాటల సంగతి తర్వాత చూసుకుందాం, ముందు స్పానిష్ ఆల్బమ్స్ చేద్దాం అన్నాడు. 'సీ తూ తే వాస్' (ఇఫ్ యూ లీవ్), 'ఎనామొరాడో పోర్ ప్రిమెరా వెక్స్' (ఇన్ లవ్ ఫర్ ది ఫస్ట్ టైమ్) పాటలు పాడించి హిట్ చేయించాడు. మానేజరుగా మార్కెటింగు మొదలుపెట్టగానే అతని కంటికి ముందుగా ఆనింది - 'ఇగ్లెసియాస్' ఇంటిపేరు. మంగేష్కర్ అనే పేరుతో ఎవరైనా వచ్చి పాడబోతే విదిలించకుండా ఎలావుందో కాస్సేపు వింటాం

**తనను పెంచిన ఆయా ఎల్విరా పై ప్రేమతో తన తొలి స్పానిష్ ఆల్బమ్ ఆమెకే అంకితమిచ్చాడు! ఆమె పెంపకం మహిమ ఏమో కానీ దుర్వ్యసనాల పాలుగాని పాప్ సింగర్లు అరుదైన ఈ కాలంలో ఎన్రిక్ సిగరెట్టు, మాదకద్రవ్యాలకు దూరంగా ఉండడమే కాక, వాటి గురించి నేటి యువతను హెచ్చరించేందుకు ఉద్యమం చేపడుతానంటున్నాడు.**

కదా అదే అతని స్ట్రాటజీ!

కానీ ఎన్‌రిక్ నిలువెత్తు ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం ఉన్న వ్యక్తి. 'మా నాన్న పేరే కాదు, మా నాన్న స్నేహితుల పేర్లు కూడా ఉపయోగించవద్దు. కావాలంటే నీ పేరు పెట్టి మార్కెట్ చేయి.' అన్నాడు. ముందు తిట్టుకున్నా మార్టినెజ్ లొంగాడు. 'ఇతను ఎన్‌రిక్ మార్టినెజ్, కొలంబియా నుండి వచ్చాడు. కొత్త గాయకుడు. విని చూడండి.' అని అనేక మ్యూజిక్ కంపెనీలతో ఆడిషన్స్ ఏర్పాటు చేశాడు. కెనడా వెళ్లి కూడా ప్రయత్నించవలసివచ్చింది. దురదృష్టవశాత్తూ ఎవ్వరూ అతనికి ఛాన్సు ఇస్తాననలేదు. అయినా ఎన్‌రిక్ లొంగలేదు.

ఎట్టకేలకు ఓపిక ఫలించింది. ఓ లాస్ ఏంజిలిస్ కంపెనీ అతన్ని సైన్ చేసింది. వాళ్లు అతన్ని ఎన్‌రిక్ గానే పేర్కొన్నా క్రమక్రమంగా అతను జూలియో ఇగ్లెసియాస్ కొడుకు అన్న విషయం బయటకు పొక్కింది. ఇక అతనికి ఇబ్బందికర పరిస్థితులు ఏర్పడ్డాయి. టెలివిజన్ కార్యక్రమాలలో ఒక్కోప్పుడు అతని పేరుతో గాక ఫలానా వారి అబ్బాయి అని పరిచయం చేసేవారు. అలా చేసిన సందర్భాలలో ఎన్‌రిక్ వెంటనే బయటకు వచ్చేసేవాడు. దీనివల్ల తండ్రీకొడుకుల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందన్న ప్రచారం జరిగింది. "అదేం కాదు, మా మధ్య అభిప్రాయభేదాలు ఉన్నమాట వాస్తవమే కానీ, తండ్రీకొడుకుల బంధం కూడా ఉంది. ఆయన పేరు చెప్పుకుని పొట్టపోసుకోవడం నాకిష్టం లేదంతే!" అని వివరించాడు ఎన్‌రిక్ ఓ సారి.

'బైలామోస్', 'బీ విత్ యూ', 'కుడ్ ఐ హేవ్ దిస్ కిస్ ఫరెవర్' (విట్నీ హూస్టన్‌తో) వంటి పాటలున్న రిథమ్ డివైన్ ఆల్బమ్ అతన్ని యూత్ కి బాగా దగ్గర చేసింది.

ఇప్పుడతను తండ్రి కంటె ఎక్కువ పాప్యులర్! బహుశా జూలియోను ఎన్‌రిక్ తండ్రి అంటారేమో! తండ్రీ కొడుకూ - ఇద్దరూ గర్వించదగిన క్షణం అది!!

- కమ్యూనికేటర్ ఫీచర్స్

రచన: భాస్కరభట్ల రవికుమార్ **1** గానం : జిల్లా వెంకటనారాయణ

ప: రూపాయ్... రూపాయ్... రూపాయ్...
రూపాయి కాసులోనె ఉన్నదీ తమాషా
ఈపూటా వున్నచోటా వుండదూ హమేషా
చ: దైవాన్ని చూడాలంటే గుడిదాకా వద్దన్నా
పైసామే పరమాత్మ పవలించీ వున్నాడన్నా
జౌనన్నా... జౌనన్నా... ఇది నిజమన్నా
చ: కలికాలం కాసుల చుట్టూ పరిగెడుతూ వుందన్నా
తిరకాసులెన్ని వున్నా మన బాసు కాసేనన్నా
జౌనన్నా జౌనన్నా ఇది నిజమన్నా
చ: సొమ్ముంటే చాలునన్నా తోడు ఎవరూ లేకున్నా
పోయే ప్రాణాలనైనా ఆపేది డబ్బేనన్నా
జౌనన్నా జౌనన్నా ఇది నిజమన్నా

రచన: భాస్కరభట్ల రవికుమార్ **2** గానం : రవివర్మ, సుధ

అ: ఏమయ్యిందో ఏమయ్యిందో ఈవేళా
ఏమయ్యిందో ఏమయ్యిందో నాలోనా
ఆ: కలలోకి వస్తావే కబురేదో తెస్తావే నేస్తమా
ఎదలోకి వస్తూనే ఏదేదో చేస్తావే ప్రియతమా
అ: నువ్వలా నవ్వితే కాలమే ఆగదా
నిన్నలా మొన్నలా లేనే లేదుగా
ఆ: ఎందుకో ఏమిటో ఇప్పుడే చెప్పవా
వెచ్చనీ ఊపిరై నన్నే చేరవా
అ: ఊహల్లో నీవే ఊసుల్లో నీవే కన్నుల్లో నీవే కలవైనావే
ఆ: నీడగా తోడుగా నీవే వుంటే చాలుగా
చ/ఆ: ప్రేమనే భావనే నన్నిలా చేసెనా
ప్రాణమే పోయినా ప్రేమే ఆగునా
అ: గుండెలో దీపమై చేరుకో నన్నిలా
ఊరికే వుండకా రావే వెన్నెలా
ఆ: అడుగడుగూ నీవే అణువణువూ నీవే మనసంతా నీవే మనసైనావే
అ: నీవనీ నేననీ తేడాలింక లేవుగా

రచన: భాస్కరభట్ల రవికుమార్ **3** గానం : రవివర్మ, మతిన్

ప: ఓస్సామరీ ఓస్సామరీ పైసాలె మనిషి ఊపిరీ
అంతేమరీ వుంటేసిరీ జేజేలు కొట్టరామరీ
క్యాబరేకి క్యాడ్‌బరీకి సొమ్ములేమరీ
ఎంతపెద్ద ప్రాబ్లమైన డబ్బుతో సరీ
ఆకాశవీధిలోని చందమామనీ
భూమ్మీది కొక్కసారి దించదామనీ
డబ్బులేని వాడికింక దర్జమేమిటీ... లోకమే చీకటీ...
చ: జేబులో వుండగా చిల్లరే చెయ్యదా అల్లరీ
కోరికే కోరితే నేరుగా తీర్చనా అన్నదీ
కాసులుంటె ఆడవచ్చు రేసులైనా
క్యాషువుంటె మార్చవచ్చు ఫేటునైనా
పర్సులేని పర్సనాల్టి వేస్టుకాదా



ఆ: ఉంటానులే మీతో పాటుగా
అ: చెప్పుకుంటె తగ్గుతుంది బాధా
మన స్నేహమెంతో చిత్రమే కాదా
ఆ: పంచుకుంటె హెచ్చుతుంది హాయి
ఇది భారతాన రాసివున్నదోయీ
అ: చీకటిలేని వేకువకోసం సాగాలి అందరం...
చ/అ: చిన్ని చిన్ని గుండెనేమో అల్లేసింది అల్లరీ
ఇంతలోనె ఎంత గారడీ
నచ్చావమ్మొ రాధికా నువ్వేవుంటె చాలికా
కన్నీరంటు రానే రాదికా
ఆ: కలిసివున్న తీరే వేరుగా
అ: కుందనాల బొమ్మలాగ నువ్వు
కొంటె కొంటెగా ఒక్కసారి నవ్వు
ఆ: మొగ్గలోనె దాగివుంది పువ్వు
నా సిగ్గుచాటు చేరుకుంది నవ్వు
అ: కలలే అలలై కథలే మొదలై పాడాలి స్వాగతం...

రచన: భాస్కరభట్ల రవికుమార్ **8** గానం : స్మిత, గీతా శ్రీనివాస్

ప/ఆ: ఓహోకన్నా ఆగరా... సూటిగ నన్నే చూడరా
చెంపలలోనా కెంపులు దాచీ నీకై తెచ్చా తీసుకో
తుమ్మెదలాగా ఝుమ్మని వాలీ నచ్చినవన్నీ దోచుకో
సుబ్బీ సువ్వాలా... ఓరయ్యో మువ్వాగోపాలా
ఒళ్లో ఉయ్యాలా... ఓ బాబూ ఊగాలివ్వాలా
చ/ఆ: జళ్లో పూలెట్టుకోని గుళ్లో బొట్టెట్టుకోని
వస్తే వయ్యారిభామ నెత్తుకోవా
ఉల్లీ పకోడిలాగ చిన్నీ చెగోడిలాగ
పిల్లే నీ దారికొస్తే పట్టుకోవా
అ: మిస్సిండియాలా ఫోజెందుకంటా
ఇన్నాళ్లు లేనీ మోజెందుకంటా
ఆ: చూసుకో ఒంపుసొంపులూ
అ: ఆపవే కుప్పిగంతులూ
ఆ: బాడీ హీటెక్కివుంది చూడూ
అ: బేబీ చన్నీళ్ల స్నాన మాడూ
ఆ: అలాగ ఈ వేడి చల్లారదే...
చ/ఆ: నువ్వే మెగాస్టార్ నువ్వే పవర్‌స్టార్
మార్చెయ్‌రా నా ఇంటిపేరూ
ఎంతో ఆశట్టుకోని ఇట్టా వచ్చానుగానీ
జల్దీ తీర్చెయ్‌రా ఒంటిపోరూ
అ: నీ స్పీడుకాస్తా తగ్గించుకోమ్మా
బజారులోనా బాగోదులేమ్మ
ఆ: చెప్పకోయ్ కుంటిసాకులూ
అ: వద్దులే ఒట్టి డాబులూ
ఆ: నేడే పొంగింది కన్నె ఈడూ
అ: గట్టే దాటెయ్యకుండ చూడూ
ఆ: ఈ జోరు ఆగాలి నీవల్లనే...



రచన: కులశేఖర్ **1** గానం: ఆర్.పి.పట్నాయక్, నిత్యసంతోషిణి

ప: అందాల ముద్దుల గుమ్మకు నేడే పెళ్లంట టటట టరడ
ఆకాశం పందిరి కింద భూమే పీటంట టటట టరడ
బాజా భజంత్రీలు పెళ్లికి మేళంట చిన్నా, పెద్ద తేడా లేక చిందెయ్యాలంట...(2)॥అందాల॥
చ/అ: పేరంటాలందరికి ఊరే విడిదంట పేకాటలాడే వారికి సరదా రోజంట కో: హహహ
కాఫీలు,టిఫినీలు కానీయాలంట హాపిగ రోజంతా గడిపేయాలంట కో: హహహ
ఆ: వీరాధి వీరుడంట వీధిచివరి కుర్రాడంట శూలాల మాదిరల్లె సీరియస్సు చూపులంట
అ: కారాలు మిరియాలు నూరేసేకోపమంట పోనీ చాన్సిస్తేను పోయింది ఏందంట...?
డైలాగ్: ఏంటిచ్చేది... కొత్తిమీర కట్ట...! ఆ:॥అందాల॥
ఆ1: ఆంధ్రాకే హోలుసేలు అందగాడంట పెయింట్ కొడితే షారుఖ్‌కన్నా గ్లామర్ బాయంట
ఆ2: పిల్లా పాపా అంతా భద్రం బీకేర్ ఫుల్లంట... జానుంచేకంగా వచ్చేశాడంట...
ఆ1: జీన్సుప్యాంటు, టీ షర్టేసిన జేమ్సుబాండంట
డాన్సేమో ఫాస్టుగేస్తే మోకాళ్ల జాక్సనంట
ఆ2: హెయిర్ స్టైల్లో అబ్బాయి అచ్చం హృతిక్‌రోషనంట
అమ్మాయిల వెంటపడటం అతనికి రోగమంట... ॥అందాల॥
చ/ఆ1: అయ్యో పాపం పాపలపాల పడ్డాడంట... కుయ్యోమొర్రో అన్నా ఎవరిక వింటారంట...
అ: తల్లీ దణ్ణం పెడతా నన్నిక వదిలెయ్ మంట మళ్లీ ఇటు వైపొస్తే మీమీదొట్టేనంట
తాళికట్టు వేళయ్యింది పంతులు గారెక్కడంట
పక్కవీధిలో పెళ్లుందంటే పరిగెత్తుకుపోయేరంట
ఛాల్లే వేళాకోళం ఓవరవుతుందంట
ఏమోయ్ మేళం కాస్త వాయించేయాలంట ॥అందాల॥

రచన: కీరవాణి **2**

ప: నవ్వే ముద్దు... నడకే ముద్దు మాటలు తడబడినప్పుడు...చిలిపి మహోత్సవ్
తికమక ముద్దు...గజిబిజి ముద్దు... మనసులోన తిరుగుతున్న...మంత్రం ముద్దు...
ఏ భాషలో నువ్వు తిట్టినా...ఏ శాపమో నువ్వు పెట్టినా
నే...పట్టు వదలని విక్రమార్కుడై నిను ప్రేమిస్తుంటే ముద్దుకి ముద్దు ॥నవ్వే ముద్దు॥
చ: నీ కోపతాపాల ముసుగులోని సత్యం... అది నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న పచ్చి నిజం...
నీ నీలి నయనాల ...ఎర్రబడ్డ వైనం...నీ బుగ్గలోని సిగ్గు ఎరుపు కాస్త అంటుకుంది నిజం...
అలా చూడకు...అలా నవ్వకు తప్పు తప్పని గొడవ చేయకు...
నా ప్రేమకే టెస్ట్ పెట్టినా...నే నెగ్గనని బెట్టు కట్టినా...
నువ్వు ఓడిపోవడం...నే చూడలేనుగా...
మరి నాతో పందెం నువు కాయొద్దు...! ॥నవ్వే ముద్దు॥
చ: దేవదాసు, రోమియోల ప్రేమ నాది కాదు... ఈ దేవిదాసుడైన నన్ను పిచ్చోడ్ని అనరాదు...
ఊరు...పేరు లేనివాడ్ని నేను అసలు కాను...తెగ ఊరించే...నీ పేరును జపం చేస్తు ఉన్నాను
వరంకోరను వలే వేయను వరించాలని ప్రెజర్ ఇవ్వను...
నీ కళ్లలో నన్ను చూడనీ...నీ గుండెలో నన్ను ఉండనీ...
అని చెప్పడానికి వీలుకాకనే...నే పెట్టా ముద్దు అంతేలెద్దు... ॥నవ్వేముద్దు॥

రచన: కులశేఖర్ **3** గానం: కీరవాణి,గోపికాపూర్ణిమా, గాడ్‌విన్

ప: స్టూడెంట్సు... స్టూడెంట్సు... తుమ్మెదా హీరో పవనంటే ఛస్తారు తుమ్మెదా
యూత్ యూతంటారు తుమ్మెదా... వీరి గాథలన్ని వినవె తుమ్మెదా...
స్టూడెంట్సు... స్టూడెంట్సు... తుమ్మెదా... హీరో పవనంటే ఛస్తారు తుమ్మెదా...ఔ
సునీల్ డైలాగ్సు తుమ్మెదా... ఆహా... చెవికోసుకుంటారు తుమ్మెదా...
చ/అ: మార్నింగ్ లేస్తారు తుమ్మెదా... వాకిట్లో కొస్తారు తుమ్మెదా...
వచ్చి పోయేవారిని తుమ్మెదా. పచ్చి కామెంట్లు చేస్తారు తుమ్మెదా
ట్యూషనంటారమ్మ తుమ్మెదా... పార్కుల్లో పడతారు తుమ్మెదా...



ఓంకారం... ఓంకారం... నీద్వారం
చ: రాముడు - కృష్ణుడు - పాండురంగడు అల్లా ఏసు గురునానక్‌లు (2)
అందరు నీవై అంతట కొలువై దేవుడు ఒకడే అన్నావు (2)
అయోధ్య ద్వారక పండరీపురం మక్కా నజరత్ గురుద్వారం (2)
క్షేత్రాలన్నీ ఒకటన్నావు! మానవులంతా ఒకటన్నావు!
శరణం శరణం ఏసూ శరణం శరణం శరణం అల్లా శరణం (2)
శరణం శరణం నానక్ శరణం శరణం శరణం సాయీ శరణం కో:॥శరణం శరణం ఏసూ॥
శరణం శరణం సాయీ శరణం శరణం శరణం సాయీ శరణం కో:॥శరణం శరణం॥
స్తోత్రం: అనంత కోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ -పరబ్రహ్మ
శ్రీ సచ్చిదానంద సమర్థ సద్గురు సాయినాథ్ మహారాజ్ కీ జై...

రచన: కులశేఖర్ **8** గానం: చిత్ర, కార్తీక్

ప/అ: బుజ్జాలు బుజ్జాలు బుజ్జి బుజ్జి బుజ్జాలు... నీ కాలికేయనా గజ్జెలు
ఆ: దిన్‌తాక్‌డ నాకడ నాకడ దిన్‌తాక్‌డ నాకడ తోం
అబ్బలు అబ్బలు అబ్బలబ్బలబ్బలూ... ఛీ... సిగ్గు బాబూ అబ్బలు...
అ: దిన్‌తాక్‌డ నాకడ నాకడ దిన్‌తాక్‌డ నాకడతోం...
అబ్బో ఎర్రంగ మారె పాల బుగ్గలూ... ఆ: అబ్బాయి చాలు ఇంక అపు గొప్పలు
అ: పారిపోతే... పాలపిత్త తాయిలాలు చేకోడిపెట్టి ఆడుదాము చెమ్మచెక్కలు ॥బుజ్జాలు॥
చ/అ: నీ... ఆల్చిప్పలాంటి కళ్లలో పిల్లా ముత్యమల్లె ఉండిపోనా...
ఆ: నీ... చందమామ లాంటి గుండెలో మామా జింకలాగ ఉండిపోనా...
అ: ఆ మల్లె తీగల్లే... అల్లేసుకోవమ్మా... అందాల సత్యభామా...
ఆ: ఆ... చల్ల గాలల్లే... గిల్లేసిపోకయ్యో... ఇస్తాగ కన్నె ప్రేమ
అ: లేత చేత్తో విస్తరేసి అందమంత బువ్వచేసి పెట్టవమ్మ గోరుముద్దలూ... ॥బుజ్జాలు॥
చ/ఆ: నీ సూదిలాంటి సూపు తాకితే మామా... కన్నె జిన్న కందిపోదా...
అ: నీ మాటగాని నేను నమ్మితే పిల్లో... తుర్రుమంటు పారిపోదా...
ఆ: ఆరేసుకోబోయి పారేసుకున్నాను ఎట్టాగ అయ్యొ రామా...
అ: నువ్వేసుకుంటేనూ ఆ రైకనవుతాను నా చెంత చేరుకోమ్మా...
ఆ: కాలికేస్తే వేలికేసి మాటతోటి మాయచేసి పెట్టకయ్య చిలిపి తిప్పలూ... ॥బుజ్జాలు॥

రచన: సీతారామశాస్త్రి **9** గానం: చిత్ర

ప: మనసా ఒట్టు మాటాడొద్దు పెదవి గడపదాటి నువ్వు బైట పడొద్దు
వెచ్చని ముద్దు వెతికా గుర్తు మంచు తెరలు తెరచి ఎపుడు చూపించొద్దు
అతనెంతగా ప్రేమ పంచినా... ఆ ప్రేమ ఏ వరాలిచ్చినా...
అవి పొందలేనని నీ మూగ బాధని కరిగించనివ్వవే కంచెల హద్దు... ॥మనసా ఒట్టు॥
చ: నీ కంటి చూపులోన ఒదిగిపోయి నేను... నూరేళ్ల తీపి స్వప్నంలా బతుకుతూనే ఉంటాను...
పడమటింటి పడకమీద మల్లెపూలు వేసి
ప్రతి సంధ్యలోన నీకోసం ఎదురుచూస్తు ఉంటాను
ఎలా చెప్పను... ఎలా చెప్పను మూడునాళ్ల నిజం నేనని
ఈ తీయని జ్ఞాపకాలని మరుజన్మకే పంచి ఇవ్వనీ...
ఆ రోజు కోసమే ప్రతిరోజు గడపనీ... క్షమించు నేస్తమా వద్దనవద్దు... ॥మనసా ఒట్టు॥
చ: వెంటాడకమ్మ ఎడారి ఎండమావిని... తను ఇవ్వలేని అమృతాన్ని నీకు అందిమ్మనీ...
కొలువుండకమ్మా... సమాధి నీడ చాటునీ...
చితిమంట చూసి కోవెలలో యజ్ఞవాటి అనుకుని
మంటలారని... గుండెజ్వాలనీ... వెంట తరమకు జంటకమ్మని
ఏ భాషలో నీకు చెప్పినా... ఏ భావమో మూగబోయినా
నువ్వు పట్టువదలని విక్రమార్కుడై నీ ప్రేమతో... నన్నే చంపేయద్దు... ॥మనసా ఒట్టు॥

కొండకి వెంట్రుక వెయ్యాలి సోదరా
పోయేది లేదురా వచ్చేదే నీదిరా
ఆడరా.. పాడరా.. తాగరా తూగరా
రంగంలోకీ దూకేయ్‌రా.. ఆరైనా... నూరైనా...
చ: గొడ్డలి ఎందుకు గోరుంటే
చదువే దండగ తెలివుంటే
దగ్గర దారులె మనకుంటే
హైవేలో ఎందుకు పరుగంటూ
ఎంజాయ్ చెయ్యని లైఫంతా బోర్‌రా
అందాలే చూడనీ కళ్లుండీ వేస్టురా
కాదురా.. లేదురా.. కానిదే లేదురా
పాపం పుణ్యం వదిలెయ్‌రా ఏమైనా.. ఏదైనా

రచన: భాస్కరభట్ల రవికుమార్ **6** గానం : బాలు, కౌసల్య

ప/అ: ప్రేమా నాకనులే తెరిచీ నీకై చూస్తున్నా
ప్రేమా నా మనసే పరిచీ స్వాగతమిస్తున్నా
ఆ: తొలితొలి చూపుల ప్రేమా.. తొలకరి వానలప్రేమా
అ: చరితగ మారిన ప్రేమా.. గెలిచే తీరును ప్రేమా
ఆ: ఒకసారి మొదలైతె విడిపోదు ప్రేమా
చ: కంటిపాపకూ కాంతిరేఖల కబురే ఈ ప్రేమా
గుండెలోపలా భోగిమంటలా గుబులే ఈ ప్రేమా
అ: గడపాలి నీధ్యాసలో బతకాలి నీప్రేమలో
నడపాలి నీదారిలో తడవాలి నీ ప్రేమజడిలో
ఆ: తోడుగా నీ నీడగా వుండనా ఓ ప్రేమికా
అందుకే నువ్వందుకో ప్రేమగా చెలికానుకా
అ: ఇన్నాళ్లు ఈ హాయి నే చూడలేదూ..
చ/అ: వాలుకన్నాలూ నేలచూపులూ అరెరే ఈ ప్రేమా
కొత్తకొత్తగా కొంటె ఆశలా చిగురే ఈ ప్రేమా
ఆ: నా మనసు మాగాణిలో విరిసింది ప్రేమేకదా
నా కాలి పారాణిలా మారింది ఈ ప్రేమ వరదా
అ: సూటిగా నినుచూడకా చూపులే తిరిగొచ్చెనా
ఇంతలో ఏమైనదో ఇంతగా సిగ్గేందుకో
ఆ: నీ ప్రేమ అందింది అదిచాలు నాకు..

రచన: భాస్కరభట్ల రవికుమార్ **7** గానం : విహాల్, శ్రీరంగంవేణు, మణిశాస్త్రి

ప/అ: ఒకరికి ఒకరై తోడుగవుంటే ఎంతటి ఆనందం
మదిలో మెదిలే వేదనలన్నీ చిటికెలొ మటుమాయం
వెన్నెలమ్మ రాకతో వేల ఆశలూ
కోయిలమ్మ పాటతో కోటి ఊసులూ
అంతా మీరంతా.. ఒకటైతే మనమంటా
ఆ: మాటా ఓ పాటా ఈ పూటా మీ నోటా
అ: నీతో చెలిమే మాకో వరమై పంచింది సంబరం..
చ/అ: నిన్నా మొన్నా లేదుగానీ మరీ ఇంత సందడీ
నువ్వొచ్చాక ఎన్ని వింతలో..
తళతళ తారకా వచ్చేసింది నేరుగా
ఎడారిలో మాకే నీడగా



క్యాష్‌కార్డ్ క్రెడిట్‌కార్డ్ సొమ్ములేగా
వీసాలు పొందవచ్చు మీసాలు తిప్పవచ్చు విత్తముంటే
డేలింగ్ చూపవచ్చు డేటింగ్ చెయ్యవచ్చు
దేశాన్ని ఏలవచ్చు నక్కతోక తొక్కితే
చ: చక్రమే తిప్పదా చిత్రమే చూపదా లచ్చిమీ
శత్రువే మిత్రుడై ఛత్రమే పట్టడా చెప్పమీ
కోటి విద్యలెందుకంట కాసుకేగా
కాసులుంటె ఎవ్వడైన దాసుడేగా
డబ్బులున్న అల్లుడంటె అత్తవారూ
పెళ్లిలోన ఇచ్చుకోర కొత్తకారూ
పైపైకి ఎదగవచ్చు ఫ్లైటెక్కి తిరగవచ్చు పైకముంటే
లండన్లో లంచ్‌చేసి పారిస్‌లో పాన్‌వేసి
జల్సాలు చెయ్యవచ్చు లక్ష్మినీకు మొక్కితే..

రచన: భాస్కరభట్ల రవికుమార్ **4** గానం : ఉదిత్, కౌసల్య

ప/అ: కొత్కొత్కోమలీ కలవరమా గుండెల్లో మరీ కలకలమా
ఆ: అయ్యోపోకిరీ కనికరమా అదో మాదిరీ చలి జ్వరమా
అ: థిల్లానా.. తపనలు గిల్లేనా
ఆ: కలలోనా.. కవితలు అల్లేనా
అ: మందారాలకే మరదలివే వయ్యారాలకే ఒరవడివే
ఆ: అయ్యయ్యో అమ్మయ్యో చెలి మది మురిసినదే..
చ/ఆ: అన్నట్టునీలో ఏముందో హఠాత్తు ప్రణయం పుట్టిందీ
అ: ఉన్నట్టు వుండీ ఏమైందో నాక్కూడ ఏదో అయ్యిందీ
ఆ: నా కోలకళ్లు ఈ చీరగళ్లు నచ్చాయా అబ్బాయీ
చూపుల్లో ముళ్లు గుచ్చాయి ఒళ్లు చూస్తావ ఓసారీ
అ: చింత చిగురులో పులుపా..
చెలి కోరుకున్నదీ పిలుపా
గుమ్మపాలలో తెలుపా..
మదిలోని మాటనే తెలిపా.. తెలిపా..
చ/ఆ: గమ్మత్తుగుందీ ఈ వేళా నన్నెత్తుకోరా గోపాలా
అ: కొంగొత్తగుందీ ఈ బాలా చెయ్యెత్తి జేజే కొట్టేలా
ఆ: నా వెంట నువ్వే వున్నావు అంటే ఎంతో సంతోషమే
నీ గుండెలోనా చోటున్నదంటే కాదా నాకోసమే
అ: స్వాతి వానలో చినుకా.. తొలిప్రేమ వాకిటా తళుకా
తీయగున్నదీ చెరుకా.. తెరతీయమన్నదీ చిలకా.. చిలకా..

రచన: భాస్కరభట్ల రవికుమార్ **5** గానం : చక్రి

ప: డోంట్‌వర్రీ బీహేపీ డోంట్‌వర్రీ
ఓంహరీ ఎంజాయ్ చెయ్‌మరీ
చేసెయ్ ఏదో రాబరీ
తింటూ బతికెయ్ స్ట్రాబెరీ
ఓల్డేజీ వచ్చెయ్యదా కొన్నాళ్లుపోతే
ఓల్డేజీ డానేగా టీనేజీపోతే
ఈలోగా తాడోపేడో తేల్చెయ్‌రా
చ: చొక్కాలె చించుకు పనిచేస్తే వచ్చేదీ ఏముందీ చెమటేగా
అరచేతిలోపల వైకుంఠం చూపించీ పెట్టెయ్యి శఠగోపం



నెచ్చెలి చేదోయి పచ్చగ బతకనీయి సాయీ
నిత్యం నువు కొలువుండే ఆ మది ఆమెది కాదోయీ.. అది నీ ద్వారకామాయీ..
నిట్ట నిలువునా కోవెల కూలితే నష్టం నీదోయీ.. నీకే నిలువ నీడపోయి..
ప్రేమను పంచే ప్రియనేస్తం, ప్రేమను పెంచె సుమశాస్త్రం..
ప్రేమను మించిన దైవం లేదను నీ సూక్తికి భాష్యం
ఛలించని భక్తి ఉందని పరీక్షించేది నేనని తెలిస్తే చింత లేదని తరించే దారదేనని
నువ్వే అన్నావని.. అంతా అంటే విని
ఆలనా.. పాలనా.. అన్నీ నీవని విన్నవించనీ చేదుకోవోయీ సాయీ.. (2)

రచన: వడ్డేపల్లి కృష్ణ **6** గానం: బాలసుబ్రహ్మణ్యం, కీరవాణి

ఆ: కకకాకికాకో కకకాకికాకో ॥2॥
అ: రొట్టె కావాలంటే పిండి దంచాలి చెట్టు కావాలంటే మొక్క పెంచాలి
ప్రేమ పుట్టాలంటే మరి ఏం చేయాలో..
కో: కక కాకి కాకో.. కక కాకి కాకో.. కక కాకి కాకో..
ఆ: చీర నేయాలంటే దారం ఉండాలి చేపపట్టాలంటే గాలం ఉండాలి
ప్రేమ పుట్టాలంటే మరి ఏం కా.వా.ళి..
కో: కక కాకి కాకో.. కక కాకి కాకో.. కక కాకి కాకో..
ఆ: అమృతరసం కావాలని కడలి చిలికినంటారు ఎపుడో సురలు రాక్షసులు
అ: చమురు నిధులు తియ్యాలని భువిని తొలిచేనంటారు తూ॥గో॥ప॥గో॥ జిల్లాలో
ఆ: మనిషి సుఖం కోసం డబ్బు పుట్టెను అన్నారు
అ: డబ్బు ఖర్చు కోసం జబ్బు పుట్టెను అన్నారు
ఆ: ప్రేమను పుట్టించాలంటే మరి ఏం చేయాలి మరి ఏం చేయాలి?
కో: కక కాకి కాకో.. ॥4॥ ఆ: కయి కచ కయి కలి ॥3॥ ద..ద..దమ్..దమ్..
అ: కళ్ళు కళ్ళు కలబడితే ప్రేమపుట్టెనంటారు అవునా? నిజమా హై రామా.. కో॥ హై రామా...
ఆ: రెండు మనసులు ఒకటైతే అదే ప్రేమ అంటారు అవునా? నిజమా? ప్రేమేనా?
అ: పెద్దవాళ్ళు మాత్రం ప్రేమ కాదని అన్నారు ఆ: చిన్నవాళ్ళు మాత్రం చరిత చూడమన్నారు
అ: ఉందో లేదో వాదనతో మరి ఏంచేయాలి అహో..ఏం చేయాలి..
కో: కక కాకి కాకో.. కక కాకి కాకో.. కక కాకి కాకో..

రచన: వడ్డేపల్లి కృష్ణ **7** గానం: బాలసుబ్రహ్మణ్యం, కీరవాణి

ప: దివినుండి దిగివచ్చిన దైవమానవ రూపం..
భువియందున వెలుగొందిన దివ్య మంగళనామం
సమతా మమతల సాకారం! పిలిచిన పలికే ఓంకారం!
ఓంకారం.. ఓంకారం.. ఓంకారం.. ॥దివినుండి॥
శ్లోకం: సదానింబ వృక్షస్య మూలాధివాసాత్.. సుధాస్రావిణం తిక్తమప్య ప్రియంతమ్
తరుం కల్ప వృక్షాధికం సాధయంతం.. నమా మీశ్వరం.. సద్గురుం సాయినాథం!
చ: చేదు నిజాలను విప్పిచెప్పగా... వేపచెట్టునే చేరావు..
ఊపిరి పోయిన బూడిద మిగులని... ఊదిని యిలలో పంచావు
చితికిన బతుకుల ఆదరించగా.. చిరిగిన దుస్తులె ధరియించావు
పాపాలన్ని పారద్రోలగా భిక్షరూపమున గ్రహియించావు
సమతా మమతల సాకారం పిలిచిన పలికే ఓంకారం
ఓంకారం... ఓంకారం... నీద్వారం
చ: భక్తిగ కొలిచిన కరుణిస్తానని ఆర్తిగ పిలిచిన పలుకుతానని
సమాధి అవుతూ తెలిపావు! బుజువులు ఎన్నో చూపావు!
సృష్టి స్థితి లయకర్తవు నీవై శ్రద్ధా సహన ప్రవక్తవు నీవై
సత్యం ధర్మం నేర్పావు! శాంతి స్థాపన చేశావు!
సమతా మమతల సాకారం పిలిచిన పలికే ఓంకారం



ఎగ్జాములంటారు తుమ్మెదా... సిన్మాలకెళ్తారు తుమ్మెదా...
పిజ్జాలు, బర్గర్లు తుమ్మెదా... వీళ్ల పంచ భక్ష్యాలమ్మ తుమ్మెదా... కో:॥స్టూడెంట్లు॥
హే ప్రెట్టీ గర్ల్ వుయ్ ఆల్ నో వాట్ యు డు ఏం
ఫ్రమ్ బెడ్ రూమ్ టు ది బస్టాప్ / వుయ్ విల్ డ్రీమ్
లైక్ ఎ ఫుల్ టైమ్ జాబ్.. యార్ / ఆల్ త్రూ ది డే.. అహ
చెకప్ ది గయ్స్.. యస్ / యు కమ్ ఆన్, ఫీల్ ఇట్ అల్‌రైట్
ఓ.. క్రేజీ, క్రేజీ.. బట్ నాట్ వెరీ లేజీ / నౌ యు ఫీల్ ది ఫ్లే దెన్..
అండ్ టేక్ ఇట్ టు ఫీల్ దెమ్
చ/ఆ: బస్టాపుల్లోన తుమ్మెదా... అహో జీటేసుకుంటారు తుమ్మెదా...
పబ్బుల కెళతారు తుమ్మెదా... నైటు క్లబ్బులకెళతారు తుమ్మెదా..
కాలేజీ కెళతారు తుమ్మెదా.. కలరింగు చూస్తారు తుమ్మెదా..
లవ్వు లవ్వంటారు తుమ్మెదా... వీళ్లు వెర్రెక్కి పోతారు తుమ్మెదా..
లవ్వే ఫెయిలైతే తుమ్మెదా... దేవదాసులైపోతారు తుమ్మెదా... ॥స్టూడెంట్లు॥
చ/అ: ఫ్రెండ్షిప్పు అంటేను తుమ్మెదా... వీళ్లు ప్రాణాలు ఇస్తారు తుమ్మెదా
తగువెట్టుకుంటేను తుమ్మెదా... అయ్యో.. ప్రాణాలు తీస్తారు తుమ్మెదా... ఆ: ॥ఫ్రెండ్షిప్పు॥
అ: స్వార్థమెరుగరమ్మ తుమ్మెదా.. వీరి త్యాగగుణము చూడు తుమ్మెదా
: అన్యాయమంటేను తుమ్మెదా... వీళ్లు కళ్లెర్రజేస్తారు తుమ్మెదా..
ఇ: దేశానికే వీళ్లు తుమ్మెదా... వెన్నుదన్ను కాదా మరి తుమ్మెదా... కో:॥స్టూడెంట్లు॥

రచన: కులశేఖర్ **4** గానం: కీరవాణి

ప్రియతమా.. ప్రియతమా..
చీకటిలోనైన వేకువలోనైన నిద్దురలోనైన మేలుకువలోనైన
గిలిగింతకాల గాలికెరటం పిలిస్తే పలుకుతా పిలిస్తే పలుకుతా
పిలిస్తే పలుకుతా..హే..హే..హై... మనసే బరువైన మమతే కరువైనా
కలతలో జడిలోన కష్టాలు ఎదురైనా.. నీ మరువం కోసం వాయువీనం.. పిలిస్తే పలుకుతా..
పిలిస్తే పలుకుతా పిలిస్తే పలుకుతా.. ప్రియతమా.. ప్రియతమా.. ప్రియతమా.. ప్రియతమా..

రచన: సీతారామశాస్త్రి **5** గానం: బాలసుబ్రహ్మణ్యం

ప: పిలిస్తే పలుకుతానని.. పిలిస్తే పలుకుతానని.. పిలిస్తే పలుకుతానని
పలుమార్లు ఇదేమాటని నువ్వే అన్నావని
అంతా అంటే విని.. ఆశగా, ఆర్తిగా ఆశ్రయించాను
ఆదుకోమని సాయీ.. చేదుకోవోయి సాయీ.. చేదుకోవోయీ
ఆలకించననక బాబా.. ఆదరించు దయగా.. బాబా.. బాబా.. షిర్డీ సాయిబాబా..
చ: నమ్మిన వారినిసైతం వదలక నడిపిన నీ చేయి నాకూ అందించవా సాయి..
నవ్వినవారికి సైతం వరములు కురిపించవోయి నాపై అలకెందుకు సాయీ..
నిన్నదాత.. నా కన్నులు మూసిన, అహం అలసిపోయి
కన్నీట కలిగిపోయి నిన్నుగాక, ఇంకెవరిని వేడను..
అంటున్నది సాయి.. పాదాలు కడగనీయి..
ఏమరు పాటున ఉన్నావా..? నా మొర వినలేకున్నావా...
నా పొరపాటును మన్నించక నువ్వు లేవోమో అనిపిస్తావా...
తలొంచే తలపు చాలని, క్షణంలో కరుగుతానని
జయిస్తే మాయ ప్రశ్నని, జవాబై దొరుకుతానని
నువ్వే అన్నావని.. బాబా.. అంతా అంటే విని
గుండెలో నిండుగా ఆ అభయ ముద్రనే నింపుకున్నాను
సాయీ.. చేదుకోవోయి.. (2)
చ: నీ చిరునవ్వుల శాంతికి తానే రూపమైన దోయీ..
ఈ దీపాన్ని కాపుకాయి పరులకోసమే నిను ప్రార్థించే

వింధ్యాల ఫణిశేఖర్‌రెడ్డి
సమర్పించు
సత్యం ఎంటర్‌టైన్‌మెంట్

# ధనలక్ష్మీ... ఐ లవ్ యూ!

బి. సత్యనారాయణ చక్రి శివనాగేశ్వరరావు

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.


శివనాగేశ్వరరావు


చక్రి


భాస్కరభట్ల రవికుమార్


బి. సత్యనారాయణ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : సిద్ధిక్ లాల్ |
| మాటలు | : రవికొలికపూడి |
| పాటలు | : భాస్కరభట్ల రవికుమార్ |
| సినిమాటోగ్రఫీ | : రాజేంద్రప్రసాద్.కె |
| ఎడిటర్ | : శంకర్ |
| ఆర్ట్ డైరెక్టర్ | : రమణ |
| నృత్యాలు | : స్వర్ణ, శంకర్, కృష్ణారెడ్డి, రమేష్ |
| ఫైట్స్ | : హార్స్‌మెన్ బాబు |
| స్టిల్స్ | : ఇ.వి.వి. గిరి |
| కాస్ట్యూమ్స్ | : శ్రీను |
| మేకప్ | : వెంకటేశ్వర్రావ్ |
| పి.ఆర్.ఓ. | : వేణుగోపాల్ |
| కో డైరెక్టర్ | : సూర్యరాజా పేపకాయల |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : వేణు |
| ప్రొడక్షన్ మేనేజర్ | : మూర్తి.జి |
| సమర్పణ | : వింధ్యాల ఫణిశేఖర్ రెడ్డి |
| సంగీతం | : చక్రి |
| నిర్మాత | : బి. సత్యనారాయణ |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : శివనాగేశ్వరరావు |

## తారాగణం

ఆదిత్య, అంకిత, అల్లరి నరేష్, సోనిరాజ్, నరేష్, రాధాదేవి,
తనికెళ్ల భరణి, ఆలపాటి లక్ష్మి,
ధర్మవరపు సుబ్రహ్మణ్యం, బేబి నిక్షిప్త, బాలయ్య, శోభారాణి,
ఆహుతి ప్రసాద్, దీపిక,
బెవర్లీ, ఫణి, ఆనంద్ సూర్య, బాపనయ్యబాబు,
లక్ష్మణ్ రావ్, సుమన్ సెట్టి



టి.యస్.విజయచందర్
యస్. చిట్టిబాబు
సమర్పించు

రాధాచిత్ర

# పిలిస్తే పలుకుతా...

*A Saga of Divine Love*

సజ్జల శ్రీనివాస్ కోడి రామకృష్ణ ఎం.ఎం. కీరవాణి

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.


ఎం.ఎం. కీరవాణి


ఎం.ఎం. కీరవాణి


సీతారామశాస్త్రి


కులశేఖర్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : విజయ్‌చందర్ |
| డైలాగ్స్ | : కృష్ణేశ్వరరావు వై.ఎస్. |
| పాటలు | : సిరివెన్నెల, కులశేఖర్, డా॥వడ్డేపల్లికృష్ణ |
| సంగీతం | : ఎం.ఎం.కీరవాణి |
| కెమెరా | : విజయ్, సి.కుమార్ |
| ఎడిటింగ్ | : ఉమా శంకర్‌బాబు |
| ఆర్ట్ | : దిలీప్‌సింగ్ |
| మేకప్ | : కుమార్ |
| కాస్ట్యూమ్స్ | : మస్తాన్ |
| స్టిల్స్ | : వెంకటేష్ |
| ప్రొ॥కంట్రోలర్స్ | : స్వామి, మురళి |
| ప్రొ॥ఎగ్జిక్యూటివ్ | :బాలు |
| పి.ఆర్.ఓ. | : వేణుగోపాల్ |
| సమర్పణ | : విజయ్‌చందర్, సజ్జల చిట్టిబాబు |
| నిర్మాత | : సజ్జల శ్రీనివాస్ |
| దర్శకత్వం | : కోడిరామకృష్ణ |

## తారాగణం

ఆకాష్, షమిత
విజయ్‌చందర్, చంద్రమోహన్, సునీల్,
ఏవీయస్, ఎం.ఎస్.నారాయణ,
ఎల్.బి.శ్రీరాం, ధర్మవరపు సుబ్రహ్మణ్యం,
నవీన్, గౌతంరాజు, రాంగోపాల్, స్వప్న,
సుదీప, సన, హేమ, సరస్వతమ్మ,
విజయలక్ష్మి



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : సుర్ (2002) |
| సంగీతం | : ఎమ్.ఎమ్.కీరవాణి |
| రచన | : నిదా ఫాజ్లీ |
| గానం | : లక్కీఅలీ, సునిధి చౌహాన్ |
| అభినయం | : లక్కీఅలీ, గౌరీ కార్నిక్ తదితరులు |



## ఆభీ జా... ఆభీ జా...



అ: ఆ భీ జా, ఆ భీ జా
అయె సుబహ్, ఆ భీ జా
రాత్ కో కర్ విదా
దిల్‌రుబా ఆ భీ జా ॥ఆ భీ జా॥

చ/అ: మేరే, మేరే దిల్ కే పాగల్‌పన్ కీ ఔర్ సీమా క్యాహై
యూఁ తో తూహై మేరీ ఛాయా, తుఝ్ మేఁ ఔర్ తేరా క్యాహై
మై హూఁ గగన్, తూ హై జమీఁ
అధూరీ సీ మేరే బినా ॥ఆ భీ జా॥

చ/ఆ: దేఖూఁ చాహే జిస్‌కో కుఛ్ కుఛ్ తుఝ్‌సా దిఖ్‌తా క్యోఁ హై
జానూఁ, జానూఁ నా మైఁ తేరా మేరా రిష్తా క్యాహై
కైసే కహూఁ కిత్‌నా బేచైన్
దిల్ మేరా తేరే బినా ॥ఆ భీ జా॥

దక్షిణాది నుంచి హిందీ చిత్రరంగానికి పరిచయమైన సంగీతదర్శకులలో ఎ.ఆర్. రెహమాన్ తర్వాత ప్రముఖంగా చెప్పుకోవాల్సింది కీరవాణినే. హిందీలో ఆయన ఎమ్.ఎమ్.క్రీమ్ పేరుతో సంగీతం అందిస్తారు. ఆయన సంగీతం అందించిన హిందీ చిత్రాలలో ముఖ్యమైనవి క్రిమినల్, ఇస్‌రాత్‌కే సుబహ్ నహీఁ, జఖ్మ్. ఈ చిత్రాలకు కీరవాణి అందించిన సంగీతాన్ని విమర్శకులు ముక్తకంఠంతో కొనియాడారు.

గత మేలో కీరవాణి తాజా చిత్రం 'సుర్' ఆడియో విడుదలయింది. కొద్దిరోజుల్లోనే సేల్స్‌లో అగ్రచిత్రాల ఆడియోల సరసన నిలిచింది. ఈ విజయంలో చిత్ర కథానాయకుడు, ముఖ్య గాయకుడు లక్కీ అలీ పాత్రను మనం విస్మరించలేకపోయినా కీరవాణి అందించిన సంగీతం అటువంటిది.

హిందీ కమెడియన్ మెహమూద్ కొడుకైన లక్కీఅలీ ఎన్నో వృత్తులు ప్రయత్నించి చివరికి ఇండీపాప్ సంగీతకారుడిగా స్థిరపడ్డారు. తన తొలి ఆల్బమ్ 'సునో' ద్వారా సంచలనం సృష్టించారు. అందులోని 'ఓ సనమ్' పాట ఎంతో పాపులర్ అయింది. ఆ ఆల్బమ్ ఆరు లక్షల కాపీలు అమ్ముడు పోవడమే కాకుండా లక్కీఅలీకి ఎన్నో అవార్డులు తెచ్చిపెట్టింది. ఆ తర్వాత ఆయన 'సిఫర్', 'అక్స్' అనే ఆల్బమ్స్ కూడా రూపొందించారు. త్వరలో ఆయన 'ఇక్సోయ్' అనే కొత్త ఆల్బమ్‌ని విడుదల చేయనున్నారు. 2000లో 'కహోనా ప్యార్ హై' చిత్రంలో 'ఇక్ పల్ కా జీనా', 'న తుమ్ జానో న హమ్' పాటల ద్వారా నేపథ్య గాయకుడిగా మరో సంచలనం సృష్టించారు. 'ఇక్ పల్ కా జీనా' పాటకు ఫిలింఫేర్ అవార్డు కూడా అందుకున్నారు.



సంగీతంలో ఇంత లబ్ధప్రతిష్టుడైనా లక్కీఅలీ 'సుర్' చిత్రానికి సంగీతం దర్శకత్వం ఎందుకు చేయలేదని అడిగితే 'ఎమ్.ఎమ్.క్రీమ్ ఈ చిత్రానికి సంగీతం చేసినట్టు నేనైతే చేయలేకపోయేవాడిని' అని చెప్పారు.

'దుష్మన్', 'సంఘర్ష్', 'యే జిందగీ కా సఫర్' వంటి మహిళా ప్రధాన చిత్రాలకు దర్శకత్వం వహించిన తనూజచంద్ర 'సుర్'కి దర్శకత్వం వహించారు. ఈ చిత్రంలో హీరో పాత్రను లక్కీఅలీ మాత్రమే పోషించగలరని ఆయన్ని ఒప్పించి చక్కని నటన రాబట్టుకున్నారు. టి.వి. సీరియల్స్‌లో నటించిన గౌరీకార్నిక్ హీరోయిన్‌గా నటించింది.



లక్కీఅలీ గతంలో 'హమారే తుమ్హారే', 'త్రికాల్' చిత్రాలలో నటించినా హీరోగా ఆయన నటించిన తొలి చిత్రం 'సుర్'. 1985లో శ్యామ్ బెనెగల్ రూపొందించిన 'త్రికాల్' తర్వాత ఆయన తదుపరి చిత్రం కూడా ఇదే. ఇది సంగీత ప్రధాన చిత్రం. ఇందులో లక్కీఅలీ విక్రమాదిత్య సింగ్ అనే సక్సెస్‌ఫుల్ మ్యూజిషియన్ పాత్ర పోషించారు. తన ప్రతిభకు తగిన వారసుణ్ని వెతికి తన సంగీతాన్ని వారసత్వంగా అందించాలని అనుకుంటాడు. ఒక చర్చ్‌లో క్వాయిర్ సింగర్ అయిన టీనా పాట విని ఆమే తన వారసురాలవటానికి తగిన వ్యక్తి అని గుర్తించి ఆమెకు తన మ్యూజిక్ స్కూల్‌లో శిక్షణ ఇవ్వటం ప్రారంభిస్తాడు. గుండె లోతుల్లోంచి వచ్చి ఇతరుల గుండెల్ని తాకేదే మంచి సంగీతం అని ఆమెకు తెలియజెప్తాడు. అతని ప్రేరణతో ఆమె అద్భుతమైన సంగీతాన్ని సృష్టించడం ప్రారంభిస్తుంది. అందరూ ఆమెను పొగడటంతో అతను అసూయ పడతాడు. ఆమె ట్యూన్‌ని ఒకదాన్ని కాపీ చేసి తన ట్యూన్‌గా చెలామణి చేస్తాడు. దానితో మనసు గాయపడి అతని ద్వేషాన్ని భరించలేక ఆమె సంగీతాన్ని వదులుకుంటుంది. తర్వాత తన తప్పు తెలుసుకున్న విక్రమాదిత్య అన్నీ వదిలి ఆమెను ఒప్పించి ఒక సంగీత కళాకారిణిగా తీర్చిదిద్దుతాడు.

ఏన్టోనియో సెలియేరీ అనే పండితుడి అసూయకు మొజార్ట్ వంటి గొప్ప కళాకారుడు కూడా మరుగునపడి అజ్ఞాతంగా జీవితం ముగించాడు. కళాకారులు ఎంత సున్నిత హృదయులో, అసూయ ఎంతటివారినైనా ఎలా నాశనం చేస్తుందో తెలిసే చిత్రాలు ఇంతకు ముందు కూడా వచ్చాయి. 'అభిమాన్', 'స్వాతికిరణం' ఇందులో ముఖ్యమైనవి. ఇక్కడ గమనించదగ్గ విషయం ఒకటుంది. 'అభిమాన్'లో భర్త అసూయకు గురైన భార్య తనలో తాను కుమిలిపోయి తన కడుపులో వున్న బిడ్డను కోల్పోతుంది. 'స్వాతికిరణం'లో గురువు అసూయకు గురైన శిష్యుడు ఆత్మహత్య చేసుకుంటాడు. 'సుర్'లో శిష్యురాలు సంగీతాన్ని వదులుకుంటుంది. తాము ప్రేమించే వ్యక్తుల అసూయకు గురైనపుడు వారు తమను తాము నిందించుకుంటారు. తమకు ఇష్టమైన వ్యక్తులలో ద్వేషం కలగటం వారు భరించలేరు. తమ లోపంగా భావిస్తారు. తమ ప్రతిభే తమకు శత్రువైనపుడు వారు ఆ ప్రతిభను కూడా వదులుకుంటారు. దేవిడిచ్చిన కళను వదులుకోవటం కన్నా నరకం ఏముంటుంది? వారి ఆత్మ అనుభవించే వేదనకు పరిష్కారమేముంటుంది?.

ఈ 'ఆ భీ జా' పాట టీనా స్వరపరిచిన ట్యూన్ కాగా విక్రమాదిత్య దాన్ని కాపీ చేసి తన ట్యూన్‌గా చెప్పుకుంటాడు. కథానుసారం ఈ ట్యూన్ ఎంతో అద్భుతంగా ఉండాలి. అందుకు తగ్గట్టే కీరవాణి సామాన్య ప్రజల నుంచి సంగీతరసజ్ఞుల వరకు అందరినీ ఆకట్టుకునే ట్యూన్‌ని రూపొందించారు. పాట ఎత్తుగడలో, ఎంటర్‌లూడ్స్‌లో వయొలిన్‌ని ఎఫెక్టివ్‌గా ఉపయోగించి మూడ్‌ని ఎలివేట్ చేశారు.



కథ ప్రకారం విక్రమాదిత్య తాను రూపొందించబోయే ఆల్బమ్‌లో ఒక మంచి ట్యూన్ కట్టడానికి ప్రయత్నిస్తుంటాడు. టీనా కట్టిన ఒక ట్యూన్‌ని చాటు నుంచి వింటాడు. అదే ట్యూన్‌ని ప్రాక్టీస్ చేస్తుండగా అతని సహచరుడు విని ఈ ట్యూన్‌తో కొత్త విక్రమాదిత్య పుట్టాడని అంటాడు. దీనితో అసూయ పెరిగి టీనాను కించపరచాలనే ఉద్దేశంతో తాను రికార్డింగ్ చేసేటపుడు వయొలిన్ వాయించమని ఆమెను పిలిపించి ఆమె పాటనే పాడతాడు. టీనా అయోమయంలో పడి వయొలిన్ వాయించలేక వచ్చేస్తుంది. అతనే వయొలిన్ వాయించి రికార్డింగ్ పూర్తి చేశాక టీనాని పిలిచి 'నువ్వు వయొలిన్ వాయించలేకపోయావు, నీకు సంగీతం అబ్బదు' అని అవమానిస్తాడు. అతని అంచనాలను అందుకోలేకపోయానని, అతని కోపానికి కారణమయ్యాననే భావంతో ఆమె మ్యూజిక్ స్కూల్‌ని వదిలి వెళ్లిపోతుంది.

ఈ పాటలో ట్యూన్‌కే ఎక్కువ ప్రాధాన్యత ఉంది. అయినా మొదటి చరణంలో విక్రమాదిత్య భావాలను చక్కగా చెప్పారు రచయిత నిదా ఫాజ్లీ. తన స్టూడెంట్స్ మూడ్, టెంపరమెంట్‌ని బట్టి ట్యూన్‌కి పాట రాస్తానని చెప్పుకునే విక్రమాదిత్య తనలోని ఈర్ష్యకు తగ్గట్టు ఈ చరణంలో పదాలు రాయటం సహజమే కదా అనిపిస్తుంది.

'ఆ భీ జా' అంటే 'ఇక వచ్చెయ్' అనే అర్థం వస్తుంది. 'రావేల' అనే భావానికి దగ్గర్లో ఉంటుంది. 'సుబహ్' అంటే ఉదయం. 'విదాకర్' అంటే 'సాగనంపు' అని. 'దిల్‌రుబా' అంటే 'ప్రియతమా'.

**'రావేల, రావేల**
**ఉదయమా రావేల**
**రేయిని సాగనంపి**
**ప్రియతమా రావేల'**

'పాగల్‌పన్' అంటే వెర్రి. 'సీమా' అంటే హద్దు. 'ఛాయా' అంటే నీడ. 'గగన్' అంటే గగనం. 'జమీఁ' అంటే భూమి. 'అధూరీ' అంటే అసంపూర్ణం.

**'నా మనసు వెర్రికి హద్దేముంది**
**నీవు నా నీడవే కదా, నీలో మరి నీడేముంది**
**నేను గగనం, నీవు భువనం**
**నేను లేని నీవు అసంపూర్ణం'**

'నిన్ను నాలా తీర్చిదిద్దాలనుకున్నాను, వెర్రివాడిని. నువ్వు నా నీడ లాంటి దానివే గానీ నేను కాలేవు. నేను లేకపోతే నీవు అసంపూర్ణంగా మిగిలిపోతావు' అని తన అసూయనంతా వెళ్లగక్కుతున్నాడు.

'చాహే జిస్‌కో దేఖూ' అంటే 'ఎర్ని చూసినా' అని. 'రిష్తా' అంటే సంబంధం. 'బేచైన్' అంటే కలవరం.

**'ఎవర్ని చూసినా కొంచెం నీలా కనిపిస్తారెందుకు**
**ఏమిటో ఈ సంబంధం తెలియదు నాకు.**
**ఎలా చెప్పను నీవు లేక నా మనసుకెంత కలవరమో'**

టీనా రికార్డింగ్ రూమ్ నుంచి వచ్చేసి బాధపడుతూ ఉండగా నేపథ్యంలో వచ్చే చరణం ఇది. ఆమె ముందే రాసుకున్న సాహిత్యంలా ఉంటుంది ఈ చరణం. ఆమెకు విక్రమాదిత్యపై ఉన్న ప్రేమను కూడా చూచాయగా తెలియజేస్తుంది.

'మస్త్' చిత్రం ద్వారా పరిచయమై అనతికాలంలో ఎంతో పేరు సంపాదించిన సునిధి చౌహాన్ లక్కీఅలీకి సమఉజ్జీగా ఈ చరణం పాడింది.

**-పి.వి. సత్యనారాయణ రాజు**

34వ పేజీ తరువాయి...

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : ఆదిత్య

వెల : రూ. 35/-

మాటల రచయితగా అతి తక్కువ కాలంలో ఎంతో మంచి పేరు తెచ్చుకున్న త్రివిక్రమ్ శ్రీనివాస్ దర్శకత్వంలో 'తరుణ్, శ్రేయ' హీరో హీరోయిన్‌లుగా 'స్రవంతి రవికిషోర్' నిర్మించిన "నువ్వే ... నువ్వే" సినిమా ఆడియో క్యాసెట్ ఆదిత్య ద్వారా విడుదల అయింది. కోటి స్వర పరచిన ఈ చిత్రంలోని పాటలను సిరివెన్నెల సీతారామశాస్త్రి వ్రాసారు.

దేవన్, కోటి, త్రివిక్రమ్, అనురాధా శ్రీరామ్ పాడిన 'కంప్యూటర్స్, ఆర్ట్, సైన్స్, మేథ్స్, కామర్స్ ఇవన్నీ క్లాస్ రూమ్ సబ్జెక్ట్స్ ఎలాగూ తప్పని న్యూసెన్స్' అనే పాట టైమ్‌పాస్ క్యాంపస్ పాట అయినా సరే సాహిత్య మంతా స్పష్టంగా వినబడడం ఈ పాటకు ప్లస్ మార్కు. ఈ పాట సృష్టికి సంబంధించిన వారంతా కాలేజీ జీవితాన్ని వదిలేసి చాలాకాలమైనా పాటలో ఇంత ఫ్రెస్‌నెస్‌ని నింపారంటే వాళ్ళ అబ్జర్వేషన్ ఇవాళ్టికీ ఎంత షార్ప్‌గా ఉందో తెలుస్తోంది.

ఉదిత్ నారాయణ్, నిత్య సంతోషిణి పాడిన 'నా మనసు కేమయింది నీ మాయలో పడింది. నిజమా కలా' అనే పాటకి చక్కని సంగీతం, సాహిత్యం, గానం జతపడ్డాయి. లోతైన భావాల్ని అర్థమయ్యే పదాలతో అందించడంలోనే రచయిత నైపుణ్యం తెలుస్తుంది. అది ఈ పాటలో ఆద్యంతం కనపడుతుంది. 'గాలితో చెప్పనీ మనమొదటి గెలుపు ఇదని' అనే ఎక్స్‌ప్రెషన్ చాలా బావుంది. ఉదిత్ నారాయణ్ నోట తెలుగు మాట హాయిగా వినిపించిన పాట ఇది.

చిత్ర పాడిన 'ఏ చోట ఉన్నా నీ వెంట లేనా' అనే పాటలో సాహిత్యానిదే ప్రథమ స్థానం. 'నేల పైపు చూసే నేరం చేశానని నీలిమబ్బు నిందిస్తుందా వాన చినుకుని/గాలివెంట వెళ్ళేమారాం మానుకోమని తల్లి తీగ బంధిస్తుందా మల్లెపూవుని / వేరెవరో చూపిస్తుంటే నా ప్రతికలా కంటి పాప కోరే స్వప్నం చూసేదెలా / నాకు కూడా చోటులేని నా మనసులో నిన్నుంచగలనా ప్రేమా ఈ జన్మలో' ఇలాటి వాక్యాలతో గుండె అణువణువు చెమ్మగిల్లేటట్టు రాసిన సీతారామ శాస్త్రికి హేట్సాఫ్ అనని సహృదయము, రసహృదయము ఉండదు. ఈ పాటతో ఆయన ఇంట మరొక నంది చేరకుంటే ఇహలోకం లోని తెలుగువాడి అంతరాత్మ, పైలోకంలో ఆత్రేయ రసాత్మ రెండూ క్షోభిస్తాయి. ఇంత మంచి సాహిత్యాన్ని సూటిగా గుండెకు తాకేట్టు అందించడంలో కోటి, చిత్ర కూడా పూర్తి న్యాయం చేశారు.

కె.కె.పాడిన 'అయామ్ వెరీసారీ అన్నాగా వందోసారి' అనే పాట ప్రముఖ పాప్‌సింగర్ షకీరా వెలువరించిన 'లాండ్రీ సర్వీస్' అనే పాప్ ఆల్బమ్‌లోని 'వెనెవ్వర్ వేరెవ్వర్' అనే పాటను ప్రేరణగా తీసుకున్నారు. ఆర్కెస్ట్రయిజేషన్ కి కూడా ఆ పాప్ గీతాన్ని అనుసరించారు - సారంగి బిట్‌తో సహా!

శంకర్ మహదేవన్ పాడిన 'నిద్దరపోతున్న రాతిరి వడిగా' అనే పాటలోని 'అందరిని ఇలా వెంట పడి అడగాలా' అనే లైను వినగానే - దేవానంద్ హీరోగా నటించిన 'తెరె ఘర్‌కె సామ్‌నే' సినిమా కోసం ఎస్.డి.బర్మన్ స్వరపరచిన 'తూకహా/ఐ బతా/ఇసే అంధేరీ రాత్‌మే' పాటలోని 'మానేనా తేరా దిల్ దివానా' అనే లైను గుర్తొస్తుంది. ఈ రకమైన అడాప్టేషన్‌కి కారణం కేవలం సరదా అనుకోవచ్చు.

సరిగ్గా ఇటువంటి సరదా అడాప్టేషన్ 'అమ్మాయి నచ్చేసింది ... ఆహ్వానం ఇచ్చేసింది' పాట పల్లవిలో కనబడుతుంది. రాజేష్, కౌసల్య పాడిన ఈ 'అమ్మాయి నచ్చేసింది' పాట పల్లవి వినగానే 'బోల్ రాధాభోల్' హిందీ చిత్రంలోని 'తత్తుత్తుతుత్తుత్తార తోడోన దిల్ హమారా' అనే పాట పల్లవి గుర్తొస్తుంది.

# పప్పు వెంకన్న

**పప్పులో నెయ్యేసి కలిపితే**

**ఘుమఘుమలాడుతూ కడుపు నింపుతుంది!**

**కానీ ఈ పప్పు కడుపు నింపేది కాదు**

**మనసు నింపేది....**

**(నేతి ఇంటిపేరు గల వారు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులున్నారు... ఉదా: శ్రీ నేతి శ్రీరామశర్మ గారు.....)**

**18వ శతాబ్దపు విజయనగర సంస్థానంలో సంగీత విద్వాంసుడిగా ఒక్క వెలుగు వెలిగిన 'పప్పు వెంకన్న' వైణికుడే కాక అద్భుతమైన గాయకుడు కూడా!**

**సరే విజయనగర సంస్థానంలో ఆస్థాన విద్వాంసుడిగా ఉండడం అంటే అదో పూర్వజన్మ సుకృతం**

**అటు సంపదా.... ఇటు విద్యా...**

**లక్ష్మీ సరస్వతుల ఏకాకృతి....**

తమ హయాంలో కళాకారుడన్నవాడెవడూ ఆర్థికపరమైన ఇబ్బందులు పడరాదని శ్రీశ్రీశ్రీ ఆనందగజపతుల వారి హుకుం!

ఇంతకన్నా యోగం ఏవుంటుంది ఏ కళాకారుడికైనా...!

ఎంత విద్వత్తున్నా... ఆదరించేవారు లేక... కుటుంబాన్ని పోషించుకోలేక అష్టదరిద్రాల్నీ అనుభవించి అనామకులుగా అంతరించిపోయిన వారెంత మంది లేరు..

కానీ ఆనందగజపతుల సంస్థానంలో కళాకారులు.

ఇల్లు వాకిలి - పొలం - తోట... పాడి - పంట... ధన కనక వస్తు వాహనాలు.... సమస్త సౌకర్యాలూ.... సౌఖ్యలతో కళకళ్లాడుతూ ఉండేవారు.

అదిగో పప్పు వెంకన్న గారు!

తెల్లారగట్టే స్నానం... సంధ్యా ముగించుకునీ....

గున్నమామిడి చెట్టుకిందున్న చప్టామీద కూర్చునీ తంబూరా మీటుతూ ఆలాపన మొదలెట్టారు.

అదో గంధర్వగానం....

వాకిట్లో ముగ్గేస్తున్న వాళ్లావిడ.... అలాగే బుగ్గ మీద వేలెట్టుకునీ వింటోంది.

పెరట్లో గోమాత నెమరెయ్యడం మానేసింది.

అల్లనేరేడు చెట్టుమీద ఉడతా....

మామిడి కొమ్మమీద చిలక పళ్లుకొట్టడం మానేసాయ్...

ఓ సీతాకోక చిలుకొచ్చీ తంబూర మీద వాలింది.

భ్రమరాలూ.... పూలల్లోని తేనె తాగాలా.... ఈ గానంలో తేనె తాగాలా అని సందిగ్ధంలో పడ్డయ్!

ఊయల్లో ఉన్న పసిపిల్లాడు... వటపత్ర శాయిలాగ.

నోట్లో వేలెట్టుకునీ.... పప్పు వెంకన్నగారి గాన మాధుర్యాన్ని కళ్లుమూసుకు జుర్రుతున్నాడు.

వెంకన్నగారి గానం ఆగింది.

అంతా ఎవళ్ల పనుల్లో వాళ్లు పడిపోయారు.

ప్రకృతిని పులకరింపజేసే 'తీపి' ఆయన కంఠంలో ఉంది....

అందుకే హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాసు లాటి వారు....

"పప్పు వెంకన్న వేయి కోయిలలు మ్రోగునట్లొక
మైలు వినపడునట్టి గానముతో - దివ్య శరీరముతో
నధికామోద మొనర్చువాడు..' అని మెచ్చుకునీ.... ఇంకనూ ఇలా అన్నారు.

**జున్ను దినట్లు - పువ్వుల సోన మాడ్కి**
**నీటిపై జిల్లపెంకులు దాటు పొల్కి**
**ఒకమారు పారుల మొదగి వచ్చినయట్లు**
**తన మొయిల పెట్టవరకినట్లు**
**ఒకమారు మేల్పటా నొడడి తిప్పినయట్లు**
**కొలనందు జలకేళి సలిపినట్లు**
**ఒకపరి నను ముద్దుతరియ యట్టుల**
**చేడెతో బూలను చేదినట్టు**
**పప్పు వెంకన్న నీ పాట వెన్న ముద్ద**
**లేసినట్టుల - జువ్వల నెగచినట్లు**
**సన్న చెంబేరి జాజులు జల్లినట్లు**
**చిన్ని పూదెనెపై బయి చిందినట్లు**

అని జానుతెలుగులో వేనోళ్ల కొనియాడారు.

అప్పట్లో మదరాసు ఆంధ్ర మహాసభ వారు... వివిధ ప్రాంతాల నించీ సంగీత విద్వాంసుల్నీ.... రాజ పోషకుల్ని పిల్చి సంగీత సభలు పెట్టించేవారు.

సరే సభ మొదలైంది...

పప్పు వెంకన్న కేవలం శ్రోతగా వెళ్లాడు....

తీరా... పాడాల్సిన గాయకుడు రాలేదు...

పావుగంటయింది.... అరగంటయింది....

గంటయింది..

నిర్వాహకుల గుండెల్లో రైళ్లు....

సభలో కలకలం....

నిర్వాహకులు ఎవరన్నా పాడి సభని రంజింప చెయ్యాల్సిందిగా అభ్యర్థించారు...

లేచాడు పప్పు వెంకన్న....

తను విజయనగర సంస్థానం ఆస్థాన విద్వాంసుడు.

రాజావారి అనుజ్ఞ లేకుండా పాడడం దోషం.... సంప్రదాయం కాదు....!

కానీ ఇక్కడ సభ అభాసుపాలయ్యేలా ఉంది....

కళాకారుడిగా సభా గౌరవాన్ని నిలబెట్టాల్సిన బాధ్యత ఉంది.

సరే, మనసులో తను నమ్మే దైవాన్ని స్మరించుకునీ

గొంతు సవరించీ గానం ఆరంభించారు!

ఆంధ్ర మహాసభలో - అమృతవర్షిణి....

'ఝుం' అంటోంది తంబూరనాదం...

తకతకిట.... తకతకిట.... అంటోంది మృదంగం

డం... డం.... డండం.... డం అంటోంది మోర్సింగ్

రాగధార ఆరంభమైంది!

ఆకాశంబున నుండి... శంభుని శిరంబందుండి... అన్నట్లు

బొట్టుగా... బొట్టుగా ఆరంభమైన మకరంద ధారలో మునిగీ మూర్ఛనలు పోతున్నారు శ్రోతలు..

ఇక పప్పు వెంకన్న తన్మయులై పాడేస్తున్నారు.

ఇంతలో హాల్లోకి ఆనందగజపతి మహారాజులుంగారూ....

ఆయన మిత్రులైన మైసూరు మహారాజా శ్యంభూపతి గారు....

అడుగుపెట్టారు.

పాడుతున్న పప్పు వెంకన్న గొంతులో పచ్చి వెలక్కాయ పడింది.

పాట ఆగిపోయింది!!

సహకార వాయిద్యాలు మోగుతున్నాయ్...

తని ఆవర్తనం.... జరుగుతోంది.

ఆనందగజపతి మహారాజు పప్పు వెంకన్నని గమనించాడు.

కానీ ఏమి మాట్లాడలేదు..

మైసూరు మహారాజా వారు మాత్రం.. అర్థనిమీలిత నేత్రుడై ఆనందపరవశుడైయున్నాడు.

పప్పు వెంకన్న పాట పునః ప్రారంభించాడు.

మళ్లీ మొదలైంది గంగాఝరి!!

శృంభూపతి గారికి మతిపోయింది.... ఏవిటీ గంధర్వగానం...!

తను ఎన్నెన్ని సభల్లో ఎంతమంది సంగీతాన్ని విన్లేదు...

ఈ కొత్త గాయకుడెవడు? కాదు ఈ గంధర్వుడెవడు....?

కార్యక్రమం అయిపోయింది!!

మహారాజులిద్దరూ వేదికమీదకి వచ్చారు....

శృంభూపతి గారు సభికులని ఉద్దేశించి...

"మేం మా ఎరుకలో ఎన్నడూ ఇంత మధుర.... మంజుల.... మోహన గానాన్ని రుచిచూచి ఎరగం... అందుకు ఈ గాయకుణ్ని రత్నాల పతకంతో సన్మానిస్తున్నాం".

అనగానే సభ దద్దరిల్లిపోయింది!

రత్నాల హారాన్ని స్వీకరించిన పప్పు వెంకన్న సన్మానానికి సమాధానం చెప్తూ....

"రసజ్ఞులారా! నేను శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి వారి ఆస్థాన విద్వాంసుణ్ని.... కారణాంతరాల వల్ల.... సమయానికి ఇక్కడ విద్వాంసుడు రాకపోవటం వల్ల.... సభారంజనం చేద్దామన్న సదుద్దేశంతో గానం ఆరంభించాను. ఆస్థాన నియమం ఉల్లంఘించి ఆనంద గజపతుల వారి అనుజ్ఞ లేకుండా పాడినందుకు రాజావార్ని క్షమించవలసిందిగా వేడుకుంటున్నాను".

అనగానే... ఆనందగజపతుల వారు ముందుకొచ్చి..

"కళాకారుడు నిరంశకుడు.... స్వేచ్ఛాజీవి... ఆయన ఎవరికీ లోబడి బతకాల్సిన అవసరం లేదు! మీ వంటి కళాకారులకు ఆంధ్ర మహాసభలో మేమే ప్రత్యేకమైన సభ ఏర్పాటు చెయ్యాల్సింది! అంచేత తప్పు మాది... మమ్మల్ని మనస్ఫూర్తిగా మన్నించమని పప్పు వెంకన్న గారిని వేడుకుంటున్నాను." అని వెంకన్నని గాఢంగా ఆలింగనం చేసుకున్నారు.



సభాసదులందరి కళ్లలోనూ తడి!

శృంభూపతి కళ్ళు చెమర్చాయ్!

పప్పు వెంకన్న కళ్లల్లోంచి జలజల ముత్యాలు రాలాయి!

-తనికెళ్ల భరణి

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ల భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

సీరియల్ 18

# సద్దాం ఆంటీ ఇంటి కథ

-మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేనా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావుకి చెప్తాడు. బామ్మకు చావు 'ఎరేంజి' చేయడానికి హరకేశం సాయం తీసుకోమంటాడు సుబ్బారావు. వెంకటరత్నం ఇంకో వారసుడు. ఇక చదవండి....

ఇంకా, టి.వి ల్లో కాషాయ ధారులైన గడ్డాల వాళ్ల 'కర్మ', 'భక్తి' అంటూ కబుర్లు చెప్పడం మొదలెట్టని వేళ. 'ఈనాడు' దినపత్రిక ఠక్కున వచ్చి సరిగ్గా ఇంటి బాల్కనీల్లో పడే వేళ. మద్రాసులోని దాదాపు ప్రతి ఇంటివారు లేచేసే వేళ. హైద్రాబాద్‌లోని తమిళియన్స్‌ని వదిలేస్తే దాదాపు ఎవరూ లేవని వేళ.

ఆ వేళప్పుడు నిద్రపోతున్న రాజుకి మెలకువ రావడంతో మంచం మీద ఠక్కున లేచి కూర్చున్నాడు.

నాన్నగారు కేంప్‌లో వుండబట్టి, తన పక్కనే పండుకున్న తల్లిని లేపాడు.

"ఏమిటి?" బద్ధకంగా కళ్లు తెరవకుండానే ప్రశ్నించింది వాసవి.

"నాకు ఇప్పుడే కల్లో సాయిబాబా కనబడ్డారు మమ్మీ" ఉత్సాహంగా చెప్పాడు.

"సర్లే పడుకో"

'అది కాదు. నే చెప్పేది విను మమ్మీ. మన బాత్‌రూంలోని బల్లిని చూసి నేను అప్పుడప్పుడూ భయంతో అరుస్తూంటాను కదా. అదివాళ చచ్చిపోతుందని చెప్పారు బాబా.

"సర్లే పడుకో"

రాజు ఏదో మాట్లాడుతున్నా వాసవి మళ్లీ నిద్రలోకి జారిపోయింది.

ఉదయం రాజుకి స్కూల్ యూనిఫాం తొడుగుతూంటే గుర్తుకు వచ్చింది తెల్లారు ఝామున సంభాషణ.

"ఏమిట్రా పొద్దున్నే నిద్రలేచి సాయిబాబా అంటున్నావ్? ఆయన బల్లి రూపంలో దర్శనమిచ్చాడా?"

"ఛ అదేం కాదు..." మళ్లీ తను పొద్దున్న చెప్పింది రిపీట్ చేసాడు రాజు.

"సర్లే తెములు" విసుక్కుంది వాసవి.

ప్రతీ శుక్రవారం దుర్గమ్మ వారికి పూలతో గంటన్నర దాకా పూజచేసే అలవాటు గల వెంకటరత్నం ఆరోజు ఉదయమే లేచి పూలుకోయసాగాడు. కనకాంబరాలని కోస్తూ, గొంతు తగ్గించి, పక్కనున్న పారిజాతం చెట్టుకి వినపడకుండా పొగడసాగాడు.

'ఆహా... పూల మొక్కంటే తమరే కదండీ. కనకాంబరం రంగుపూలు తమరికి తప్ప మరెవరికీ పూయవు కదండి. అసలా రంగే రంగు. దాన్ని గోల్డ్‌స్పాట్ కంపెనీవారు కాపీ కొట్టారు కదండి. ఆ మాటకొస్తే, పచ్చినారింజ పండు పండాక మీ రంగుకే మారడం కాపీనే కదండి. ఎప్పుడో తమరు, ఆ చెట్టు పక్కపక్కనే వుండి వుండాలి. 'కనకాంబరం రంగు చీర' అంటూ మీ పూలరంగుని మేం వాడుతున్నాం అంటే, ఆలోచించండి, తమరెంత శ్రేష్ఠమైన రంగు గలపూలు పూస్తున్నారో. ఇంకో పూలు తమ పూలకి సరికావండి"

అక్కడకోయడం పూర్తయ్యాక పారిజాతం చెట్టు దగ్గరకి వెళ్లి దానికి మాత్రమే వినబడేలా పొగడసాగాడు.

"ఇంకో చెట్టు పూలు తమరి చెట్టు పూలకి సరికాదండి. మంచులా తెల్లటి రెక్కలు గల పూలు, ఎర్రటి కాడ, చక్కటి సువాసన. ఓహో..! ఏం సువాసనండి. పైగా మేం కోసుకునే ఇబ్బంది నివ్వకుండా ఎంచక్కా తెల్లారు ఝామునే మీ పూలని నేలమీద రాల్చేస్తూంటారు. ఇట్టే పూల గిన్నెలో, అట్టే ఏరుకోవచ్చు. యు ఆర్ ఏ డీసెంట్, ఫైన్ ఫ్లవర్ ప్లాంట్, ఐ షుడ్ సే..."

ఇలా ముద్ద మందార చెట్టుని, జూకా మందార చెట్టుని కూడా పొగిడాక ఇంట్లోకి పూలగిన్నెతో వెళ్లాడు.

అతని భార్య చెప్పింది నిట్టూర్చి-

"ఏం అమ్మవారో, ఏం పూజలో?"

"అదేమిటి అలా అన్నావు?" ఆశ్చర్య పోయాడు వెంకటరత్నం.

"వదినభావం అర్థం కాలేదా అన్నయ్యానీకు? ఎన్నో ఏళ్లుగా నువ్వు ఏ కోరికతో 'శ్రీమాతా, శ్రీ మహారాజ్ఞి, శ్రీమత్సింహాసనేశ్వరీ'ని పూజిస్తున్నావో, ఇంతదాకా ఆమె ఆ కోరిక తీర్చ లేదని, నిన్ను కరుణించలేదని వదిన మాటల కర్థం" చెప్పాడు నిరుపమ్.

"గత పాతికేళ్లుగా గుళ్లో నిత్యం లలితా సహస్రనామం చేయమంటే చేస్తూనే వున్నాను, నెలకి నాలుగు రోజులు వదిలేసి. నాకా సహస్రనామాలు కంఠతా వచ్చాయి కాని ఆ శ్రీమాతకి మన ఒక్క చిన్న కోరిక మనసున పడలేదు". బాధగా చెప్పింది జయశ్రీ.

"శ్రీమాతా, నువ్వా మూర్ఖురాలి మాటలని పట్టించుకోకమ్మ" మనసులోనే శ్రీరాజరాజేశ్వరి దేవికి క్షమాపణ చెప్పుకున్నాడు వెంకటరత్నం. తర్వాత యధావిధిగా ఖడ్గమాలని చదువుతూ పూజచేసాక కళ్లుమూసుకుని ప్రార్థించాడు. "దేవీ సినిమాల్లోలా కాదు. నిజంగా చెప్తున్నాను. ఉన్నావా? అసలున్నావా? ఉంటే నువ్వు మా స్వంతిల్లు మాకు ఈ నెలాఖరులోగా అందేలా చెయ్యి. లేదా నువ్వు ఉన్నా, కళ్లు మూసుకుని ఉన్నావనుకుంటానంతే. ఉన్నావని, నువ్వున్నావని నిరూపించుకునే సమయం నీకు ఆసన్నమైంది దేవీ. కోరిన కోరికలు తీర్చే నిన్ను 'ఇచ్ఛా సిద్దే, ప్రాప్తి సిద్దే' సర్వకామ సిద్దే, సర్వకామప్రదే, సర్వ దుఃఖ విమోచనీ, సర్వవిఘ్న నివారిణీ' అంటూ నిత్యం కీర్తిస్తున్నందుకైనా నా పని చేసి పెట్టు తల్లీ. ఓం నమో భగవతే నమో నమః".

వెంకటరత్నం మాటల్లో ఓ విధమైన స్థిరత్వం కనిపించింది.

* * *

బేంక్‌లో పనిచేసుకుంటూండగా ఓ రోజు పోస్ట్‌లో ఎప్పటిలా నిరుపమ్‌కి ఓ కవరు వచ్చింది. దాన్ని చింపి అందులోంచి ఓ ఫోటో ముక్కని బయటకి తీసాడు నిరుపమ్. డ్రాయరు లాగి అంతకుమునుపు అతికించిన ఫోటో ముక్కలున్న కాగితం అందుకుని, దాన్లో అది ఎక్కడ సరిపోతుందో వెదికి ఆ స్థానంలో ఆ ముక్కని

**ఐ.డి.10 టి. అంటే ఏమిటో మీకు తెలుసా?**
**ఈ ఆసక్తికరమైన పజిల్‌కు జవాబుకోసం**
**ఈ సీరియల్ చదవండి.**



అతికించాడు. ఆ ఫోటోకిప్పుడు ముక్కు కూడా అమరింది. కళ్ల భాగం మాత్రం ఖాళీగా వుంది. అవీ వస్తే, ఆ ఫోటో ఎవరిదో తెలియచ్చు.

కళ్లు అతికించకపోయినా ఫేస్‌కట్‌ని బట్టి అది ఎవరిదో చూచాయగా గ్రహించగలిగాడు నిరుపమ్.

అయితే కళ్లు కూడా అమరే దాకా ఖచ్చితంగా అది అనన్యదేనని చెప్పడానికి వీల్లేదని కూడా నిరుపమ్‌కి తెలుసు. బేంక్ స్పేసర్ రెండో కూతురిది కూడా అయివుండచ్చు. ఇంకొక్క వారం ఆగితే నిజం తెలియచ్చు అనుకున్నాడు. తనకి అనన్య మీద మనసుండబట్టి అది ఆమెదిగా తోస్తోందేమోనని కూడా అనిపించింది నిరుపమ్‌కి.

తను చేస్తున్న పనిని మధ్యలో ఆపి అతను లేచి అనన్య దగ్గరకివెళ్లాడు.

"అనన్యగారూ. నిన్నటి ఈ స్టేట్‌మెంట్‌లో పదివేల పదమూడు రూపాయలు తేడావచ్చింది. ఎక్కడ తప్పుందో ఎంత చెక్ చేసినా తెలీలేదు చూడండి" తనతో తెచ్చిన కాగితాలని ఇచ్చాడు.

అనన్య ఓసారి ఆ స్టేట్‌మెంట్ వంక తేరిపార చూసి చెప్పింది"

"ఐడి టెన్ టి (ID-TEN-T) ఎర్రర్‌లా వుందండి"

"ఏం ఎర్రర్?" మొదటిసారిగా 'ఐడిటెన్‌టి ఎర్రర్' గురించి విన్న నిరుపమ్ అడిగాడు.

'ఐడిటెన్‌టి ఎర్రర్ సార్"

"అంటే?"

"చెక్ చేసి అది అవునోకాదో చూస్తానుండండి".

కంప్యూటర్‌లో ఆ స్టేట్‌మెంట్‌వున్న ఫైల్ ఓపెన్‌చేసి ఆ ప్రింటవుట్‌లో స్క్రీన్ మీద వున్నదాన్ని పోల్చి చూసింది.

"కరెక్టా?" అడిగాడు నిరుపమ్.

"కరెక్టే, ఐడిటెన్‌టి ఎర్రర్"

"అంటే?"

"చూడండి. దీన్ని ప్రింటవుట్ తీసేటప్పుడు నేననుకున్నట్లుగా ఫైల్‌లోని ఆఖరి ఎంట్రీని వదిలి ప్రింటవుట్ తీసుకున్నారు మీరు. దాంతో ఆ తేడావచ్చింది మీకు.

నిరుపమ్ కూడా ప్రింటవుట్‌ని, కంప్యూటర్ స్క్రీన్ మీద కనపడే స్టేట్‌మెంట్‌తో పోల్చి చూసి చిన్నగా నవ్వేసి చెప్పాడు.

"నిజమే. ఐటమ్స్‌ని మార్క్ చేసి ప్రింటవుట్

**పేకాటలో బట్టలు పోగొట్టుకున్న కార్టూన్స్ అనేకం చూసి ఉంటారు. అచ్చం అలాంటి పాత్రను ఈ సీరియల్‌లో కలుసుకొండి.**

తీసుకున్నాను తప్ప ఫైల్ మొత్తాన్ని తీయమని కమాండ్ ఇవ్వలేదు. ఆఖరి ఎంట్రీ వదిలేసాను"

"సో, దట్ క్లియర్స్ దట్... ఇందాకేమన్నారు? ఐడిటెన్‌టి ఎర్రరా?, అదెప్పుడూ వినలేదే?"

"కంప్యూటర్ ట్రైనింగ్ ప్రోగ్రాంలో చెప్పారది. మీకు గుర్తుండకపోవచ్చు".

అతనెళ్లాక అనన్య తమ సంభాషణ వింటున్న ఇంకో లేడీక్లర్క్ వంక నవ్వుతూ చూసి చెప్పింది.

"ఇతనికి ఐడిటెన్‌టి ఎర్రర్ గురించి తెలీదుట".

"పాపం!" ఫక్కున నవ్విందామె.

*

"మీకు బుద్ధీ జ్ఞానం లేవు. సిగ్గు, శరం అన్నవే లేవు. అసలు మీదీ ఓ మనిషి జన్మేనా? ఛ మీ మొహం చూస్తే నాకు డోకొస్తోంది" అరుస్తోంది.

దాదాపు పావుతక్కువ అరగంటనించి తనని ఏకిపారేస్తున్న భార్యతో చెప్పాడు లింగమయ్య శాంతంగా.

"ఇప్పుడేమైందనే?"

"ఏమైందనా? ఏమైందనా మీరు అడిగేది? ఇంటావిడ నన్ను అంతలేసి మాటలంటుంటే, మీరు అడ్డువచ్చి ఆమెని ఒక్క మాటైనా అన్నారా? మీరు ఇంట్లో వుండీ నోరెత్తకపోతే, నాదే తప్పని మీరూ వప్పుకున్నట్లేగా?"

"అది కాదే. వాళ్లు ఇదివరకే చెప్పారుగా కరివేపాకు చెట్టు చిన్నది, రెమ్మలు కోస్తే చచ్చిపోతుంది, కావాలంటే ఆకులు మాత్రమే తెంపుకోండి అని. మరి నువ్వు రెమ్మలు కోసావుగా? ఏం మొహం పెట్టుకుని నేను నీది తప్పుకాదని చెప్పగలనే, నువ్వే చెప్పు?"

"అందుకే మీకు బుద్ధీ జ్ఞానం లేదనేది. మీరు వట్టి శుంఠ అనేది, ఉత్త నికృష్టుడనేది".

లింగమయ్య నోరెత్త లేదు.

"పెళ్లి ముందు మీ నాన్నేం చెప్పారు? మీకో పెద్ద సొంతిల్లుందని చెప్పారా లేదా? తీరా పెళ్లయ్యాక తెలిసింది మీకే ఇల్లూ లేదని. మీరు ఇంత చచ్చుపీనుగని తెలిస్తే, మనాన్నసలు మీకు కట్టపెట్టే వాడే కాదు".

"ఇప్పుడవన్నీ ఎందుకే?"

"ఎందుకా? నాకు సొంతిల్లు వుంటే, రెమ్మలే కోసుకునే దాన్నో, లేదా కొమ్మలే కోసుకునే దాన్నో. ఇలా నన్నెవరూ అడిగేవారుకాదు కదా! అర్థమైందా ఇప్పుడివన్నీ ఎందుకో?" గయ్యిమంది.

"అర్థమైంది కాని కాస్త గొంతు తగ్గించు"

గొంతు తగ్గిస్తే, ఆ కోపాన్ని ఆవిడ ఎటువైపు మళ్లిస్తుందో, అటు మళ్లించింది. లింగమయ్య మాడు మీద ఓ పిడిగుద్దు వేసింది. ఆ దెబ్బకి గింగిరాలు తిరుగుతారు మరొకరైతే. కాని అలాంటి దెబ్బలు అలవాటు కనక లింగమయ్య తట్టుకున్నాడు.

"ఇంకోసారి ఇంటావిడ నా మీద లేస్తే మీరు మాట్లాడకుండా ఉండండి చూస్తాను".

లింగమయ్య వీపు మీద ఓ పిడిగుద్దు గుద్ది అక్కసుగా చెప్పింది ఆవిడ.

బదులుగా లింగమయ్య సన్నగా నవ్వాడు. అది విషపునవ్వుగా గుర్తించిన ఆవిడ అడిగింది కొద్దిగా ఆశ్చర్యంగా.

"సందర్భం లేకుండా ఏమిటలా నవ్వారు?"

"ఆ ఇల్లు అతి త్వరలో మనదవబోతోందే పిచ్చి మొహమా"

"ఆ బామ్మగారు బతికుండగానే?"

"ఇంకెంత కాలం బామ్మగారు?



ఇంకెంతకాలం బ్రతికివుండటం?'' ఎకసెక్కెంగా చెప్పాడు లింగమయ్య.

"ఏం? కొత్త జబ్బేమైనా చేసిందా?'' ఆశగా అడిగింది.

''జబ్బు లేదు గిబ్బు లేదు. నిన్ననే చూసివచ్చాను. ఊరిమధ్య బొబ్రాయిలా హాయిగా వుంది?''

"మరి?''

"వేస్తున్న, అందుకే పథకం వేస్తున్నా''

తన భర్త తన దగ్గర ఎంత మేకలా ప్రవర్తించినా, ప్రపంచ వ్యవహారాల్లో పులిలాంటి వాడని తెలుసు కనుక ఆవిడ మొహం విప్పారింది.

"ఏమిటా పథకం?'' అడిగింది.

"పని పూర్తయ్యాక చెప్తాను''

"ఎప్పటి కవుతుందది?'' అడిగిందావిడ ఆసక్తిగా.

"అది హరకేశంగాడి మీద ఆధారపడి వుంటుంది''.

"ఎవరా హరకేశం?'' అడిగింది లింగమయ్య భార్య.

*

రూల్ ప్రకారం 'ఎవరా హరకేశం?' అనగానే ఈ అధ్యాయంలో హరకేశం ఫోన్‌లో 'నా పేరు హరకేశం అనో, లేదా 'హరకేశంగారూ' అని ఎవరైనా పిలిస్తే, 'వచ్చె వచ్చె' అని హరకేశం తలుపు తీయడంగాని (మొదటిది సినిమా, రెండోది రేడియో డ్రామా) చెయ్యాలి. అది కరెక్ట్ గ్రామరే.

కాబట్టి మనం ఆ గ్రామర్‌ని పాటిస్తూ అలాగే ఈ అధ్యాయం మొదలెడదాం. ఇక సీన్లోకి వస్తే, నలుగురు పేకాడుతున్నారు. చూడడానికి ముగ్గురు ప్రొఫెషనల్ గేంబ్లర్స్‌లానే వున్నారు. నాలుగోవాడు అప్పుడప్పుడే ఈ గేంబ్లిగ్‌లోకి వచ్చినట్లున్నాడు.

"నాయినా హరకేశం. ఎంతసేపు? ముక్క వెయ్యి'' అన్నాడు ఆ నలుగురిలో ఒకరు.

హరకేశం ఓ ముక్క చేతిలోంచి తీసి దాన్ని కిందవేయబోయి తటపటాయించి ఇంకోటి తీసి వేసాడు. ఆ ఆఠీన్ ఆరు ముక్కని పక్కనున్నతను సంతోషంగా అందుకున్నాడు.

వెంటనే హరకేశం మొహం మాడిపోయింది. తనువేసే ప్రతీముక్కని అతను బీరుపోకుండా తీసుకోవడం, ఆ ఆట మొదలైనప్పటి నించీ గమనిస్తూనేవున్నాడు హరకేశం. అతను ఆట అయిందని ముక్క మూస్తాడేమోనని ఊపిరి బిగబట్టి చూసాడు.

అయితే అతను కళావరు జాకీని మామూలుగా వేయడంతో ఊపిరి వదిలాడు హరకేశం.

మరో రౌండ్ ఆట తిరిగే సరికి హరకేశం ఈసారి ఇంకొద్ది సేపు ఎక్కువగా ఆలోచించి ఇస్పేటు నాలుగు వేయబోయి తమాయించుకుని, ఆఖరి నిముషంలో దానిబదులు డైమండ్ ఎనిమిది వేసాడు. దాన్ని చూస్తూనే గద్దలా చటుక్కున లాక్కుని చెప్పాడతను.

"థాంక్స్ హరకేశం. ఆటయింది నాకు''

ముక్కని బోర్లా వేసి తన చేతిలోని పదమూడు ముక్కల సెట్టుని కిందపరిచాడు అతను.

హరకేశం బాధగా, అలా జరిగి ఉండకూడదన్నట్లుగా తల అడ్డంగా వూపాడు.

గెలిచిన తనకి మిగిలిన ఇద్దరూ తలో వంద సమర్పించుకున్నారు. హరకేశం తన జేబులోని ఆఖరి వందరూపాయల కాగితం అతని కిచ్చాడు. గెలిచినతను గర్వంగా నవ్వుతూ చెప్పాడు.

"తెలివైనవాడు బీరుని సరాసరి మూతని తెరిచి ఒకేసారి బాత్‌రూంలో పోసేస్తాడు. తెలివి తక్కువ వాడు గంటలు వృధా చేసి దాన్ని తాగి చివరికి దాన్ని బాత్‌రూంలో పోయడానికి వెళ్తాడు. కాలు జారి పడతాడు. అలాగే గంటన్నర క్రితం నీ దగ్గరున్న వెయ్యి అడిగితే, డైరెక్ట్‌గా ఇచ్చావా? అదెలాగూ నాకే చెందినప్పుడు ఆట ఎందుకు చెప్పు మధ్యలో? ఇంక లేచి ఇంటికెళ్లు''

హరకేశం మొహం ఎర్రబడింది. గెలిచినతను కత్తెర పట్టుతో ముక్కలు కలుపుతూ చెప్పాడు.

"మన ముగ్గురికీ పంచుతాను''

"నాకూ పంచు. నేనూ ఆడతాను'' చెప్పాడు హరకౌశం పట్టుదలగా.

"నీదగ్గర కాసుల్లేవన్నావుగా?'' ప్రశ్నించాడు గెలిచినతను.

హరకేశం ఇందాక ఏ ముక్క వేయాలని ఎంత తీవ్రంగా ఆలోచించి వేసాడో, అంత తీవ్రతతో ఆలోచించి చెప్పాడు.

"డబ్బుల్లేక పోతేనేం? వాచీ వుందిగా''

"దాని ఖరీదెంత?''

మిగిలిన ముగ్గురు ఆటగాళ్లు ఆ వాచీని అందుకుని పరిశీలించి తృప్తిపడ్డాక నలుగురికీ ముక్కలు పంచసాగాడతను.

*

ఫోన్ మోగితే బామ్మ రిసీవర్ ఎత్తి 'హలో' అని తర్వాత 'ఒక్క నిముషం' అని అనన్యని పిలిచి చెప్పింది.

> నాస్తికుల సభ బాగా జరిగినందుకు ఒకడు గుళ్ళో కొబ్బరికాయ కొట్టాడంట. అలాంటి పాత్రను గుర్తుచేసే లింగమయ్యని ఈ నవలలో కలుసుకోండి.

"నీకేనే''

"ఎవరుట?'' అంటూ రిసీవర్ అందుకుని 'హలో' అంది అనన్య.

"నేనేనే'' అవతలనించి వినిపించింది ఆమె కొలీగ్ కంఠం.

"ఏంటి ఈవేళప్పుడు చేసావు?'' ప్రశ్నించింది అనన్య.

"ఐడిటెన్‌టి ఎర్రర్ అంటే ఏంటో నాకు బోధపడలేదు. మన కంప్యూటర్ క్లాస్ నోట్ బుక్ తిరగేస్తే అందులో ఎక్కడా దీని గురించి లేదు''



అడిగింది అనన్య కొలీగ్ అవతలనించి.

"అదా?" నవ్వి అడిగింది అనన్య.

"నీ దగ్గర పెన్ను పేపర్ వుందా?"

"ఉంది, ఏం?"

"అయితే ఇంగ్లీష్‌లో 'ఐ డి' అక్షరాలు రాయి".

"I D...రాసాను?"

"పక్కన టెన్ వెయ్యి"

"I D 10... వేసాను"

"జీరో పక్కన టి పెట్టు" చెప్పింది అనన్య.

"I D 10 T... ఓ ఇడియట్టా? అర్థమైంది" ఫక్కున నవ్వింది అనన్య కొలీగ్.

*

వాసవి నిర్ఘాంతపోయింది. బాత్‌రూంలో వెలిగే లైట్ ఆపడానికి లోపలకి వెళ్ళగానే, ఎదురుగా తెల్లటి టైల్స్ మీద చచ్చిపడివున్న బల్లి ఆమె కంట పడింది. రాజుకి నిజంగా సాయిబాబా కలల్లో కనపడుతున్నాడా?

*

"హరకేశమా? ఇంకా ఇంటికి రాలేదు' చెప్పింది హరకేశం భార్య.

"అదేమిటి? రాత్రి పదకొండవుతోంది. ఇంకా రాకపోవడమేంటి?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు లింగమయ్య.

"ఆయనకి భార్యని నేనా నువ్వా? ఆఁ నేనే ఆయనతో ఆ ముక్క ఎన్నడూ అనలేదే? నువ్వెలా అనగలవు పెద్ద మనిషి? ఎనిమిదినించి గంట గంటకోసారి నువ్వు తనకోసం మా ఇంటికి తిరిగి పోతున్నావని ఆయనేమైనా కలగన్నాడా? మగవాళ్లకి బయట ఎన్ని పనులుంటాయో"

"నీకు నమస్కరిస్తున్నానమ్మా"

రెండు చేతులూఎత్తి నమస్కారం చేస్తూ చెప్పాడు లింగమయ్య.

"ఆయనతో నీకేం పని?" అడిగిందావిడ.

"ఆయనకి డబ్బు సమకూరే పని ఇవ్వడానికే వచ్చాను"

"అలాగా? మరా ముక్క ముందే చెప్పచ్చుగా? అప్పులాళ్లే మారువేషాల్లో కూడా వస్తూంటారు, ఎవరికీ అడ్రస్ చెప్పొద్దని, మావారు పేకాట ఆడి డబ్బు సంపాదించడానికి నా మంగళ సూత్రం తీసుకుని వెళ్లారు".

"ఎక్కడికి?"

"ఈ వీధి చివర ప్రభుత్వ స్కూలు వెనక చెట్టు కింద చప్టా మీదకి"

"ఇప్పుడెళితే వుంటాడా అక్కడ?" అడిగాడు లింగమయ్య ఆత్రంగా.

"ఆహా. బహుశా గెయినింగ్ హేండ్‌లో వుండి వుంటాడు. అందుకే రాలేదింకా".

లింగమయ్య వెనక్కి తిరిగి నాలుగడుగులు వేసి, ఆగి, మళ్లీ వెనక్కి తిరిగి నాలుగడుగులు ముందుకి వేసి మునుపటి యథాస్థానంలోకి వచ్చి హరకేశం భార్యకి రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేసాడు.

"ఈసారెందుకు?" అడిగిందావిడ సందేహంగా.

"భర్తకి పేకాటకి మంగళసూత్రం ఇచ్చినందుకు"

లింగమయ్య బయటకి వచ్చి స్కూటర్ ఎక్కి స్టార్ట్ చేసి ఆ బజారు చివర్లో వున్న మాసిపోయిన బిల్డింగ్ బయట ఆపి, దిగి స్కూటర్ స్టాండ్ వేస్తూంటే, ఆ బిల్డింగ్‌లోంచి దొంగలా నక్కినక్కి బయటకి వస్తూ అటు ఇటు చూస్తున్న హరకేశం కనబడ్డాడు.

"అదేమిటి హరకేశం?" అతన్ని చూడగానే నివ్వెరపోతూ ప్రశ్నించాడు లింగమయ్య.

"ఎవరది?" అడిగాడు హరకేశం కోపంగా

"నేనే లింగమయ్యని. సుబ్బారావు దగ్గర పనిచేసే లింగమయ్యని"

"నువ్వా? ఏమిటి గిరాకి?"

"నీతో పనిబడివచ్చాను కాని నాకంటికేమైనా మసకలు కమ్మాయి లేక నేను చూస్తున్నది నిజమేనా?" అడిగాడు లింగమయ్య.

"నిజమే. పేకాటలో మొత్తం పోగొట్టుకుని దిశమొలతో వున్నాను. సమయానికి దేవుడిలా వచ్చావు. కాస్త మా ఇంటికెళ్లి ఓ జత బట్టలు తీసుకురా" కోరాడు హరకేశం.

లింగమయ్య సరేనని అటెళ్లగానే జీప్‌లో అటు వెళ్తున్న ఓ పెద్ద మనిషి పూర్తిగా నగ్నంగా వున్న హరకేశాన్ని చూసి డ్రైవర్‌తో చెప్పాడు.

"ఆపావు"

జీపు ఆపగానే అతను కిందకి దిగాడు. ఇప్పుడతను పోలీస్ ఇన్‌స్పెక్టర్ అని అతని దుస్తులని బట్టి తెలిసిపోతోంది.

**(ఇంకావుంది)**

జస్ట్‌ఫర్‌ఫన్

## "ఇంద్రవరం"



తెలుగువాడు అయిన సుబ్బారావుకి ఓ బ్రహ్మీముహూర్తాన బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది. తన పేరు తెలుగువారి గుండెల్లో శాశ్వతంగా నిలిచి పోయేలా ఏదన్నా మహత్తర కార్యం చేయాలి అని. తండ్రి ద్వారా వచ్చిన ఆస్తి చాలా వుంది. కానీ ఏం చేయాలో తెలియటం లేదు. సరే ఓ రోజున వూరి బయట కొండపై తపస్సు ప్రారంభించాడు. వెంటనే పనిలేని ఇంద్రుడు 'డింగ్'న ప్రత్యక్షం అయి "ఏం కావాలి" అని అడిగాడు..

సుబ్బారావు తన మనస్సులోని కోరిక చెప్పాడు.

"సి.యం. అవుతావా?"

"వద్దు వద్దు స్వామి ఆ పదవి 20 ఏళ్ళదాకా ఖాళీ అయ్యే అవకాశం కనుచూపు మేరలో కనిపించటం లేదు"

"ప్రతిపక్ష నాయకుడువి అవుతావా"

"అంత 'వైస్సు' లేదు స్వామీ!"

ఏం వరం యివ్వాలో యింద్రుడికి అర్థం కాక కిరీటం తీసి బుర్రగోక్కున్నాడు.

అప్పుడు తట్టింది సూపర్‌రిన్ మెరుపులా ఓ ఐడియా!

"భక్తా! యింతవరకు ఏ భక్తుడికి యివ్వంది నీకు యిస్తున్నాను. ఓ ఉచిత సలహాలాంటి వరం" అన్నాడు.

"శలవియ్యండి స్వామీ!"

"తెలుగు ఛానల్‌కి ఓ ధారావాహిక డైలీ సీరియల్ (ఏడ్పుగొట్టుది) ప్రారంభించు. అది ఎప్పుడు పూర్తి అవుతుందో తెలియదు కాబట్టి - ఆ సీరియల్ వస్తున్నంతకాలం ప్రేక్షకుల గుండెల్లో నొప్పిలా కలకాలం నిలిచిపోతావు" అని వరమిచ్చి 'డింగ్'న మాయం అయ్యాడు ఇంద్రుడు.

-"క్రోక్విల్" నరసింహం

# పద్మనాభం



# ఆత్మకథ

**భయంతో రైలు దిగి అటూ ఇటూ చూస్తూ బయటికి ఎలా వెళ్లాలని ఒకాయనను అడిగాం. 'యిప్పడి పోంగోడా' అని అరవంలో చెప్పి గేటు చూపించాడు. గబగబా గేటుదాటాం. 'హమ్మయ్య' అనుకున్నాం. రోడ్డుమీద ట్రాములూ కార్లూ వేగంగా వెళ్తున్నాయి. మా దగ్గర 6 అణాలు వున్నాయి. వెలింగ్టన్ టాకీసు మౌంటురోడ్‌లో వున్నది. నేను, సుదర్శనం ట్రాం ఎక్కాం. వెలింగ్టన్ దగ్గర దిగాం. మేనేజర్‌ను పరిచయం చేసుకొని ఫ్రీగా 'కృష్ణప్రేమ' 9 గంటల ఆట చూస్తూ మధ్యలోనే హాలులో నిద్రపోయాం. సినిమా అయింది. మేమిద్దరం నిద్రపోతుండడం వాచ్‌మెన్ చూసి తిడుతూ మమ్మల్ని లేపాడు. బయటకు వచ్చాం.**

## సీరియల్ 3

అర్ధరాత్రి. ఎక్కడికెళ్ళాలో దిక్కుతోచడం లేదు. దగ్గర్లో ఒక షాపువరండాలో మేము తెచ్చుకున్న బట్టల సంచులు తలకిందపెట్టుకొని నిద్రపోయాము. 5 గంటల సమయంలో పోలీసులు వచ్చి మమ్మల్ని లేపి (యారుడా నీంగ? ఎవర్రా మీరు? ) అని అడిగారు. 'మాది సింహాద్రిపురం.



'అదృష్టవంతులు'లో నాగేశ్వరరావు, జయలలితలతో

సినిమా యాక్టర్ కన్నాంబగారినీ అందరినీ చూసి సైకిల్ కొనుక్కుందామని వచ్చాం. తెల్లవారగానే పోతాం సార్' అని చెప్పాం. 'యింగె పడుతకూడాదు పోంగో' (ఇక్కడ పడుకోకూడదు. పొండి) అని లాఠీలు వూపుకుంటూ వాళ్ళు పోయారు.

ఉదయం 6 గంటలు కాగానే జెమినీ స్టూడియో అడ్రసు అడిగాం. ఎందుకంటే కాంచనమాల 'బాలనాగమ్మ' చాలాసార్లు చూశాం, అందులో బాలనాగమ్మ కొడుకుగా వేసిన మాస్టర్ విశ్వం ఫ్యాన్స్ మేము! జెమినీ స్టూడియోలోనే 'బాలనాగమ్మ' తీశారు. జెమినీ స్టూడియో ఉండే ఏరియా నీళ్ల కొళ్ళాయి దగ్గర స్నానం చేసి బట్టలు మార్చుకొని బయలుదేరాం.

జెమినిలో అందరూ హడావిడిగా వున్నారు. కన్నాంబగారి అడ్రసు అడిగాం. టి.నగర్ మలాని వీధి హిందీ ప్రచారసభ దగ్గర ఇంటి నెంబరు 7 అని చెప్పారు. ఎర్రటి ఎండ. మధ్యాహ్నం 12 గంటలు కాళ్ళు కాలుతున్నాయి, యివన్నీ మాకు లెక్కలేదు. ఎందుకంటే ఇక కొద్దిసేపట్లో 'చండిక' సినిమాలో గుర్రం స్వారీ చేస్తూ కత్తి తిప్పుతూ అద్భుతంగా పాడి నటించిన మహానటి కన్నాంబగారిని చూస్తాం!

కన్నాంబగారి యిల్లు చేరాం, బయట వరండాలో కూర్చున్నాం. ఆమె గొంతు వినపడుతూవుంది. ఎందుకో ఆమె వరండాలోకి వచ్చి 'ఎవరు నాయనా మీరు' అని అడిగింది. ఆమెను దగ్గరగా చూడగానే ఆశ్చర్యంతో కొన్ని సెకండ్లు అలా నిశ్చేష్టులమై వుండి పోయాం. సాక్షాత్తు ఆమె మాకు దేవతలా కనిపించింది. తరువాత తేరుకొని అమ్మా 'మేము బ్రాహ్మలం . ప్రొద్దుటూరులో చదువుకుంటున్నాం. మా నాన్నగారు కరణం శేషయ్య, మా అమ్మ శాంతమ్మ. మీ సినిమా 'చండిక' చాలాసార్లు చూశాం. మీరంటే మాకు చాలా ఇష్టం. మీ దగ్గర సినిమా పాటలు పాడి డబ్బులు సంపాయించుకొని సైకిల్ కొనుక్కుందామని వచ్చాం' అని చెప్పాం.

'మీరు భోంచేశారా' అని అడిగారు. 'ఓ రోజైంది భోంచేసి' అనగానే ఆమె మమ్మల్ని లోపలికి తీసుకువెళ్లి ఆకులువేసి అన్నంపెట్టారు. 'మీరు మాంసం తింటారా' అని అడిగారు. మేము 'బ్రాహ్మలం అమ్మా! మాంసం తినం అని చెప్పాం. ఆమె నవ్వి 'నిదానంగా తినండి నాయనా' అని అన్నారు.

భోజనాలయ్యాక ముందు నన్ను పాడమన్నారు. శ్రీ చిత్తూరు నాగయ్య గారు 'సుమంగళి'లో పాడిన పాట 'దయామయముగా నీమది దేవా దీనుల మొరవినలేవా, దీనుల మొరవినలేవా, పాలుత్రాగు పసికూనల గొంతుకు తాళి గట్టమనినారా, ఋణము తీరి పతులీ భువి బాసిన దోషులు ఈ పసివారా, దయా మయముగా నీమది దేవా దీనుల మొరవినలేవా, దీనుల మొరవినలేవా'' అని నా సన్నని గొంతుతో పాడిన ఆ పాటవిని చప్పట్లుకొట్టారు. తరువాత సుదర్శనరావు పాడాడు. ఇద్దరినీ సాయంకాలం 5 గంటలకు రాజరాజేశ్వరి ఆఫీసు, కృష్ణారావునాయుడు వీధి ఇంటి నెంబరు 7కు రమ్మన్నారు.

ఆమె చెప్పిన విధంగానే అక్కడకు వెళ్లాము. 1943లో రాజరాజేశ్వరివారు కడారు నాగభూషణంగారి దర్శకత్వంలో 'పాదుకా పట్టాభిషేకం' తీస్తున్నారు. నిర్మాత కన్నాంబగారు. అందులో తారాగణం

సి.యస్.ఆర్ గారు శ్రీరాముడు, లక్ష్మణుడు కొచ్చెర్ల కోట సత్యనారాయణ, వాల్మీకి శ్రీ కె. రఘురామయ్య, పారుపల్లి, కౌసల్య శ్రీమతి దాసరి కోటరత్నంగారు, సుమిత్ర అన్నపూర్ణమ్మ , కైకేయి కన్నాంబగారు. వీరందరూ ఆరోజు ఆఫీసుకొచ్చారు.



అనుకోకుండా జగజ్జట్టీలైన సినిమా తారాగణాన్ని ఒక్కసారి చూసే భాగ్యం మాకు కలిగింది. కన్నాంబగారు మమ్మల్ని నాగ భూషణం గారికి, అందరికీ పరిచయం చేసారు. వీళ్లు బాగా పాడుతారు అనగానే అందరూ పాడమన్నారు. అద్దంకి గారు దశరథుడుగా యాక్టు చేస్తున్నారు. వారిని చూడగానే 'కృష్ణప్రేమ' గుర్తుకొచ్చింది. అద్దంకి, భానుమతిగారి పాటను పాడుతూ అనుకరించి డ్యాన్సు చేయడంతో అందరూ చప్పట్లు కొట్టి మెచ్చుకున్నారు. 'వీడెవడో మంచి యాక్టరు అవుతాడ'ని సి.యస్.ఆర్ గారు అన్నారు. కన్నాంబగారు 'నీవు మాకంపెనీలో వుండు, మీ అమ్మానాన్నకు ఉత్తరం వ్రాయి. ఏం వుంటావా?' అని అడగ్గానే యిద్దరం వుంటామని చెప్పాం. భోజనానికి భారత్‌కేఫ్‌లో నెలవారి టికెట్లు యిచ్చారు.

లింగం సుబ్బారావు అని ఎక్స్‌ట్రా సప్లయిర్. మద్రాసుకు కొత్తగా సినిమాలో చేరాలని వస్తే ఈయనే అందరికీ పరిచయం చేస్తారు. సుదర్శనను ఘంటసాల బలరామయ్య గారికి పరిచయం చేశాడు. 'సీతారామ జననం'లో రాముడికి స్టిల్స్ తీసారు. 'బాగున్నాడు రేపు ఎగ్రిమెంటు చేస్తానని' బలరామయ్యగారు చెప్పారు. కానీ సుదర్శన ఆ ఛాన్సు వినియోగించుకోలేదు. ఎందుకంటే చిన్నప్పటినుంచి కరెంటు అంటే సుదర్శనకు భయం! కెమెరాలు కరెంటులాగుతుంది అని భయపడి 'నేను ఊరికి వెళ్లి పోతాను' అని వెళ్లి పోయాడు. నేను మాత్రం ఉండి పోయాను. అందువల్ల నాకో చిన్న ఛాన్సు దొరికింది.

శ్రీ రాజరాజేశ్వరి "పాదుకా పట్టాభిషేకం" గుహుడి పాట

**'పడవెళ్లి పోతోంది. వడివడిగా సాగి**
**పడవలో వున్న ప్రభువు పదిలంగా చేరాల**
**శ్రీరాములోరి ఎంట సీతమ్మ కూరుచుండ**

## డాక్టర్ చక్రవర్తి

రచన: కొసరాజు     నేపథ్యం: పి.బి.శ్రీనివాస్, ఎస్. జానకి

స్వామి : ఒంటిగ సమయం చిక్కిందీ!
కంటికి నిద్దుర రాకుంది!
మనకూ మనకూ ఇనుపగోడవలె!
తడికె అడ్డమై కూచుంది!

పద్మ : ఒంటిగ సమయం చిక్కిందా!
కంటికి నిద్దుర రాకుందా!
మనకూ మనకూ మనసులు కలిసిన!
తడిక అడ్డమై కూచుందా!

స్వామి : ఇంటింటా ఒక ముసలి ఘటం
ప్రేమికులకు అది పెనుభూతం
కదిలితే భయం మెదిలితే భయం
ఎన్నాళ్ళో యీ ఇరకాటం ॥ఒంటిగ॥

పద్మ : పెద్దతలొక్కటి వుంటేనే
హద్దుపద్దులో వుంటాము
ప్రేమ ముదిరితే పిచ్చి రేగితే
పార్కులో మళ్ళీ సరిగమలే ॥ఒంటిగ॥

స్వామి : ఎటుల భరింతును యీ విరహం
ఒట్టి చూపులతో ఏమి ఫలం!
అమ్మ వచ్చినా అరచి చచ్చినా
విడువలేను యీ అవకాశం ॥ఒంటిగ॥

పద్మ : గుట్టుగసాగే సరసాన్ని
రట్టు చేయకోయి నా సామీ
తడిక దాటినా దుడుకు చేసినా
తప్పదు మనకు తదిగిణతోం
అమ్మచేతిలో తదిగిణతోం ॥ఒంటిగ॥



ఈ సినిమాలో సూర్యకాంతం కూతురు జయంతి. తన ఇంట్లో కొంత పోర్షన్‌ను చలంకి అద్దెకి ఇవ్వడమే కాక అతడిని తన కూతురికిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటుంది సూర్యకాంతం. ఈ సంబంధం జయంతికి ఇష్టం ఉండదు. అటువంటి సమయంలో పద్మనాభం రంగంలోకి ప్రవేశిస్తాడు. అతడు పూర్వాశ్రమంలో చలంకి ఫ్రెండ్. హార్మోనిస్టు, పైగా పాటగాడు కావడంతో యస్.రాజేశ్వరరావు ట్యూన్ చేసిన 'తుమ్మెదా ఒక్కసారి మోమెత్తి చూడమని చెప్పవే నా మాట రాచిలుక తోడా' అనే ప్రైవేటు గీతాన్ని పాడుతూ జయంతిని ఆకర్షిస్తాడు. రెండు పోర్షన్‌లని సెపరేట్ చేసే తడికకి రంధ్రం చేసి, జయంతితో ప్రేమాయణం సాగిస్తూ ఉంటాడు పద్మనాభం. ఈ వ్యవహారం బయట పడకుండా ఆ రంధ్రానికి అటో క్యాలెండరు ఇటో క్యాలెండరు పద్మనాభం జయంతి తగిలిస్తారు. 'అక్కడెందుకు క్యాలెండరు పెట్టావమ్మా' అని సూర్యకాంతం అడిగితే 'స్వామికి దండం పెట్టుకోవడానికి' అని చెప్తుంది జయంతి. అప్పుడు ప్రేక్షకులు సరదాగా నవ్వుకుంటారు. ఎందుకంటే ఈ చిత్రంలో పద్మనాభం పేరు స్వామి కనుక. ఒకానొక రోజు ఒంటిగా సమయం చిక్కినప్పుడు జయంతితో పద్మనాభం అభినయించిన యుగళ గీతమిది.

**తోడులక్ష్మణస్వామి నీడల్లే నిలుచుండ**

**పడవెళ్ళి పోతోంది హైలేసా హైలెసొ'**

జెమినిలో రికార్డింగు. యిందులో హైలేసా హైలేసా కోరస్‌లో నాకు పాడే అవకాశం దొరికింది.

కన్నాంబగారితో చెప్పి దాసరి కోటిరత్నంగారు, రఘురామయ్యగారు ఆర్కాట్ మొదలియార్ వీధి నెంబరు9 యింటికి తీసుకువెళ్లారు. తమ స్వంత కొడుకులా ఆదరించారు. లింగం సుబ్బారావు గారి ద్వారా శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు పరిచయం అయ్యారు. సైకిల్ మీద నన్ను రాయపేట తీసుకెళ్లారు. రామబ్రహ్మంగారు అక్కడ నర్సింగ్‌హోంలో వున్నారు.

'మాయలోకం' సినిమాలో శబంది రాజుకు ఏడుగురు కొడుకులు. వారిలో నేను మొదటివాణ్ణి (పెద్దవాడయితే సి.యస్.ఆర్‌గారు అవుతారు.) ఏడవ చిన్నవాడు పెద్దవాడయితే (నాగేశ్వరరావుగారు) శరాబందిగా అవుతారు.



'కులగోత్రాలు'లో సంధ్య, రమణారెడ్డిలతో....

నా గగ్గయ్యగారి ఇమిటేషన్ పాటను విని రామబ్రహ్మంగారు ఎంతో ఆశ్చర్యపోయి సంతోషించారు. ఆశీర్వదించి నాకు నెలకు 40రూపాయలు జీతం ఇమ్మన్నారు.

'మాయలోకం' న్యూటౌన్ కీల్‌పాక్‌లో షూటింగ్ ప్రారంభమయింది. శ్రీ యిటూరి వెంకటేశ్వరరావుగారు అసోసియేట్ డైరెక్టర్. సంగీతం గాలి పెంచల నరసింహారావుగారు, అసిస్టెంట్ శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారు, స్టిల్స్ మన సత్యం, కెమెరా శ్రీ రెహమాన్‌గారు. తారాగణం - శ్రీ డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు, సి.యస్.ఆర్., ఎ. నాగేశ్వరరావు, శ్రీమతి కన్నాంబ, శాంతకుమారి, రాజమ్మ, గోవిందమ్మ, (టి.జి.కమల) శ్రీ వేదాంతం రాఘవయ్య, డ్యాన్స్ డైరెక్టర్ ఎస్.వి.రామారావు - గారు అందరూ హేమాహేమిలే.

ప్రతిదినం వుదయం తేనాంపేటలో వున్న సారథి ప్రొడక్షన్‌లో శ్రీ గాలిపెంచల నరసింహారావుగారి సంగీతంలో ప్రార్థన 'జయజయ విజయ సారధీ, జయ, జయ, జయ విమల దయా జలనిధే, జయ జయ విజయ సారధీ, ఘటనా ఘటన ప్రవీణ ఆది దేవనారాయణ, విజయ దయా జలనిధే విజయ సారధే! విజయ సారధే ॥జయ జయ॥

పాట రికార్డింగు. కోరస్‌లో పాల్గొన్నాను. మైకు ముందుగా సౌండ్ ఇంజనీర్ దిన్షాగారు నన్ను నిలబెట్టి మైకు టెస్టుకోసం పాడమన్నారు. అంతే గొంతెత్తి పాడాను. వాయిస్ చెవులు బద్దలయ్యేటట్లు వినిపించగానే, గట్టిగా చెవులు మూసుకుని "యూ బ్లడీ ఫెలో" అంటూ అరుస్తూ వచ్చి నన్ను ఎత్తుకొని అందరి కంటే చివరలో నిలబెట్టాడు దిన్షాగారు.

కొంత షూటింగ్ జరిగాక రామబ్రహ్మం గారు శ్రీమతి శారదమ్మ, జరిగినంతవరకు షూటింగ్ రషెస్ చూడడానికి నన్ను కూడా తీసుకెళ్లారు. తెరపైన నా బొమ్మ కనపడగానే చెప్పలేనంత ఆనందం, అపూర్వమైన అనుభూతి కలిగింది. మా గ్రామంలో చూసిన డేరా సినిమా గుర్తుకొచ్చింది.

40/- రూపాయలు జీతమిస్తూ "ఇది ఏం చేస్తావు" అని అడిగారు రామబ్రహ్మం గారు. "అమ్మా నాన్నకు 30 రూపాయలు మనియార్డరు పంపుతాను. 10 రూపాయలు నేను వుంచుకుంటానని" చెప్పాను, హాఫ్ నిక్కరులో వున్న జేబీలో డబ్బు పెడుతూ! "రాస్కెల్ నిన్ను హీరోను చేస్తారా" అని ముద్దుగా అనేవారు ఆయన. చిన్న చిన్న పనులు నాచేత చేయించుకునే వారు. నాకు షూటింగ్ వున్నా లేకపోయినా వారితోనే వుండేవాణ్ణి! గోవిందరాజుల సుబ్బారావు గారిని, సి.ఎస్.ఆర్‌గారిని యిమిటేషన్ చేస్తుంటే రామబ్రహ్మం గారు, శారదమ్మా తెగ నవ్వేవారు.

ఫొటో కర్టెసీ: సంజయ్ కిషోర్

**(- ఇంకా వుంది)**



'వెలుగునీడలు' లో ఓ దృశ్యం

అన్నపూర్ణా వారి "వెలుగునీడలు" (1960) చిత్రం షూటింగు వాహినీ స్టూడియోలో జరుగుతోంది. నాగేశ్వరరావు గారు, సావిత్రి, వారి మిత్రమండలి అందులో పాల్గొన్నారు. మిత్రుల్లో నటుడు సారథి ఒకరు. దర్శకులు ఆదుర్తి వూహించిన మేరకు అతను నటించలేక పోతున్నాడు. టేకు తర్వాత టేకు తీస్తున్నారు. కాని ప్రయోజనం లేక పోతోంది.

ఇంతలో నటుడు పద్మనాభం గారు - వారి మిత్రులకు స్టూడియో చూపించడానికి వచ్చి - షూటింగు చూపించడానికి సెట్‌లోకి వచ్చారు. వారిని చూడగానే నిర్మాత, దర్శకులకు ప్రాణం లేచి వచ్చింది.

"ఏమయ్యా! పద్మనాభం! రేపు ఎల్లుండి నువ్వు ఖాళీయేనా?" అని అడిగారు నిర్మాత మధుసూదనరావుగారు.

"ఈ వారం అంతా ఖాళీయేనండి" అన్నారు పద్మనాభం.

"బతికించావు. నీ డ్రస్సు కూడా బాగుంది. (అప్పుడు ఆయన నీలం రంగు శాటిన్ ప్యాంటు, బుష్‌కోట్ వేసుకున్నారు) సరే! రా" అన్నారు దర్శకుడు ఆదుర్తి.

సారథి కొంచెం వెనక్కి వెళ్లారు. అయన స్థానంలోకి పద్మనాభం వచ్చారు. (అంతకుముందు తీసిన లాంగ్‌షాట్‌లో పద్మనాభం గారు లేరు) ఆ విధంగా సారథి స్థానంలోకి పద్మనాభం ప్రవేశించి చిత్రం పూర్తయ్యేవరకు నటించారు.

***

ఆ తర్వాత భక్తకన్నప్ప చిత్రంలో మొదట ఒక పాత్రకు పద్మనాభం గారిని అనుకున్నా షూటింగ్ తేదీలు కుదరక, ఆ పాత్రను సారథి ధరించారు.

**- స్వామిచిత్రానంద**

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు




✸అమృత - విశాఖ

ప్ర॥ చరిత్రలో లేని రాజ్యం?

జ॥ ఇష్టారాజ్యం

✸కోట ప్రవీణ్ - మచిలీపట్నం

ప॥ విత్తనాల షాపు ఓనరు అదిరిపడేదెప్పుడు?

జ॥ షాపుకొచ్చిన కష్టమరు 'అనుమాన బీజాలు ఉన్నాయా' అని అడిగినప్పుడు.

✸పి.గిరి, హైదరాబాద్

ప్ర॥ ఎమ్సెట్లు, సంవత్సరాల తరబడి చదువులు లాంటివి ఏవీ లేకుండా డైరెక్ట్‌గా డాక్టర్నవ్వాలని వుంది... ఎలా?

జ॥ వెరీ సింపుల్... బాగా తెలిసిన డాక్టర్ వుంటే ఆయన దగ్గరికి వెళ్లి చేతిలో సిరంజి లేని టైమ్‌లో కితకితలు పెట్టండి. అప్పుడు డాక్టర్నవ్వాలన్న మీ కోరిక తీరుతుంది.

## పేరు - రిపేరు




(1) చిరంజీవి - చిత్రం

- ఇంద్ర -

చూడాలనివుంది

-బి.విశ్వజ,

జవహర్‌కాలనీ

(2) తాజ్‌మహల్ - చిత్రం

- రామానయుడు - సొంతం

-బి.చైతన్య, రుద్రారం

(3) ప్రియమైన నీకు- ఇదే నా మొదటి ప్రేమలేఖ -

చిరునవ్వుతో - బడ్జెట్‌పద్మనాభం

-తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం



## డబుల్ రోల్



(1) వాళ్ళు పార్టీని ఏ 'రేంజ్'లో 'అరేంజ్' చేస్తున్నారో కొంచెం ఎంక్వైరీ చెయ్యి

(2) మా వాడికి సినిమాల మీద 'యావ' ఎక్కువై చదువులో 'యావరేజ్'గా ఉంటున్నాడు.

-బి.సత్యనారాయణ, ఖతార్

(3) ఆ'గని' దగ్గర కొందరు కూలీలు పనిని సరిగ్గా 'సాగని'వ్వటం లేదు.

- గౌతమ్ అండ్ కాశ్యప్, విశాఖ

## చిలిపి లిపి




Come King = రా రాజు

- వరదా సాయికుమార్

పర్లాకిమిడి (ఒరిస్సా)

Lotus Miss = కమల కుమారి

- మాధవీ సనారా

ఖరగ్‌పూర్, (వెస్ట్‌బెంగాల్)

VJM = విజయం

- శ్రీనివాసరెడ్డి, లట్టుపల్లి

కొంగరకలాన్

## ఈ రూటే వేరు




షోరూం - గది చూపించు

నైపుణ్యం - పుణ్యం లేదు

- బి.వి.రావు, రుద్రారం

పంచపాన్‌డవులు - పంచలు మరియు పాన్‌ల వ్యాపారం చేసేవారు.

-యు.విజయశేఖరరెడ్డి, హైదరాబాద్

## రాబోయే రోజుల్లో చూడబోయే సినిమాలకి టైటిల్స్

1. అవును... వాళ్ళిద్దరికీ వీసా వచ్చింది.
2. హెచ్ 1 అమ్మాయి హెచ్‌ఐవి అబ్బాయి.
3. వైరస్ మొగుడు - సైబర్‌పెళ్ళాం.
4. సైబర్‌సేనారెడ్డి.
5. ఇంట్లో రాముడు - ఇంటర్‌నెట్‌లో కృష్ణుడు.
6. ఉండమ్మా! కంప్యూటరు నేర్పుతా!
7. మోడెం మొగుడు - పైరసీ పెళ్ళాం.
8. ఛాటింగ్ రాముడు.
9. శ్రీవారికి ఈమెయిల్.
10. నాకూ వీసా కావాలి.
11. సెప్టెంబరు 11 విడుదల
12. వీసానా? మజాకా?
13. నీ ఈ మెయిల్ - నా పాస్ వర్డ్
14. కీ బోర్డు బుల్లోడు



-బి.వి.ఎస్.ప్రశాంత్,

సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, సిన్సినాటి (యు.ఎస్.ఎ).

## చిలిపి కవిత



పోటు భరించలేక
ఆసుపత్రి ముందు
చెవిపట్టుక్కూర్చున్నా
వీడికి సెల్ ఉన్నట్టుందని
డాక్టర్ చెవిలో ఊదాడేమో
ఆ కాంపౌండర్....
దెబ్బతో డాక్టర్
వేసిన బిల్లుకి
సెల్లాడిపోయా

-భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్

## పేరడీ పేరేడ్

అతడు : తామర వచ్చింది దురదే పుట్టింది నలుగురిలో నాకు సిగ్గేసింది
ఆమె : తామర వచ్చిందా దురదే పుట్టిందా నలుగురిలో
నీకు సిగ్గేసిందా
అతడు :ఈ దురద నాకు ఇక
మానేదెట్టాగా
గురకెట్టి
రాత్రి నిదరోయేదెట్టాగా
అబ్బా మంటే మంట
ఒళ్ళేమంట
కిందా మీదా అంతా
మంటా
అబ్బబ్బాఈ
దురదతో ఏమొచ్చే
తంటా ॥తామర॥



అతడు : స్నేహితులంతా చుట్టాలంతా ఛీ కొట్టి దూరంగా ఉంటే ఎలా
ఆమె : బీటెక్సు ఇచ్‌గార్డు జాలిమ్‌లోషన్ గిప్పుగా నీకు నేను ఇస్తానులే
అతడు : గత జన్మలో పాపమేమో గానీ ఈ జన్మలో దురదగా బాధిస్తోంది
గోకీ గోకీ గోళ్ళరిగెలే అవి పెరగడానికి మందులు లేవే
ఆమె : అరె జీతం అంతా మందులకేనా సంసారానికి సున్నాయేనా
దురదకు బదులు నే నిన్నొదిలిపోతా
అతడు : తామర వచ్చింది దురదే పుట్టింది
నలుగురిలో నాకు సిగ్గేసింది
భార్యొదిలేసింది ఛీ కొట్టేసింది
నా పరువు గంగలో కలిపేసింది.

పర్లాకిమిడి నుంచి వరదా సాయికుమార్ పుట్టించిన ఈ దురద పాటకి మూలం 'ఇంద్ర' సినిమాలో 'రాధే గోవిందా' పాట.

## హాస్యవల్లరి సంగీతలహరి



# కిశోర్ జీవనఝరి

- ఎమ్మెస్ స్వాతి



అక్టోబరు 13, 1987.

అశోక్‌కుమార్ 76 వ పుట్టిన రోజు. కానీ అశోక్‌కుమార్ పుట్టిన రోజు జరుపుకునే మూడ్‌లో లేడు. ఆర్నెల్ల క్రితమే అతని భార్య పోయింది.

ఏప్రిల్ 1987లో కిశోర్‌కుమార్ బొంబాయిలో ఒక షో ఇస్తున్నాడు. వేదిక మీదకు వెళ్లబోతుండగా నిర్వాహకులు పక్కకు పిలిచారు. "సార్, బ్యాడ్ న్యూస్" అని. "ఏమిటో చెప్పండి. దాదామొని (ప్రియమైన అన్నయ్య అని అర్థం. అశోక్ కుమార్‌ని స్వంత తమ్ముడు కిశోరే కాదు, ఫిల్మ్ ఇండస్ట్రీ అంతా అలా పిలుస్తుంది) గురించి అయితే నేను ప్రోగ్రాం కాన్సిల్ చేసుకుని వెళ్లిపోతాను" అన్నాడు కిశోర్.

"ఆయన కాదు... మీ వదినగారు... పోయారట" అన్నారు వాళ్లు.

అశోక్‌కుమార్ భార్య శోభా మూత్రపిండాల వైఫల్యం కారణంగా అప్పటికే హాస్పటల్‌లో ఉంది. పది రోజులుగా కోమాలో ఉండి ఆనాడు కన్ను మూసింది.

ప్రోగ్రాం ముగించుకొని అన్నగారి ఇల్లు చేరేసరికి చీకటి పడుతోంది. అశోక్‌కుమార్ మంచం మీద కూచుని దిండుకి తల ఆన్చి దిగాలుపడి కూచున్నాడు. కిశోర్ ఒక కుర్చీ లాక్కొని అన్నగారికి ఎదురుగా కూచున్నాడు. క్రమంగా చీకటి ఆవరిస్తోంది. దీపాలు వేయాలని కూడా ఎవరికీ తోచలేదు.

అన్నగారి ముఖంలోకి చూశాడు కిశోర్. ఎలా ఓదార్చడం? తనకంటె 18 ఏళ్లు పెద్దవాడు. తండ్రి తర్వాత తండ్రి అంతటివాడు. చదువు చెప్పించాడు. చదువు అబ్బకపోతే సినిమాల్లో పెట్టించాడు. సినిమాల్లో నటనపై ఆసక్తి చూపకపోతే చివాట్లు వేసి సరైన మార్గంలో పెడదామని చూశాడు. యాక్టరుగా కెరియర్ ముగిసి పోయి ఇబ్బంది పడుతూంటే స్టేజి షోలు ఇమ్మని చెప్పి ప్రోత్సహించాడు. అడుగడుగునా తన జీవితానికి మార్గదర్శకత్వం వహించే పెద్దన్నగారిని, ఆరిందాలా భుజం తట్టి పెద్దతరహాగా వైరాగ్యం బోధించడం ఎలా?

కిశోర్ మాటలాడ లేదు. పాట పాడాడు. 'యే జీవన్ హై ఇస్ జీవన్‌కే యహీహై రంగ్, రూప్' అనే 'పియాకాఘర్' సినిమాలో పాట. ఒకసారి కాదు. పదేపదే పాడాడు. అన్నగారు అతన్ని ఆపలేదు. అది అశోక్‌కుమార్‌కి ఇష్టమైన పాట.

రెండు గంటలపాటు అలా పాడుతూనే వున్నాడు కిశోర్. తన చేతులతో ఎత్తి ఆడించిన చిన్నారి తమ్ముడి వాయిస్‌లో పలికిన వేదం, దుఃఖం అశోక్ కు కాస్త ఊరట కలిగించింది.

కిశోర్‌కి 6 సం॥ల వయస్సులో సడన్‌గా అతని గొంతు బొంగురుపోయింది. దానికి కారణం వాళ్లింట్లో ఆయా. కిశోర్‌కి పంటి నొప్పి వస్తే ఏదో పసరు తెచ్చి ఇగుళ్లకు పూసింది. దానివల్ల ఇన్‌ఫెక్షన్ వచ్చి గొంతుకు పాకింది. కిశోర్ గొంతు బొంగురుపోయింది. గొంతులో గరగర వచ్చేది. ఆ వాయిస్ విని ఇంట్లో అందరూ ముందు ఖంగారు పడ్డారు. నెలల తరబడి అలాగే

ఉండడంతో క్రమంగా అలవాటు పడ్డారు. కిశోర్ వాయిస్ ఎలా వుంటే ఏం పోయిందిలే అనుకున్నారు. కిశోర్ గొంతులో ఆ రఫ్‌నెస్ అలాగే వుండిపోయి, అతడు గాయకుడు కాలేక పోయేవాడేమో, ఈ మధ్యలో ఓ అద్భుతం జరగకపోయి వుంటే!

ఓ రోజు ఆటల్లో కిశోర్ కాలికి దెబ్బ తగిలింది. గాయం మరింత పెద్దదయి భరించలేని బాధ కలిగించింది. ఆ బాధ సహించలేక కిశోర్ ఏడవ నారంభించేడు. అలా బిగ్గరగా ఏడుస్తూ రోజంతా - పగలూ రాత్రీ ఏకధాటీగా ఏడ్చాడు. ఏడవడంలో కూడా గొంతెత్తి, ఫుల్‌త్రోటెడ్‌గా ఏడ్చాడు. తల్లీ, తండ్రీ ఎంత ఊరుకోబెట్టినా ఊరుకోలేదు. మిఠాయి ఇచ్చినా, మందు ఇచ్చినా, ఆ ఏడుపు ఆపలేదు. ఆశ్చర్యకరంగా ఆ ఏడుపు అతనికి మేలు చేసింది. అంత గట్టిగా ఏడవడంతో, గొంతు విప్పారింది. ఇంతకు ముందు అడ్డుకునేట్లు ఉండేది పోయి బొంగురుతనం పోయి వాయిస్ క్లియరయింది. శ్రావ్యత వచ్చింది. ఆ వాయిస్‌తో అతను అనేక ఆటలు ఆడుకున్నాడు. యోడెలింగ్ వంటి గమ్మత్తులు ఎన్నో అతి సునాయాసంగా చేశాడు.

బయట వాళ్లకి కిశోర్ తన వాయిస్ గురించి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నట్లు కనబడేది కాదు. అతను మహా భోజనప్రియుడు. వాయిస్ కాపాడుకోవడానికి తిండి తగ్గించేవాడు కాదు. మత్స్యం, మాంసం, బజ్జీలు వంటి వేపుడు పదార్థాలు, పాలవిరుగు, కోవా వంటి స్వీట్లు - ఇవన్నీ ధారాళంగా తినేవాడు. ఓసారి పాట రికార్డింగుకు ముందు ప్రొడ్యూసర్‌ను పిలిచి "ఆకలేస్తుంది, తినడానికి ఏదైనా తెప్పించండి" అన్నాడు. ఏం కావాలంటే "వేడి వేడి పకోడీలు బోల్డు తెప్పించండి" అన్నాడు.



ప్రొడ్యూసర్ ఉలిక్కిపడ్డాడు. నూనె సరుకు తిని గొంతుక పాడు చేసుకుంటే పాట దెబ్బతింటుంది కదాని. అలా చెప్పకుండా "ఈ ఏరియాలో ఫ్రెష్ పకోడీలు దొరకవు" అన్నాడు. కిశోర్ వదిలి పెట్టలేదు. "అలా అయితే వేరేచోట నుండి తెప్పించండి. నేను వెయిట్ చేస్తాను" అన్నాడు. చచ్చాంరా దేవుడా అనుకుని కారు పంపించి, పకోడీలు తెప్పించి ప్లేటు నిండా అమర్చి కిశోర్ ముందు పెట్టారు. కిశోర్ ఒక్కోటి తీసి, లొట్టలు వేసుకుంటూ అన్నీ కానిచ్చాడు. చివరిలో "ఇప్పుడు స్వీటు తింటే బాగుంటుంది. పకోడీల ఆయిల్ గొంతుకి అడ్డుపడకుండా ఉంటుంది. కోవా తెప్పించండి. కాస్త ఎక్కువగానే తెప్పించండి' అన్నాడు.

ప్రొడ్యూసర్ గుండెల్లో రాయి పడింది. రికార్డ్ చేయవలసినది విషాద గీతం. ఈయన చూస్తే హాయిగా మెక్కుతున్నాడు. ఏం పాడతాడో యేమో? కానీ నోరెత్తి అడగలేడు కదా! మళ్లీ కారు పంపించి ఓ ముంతలో కోవా తెప్పించాడు. కిశోర్ అది కూడా లాగించాడు. తినేసి, బ్రేవ్‌మని తేన్చి, "పదండి, పాట రికార్డు చేద్దాం" అన్నాడు. ఆవాళ విషాదగీతం ఆలాపించిన కిశోర్ గొంతులో స్పష్టత చూసి నిర్మాత ముక్కు మీద వేలు వేసుకున్నాడు. అతని వాయిస్ క్వాలిటీ అలాటిది.



అన్నదమ్ముల అనుబంధం : లీనా, అశోక్‌కుమార్ భార్య శోభ, కిశోర్, అనూప్, అశోక్

తన అభిమాన గాయకుడు సైగల్ జీవితం నుండి కిశోర్ చాలా నేర్చుకున్నాడు. ముఖ్యంగా తాగుడు ఒక గాయకుడి జీవితాన్ని ఎలా నాశనం చేస్తుందో చూశాడు. అందుకే సిగరెట్లకు, డ్రింక్స్‌కు దూరంగా ఉన్నాడు.

గొంతు శుభ్రంగా ఉంచుకునేందుకు తమలపాకులు బాగా నమిలేవాడు. అతని గార్డెన్‌లో తమలపాకు మొక్కలు చాలా ఉండేవి. భోజనం కాగానే ప్రతీరోజూ తాజా ఆకులు నోట్లో వేసుకునేవాడు. ఆకులు మాత్రమే, దానిలో వక్కా, ఏలక్కాయలూ అవీ లేకుండా నమిలేవాడు.

తన భార్య పోయిన రోజు అశోక్‌కుమార్‌ను ఊరడించినది - కిశోర్ వాయిస్‌లో మార్దవమే!

## అశోక్ డబ్బుతో కిశోర్ చదువు

కిశోర్‌కి 4 సం॥ల వయస్సు వచ్చే సరికి అశోక్ సైన్సులో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసుకుని కలకత్తా చేరడం జరిగింది. అక్కడ న్యాయశాస్త్రం చదువుదామనుకున్నా విధి అతన్ని బొంబాయికి లాక్కెళ్లింది. చెల్లెలి భర్త శశధర్ ముఖర్జీ అక్కడ రికార్డింగు స్టూడియోలో సౌండ్ ఇంజనియరుగా పని చేస్తున్నాడు. బాంబే టాకీసులో టెక్నిషియన్‌గా చేరిన అశోక్ ఏడాదిలోపుగానే సినిమా హీరో అయి డబ్బు బాగా గడించడం మొదలు పెట్టాడు. కిశోర్ కుమార్ చదువు అంతంత మాత్రమయితే అతనికంటె 5 ఏళ్లు పెద్దవాడైన అనూప్‌కుమార్ అంత కంటె అధ్వాన్నం. పరీక్ష ఫెయిలయి, లయి కిశోర్‌ను అందుకున్నాడు. ఇద్దరూ కలిసి మెట్రిక్యులేషన్ పాసయి ఇండోర్ క్రిస్టియన్ కాలేజీలో చేరదామనుకున్నారు. అప్పటికి వాళ్ల తండ్రికి ముసలితనం వచ్చేసింది. లాయరుగా ప్రాక్టీసు తగ్గిపోయింది. తమ్ముళ్ల చదువుకి డబ్బు పంపుతానని అశోక్ ఆఫర్ చేశాడు.

1946లో అనూప్, కిశోర్ 2 ఏళ్ల కాలేజీలో ఇంటర్ పూర్తి చేశాక చదువు చాల్లే అనుకుని బొంబాయిలో అశోక్ ఇంటికి చేరారు. తల్లిదండ్రులు కూడా అక్కడికే చేరారు. అక్కణ్నుంచే కిశోర్ సినిమా రంగంలోకి వచ్చాడు.

అందుకే తన పుట్టినరోజు నాడు కిశోర్ ఇంటికి రమ్మనమని ఆహ్వానిస్తే ఆనందించాడు.

"దాదా, నువ్వు ఎలాటి మూడ్‌లో ఉంటావో నాకు తెలుసు. సాయంత్రం మా ఇంటికి వచ్చేయ్. నీకో స్పెషల్ గిఫ్ట్ ఇస్తాను" అన్నాడు కిశోర్.

"బాగానే వుంది. కానీ నాకు ఇవాళ కూడా సినిమా కాల్‌షీట్ ఉంది. మన్‌ఖుర్ద్‌లో షూటింగ్. మీ ఇల్లు చూడబోతే జుహూ. షూటింగ్ అయిన తర్వాత అంతదూరం రావడం కష్టం కదా" అన్నాడు అశోక్‌కుమార్.

"అయితే ఓ పని చేద్దాం. నేనే మీ ఇంటికి వస్తాను. వచ్చేటప్పుడు హృషీకేశ్ ముఖర్జీని వెంటబెట్టుకుని వస్తాను".

"మంచిది. ఆ పని చెయ్. సాయంత్రం అయిదున్నర కల్లా వచ్చేయండి." అన్నాడు అన్నగారు హుషారుగా.

"తప్పకుండా! వచ్చేటప్పుడు నీకోసం స్పెషల్ గిఫ్ట్ అన్నానుగా. అది కూడా తెస్తాను" అన్నాడు తమ్ముడు అంతకంటె హుషారుగా.

ఫోన్ పెట్టేసాక లీనా అడిగింది - "అంతప్రియమైన అన్నగారికి మీరు ఇవ్వబోయే స్పెషల్ గిఫ్ట్ ఏమిటి?"

"సస్పెన్స్! అది చూసి అందరూ ఆశ్చర్య పడిపోతారు. ఇప్పుడే చెప్పను." అన్నాడు కిశోర్ ముసిముసి నవ్వులు నవ్వుతూ.

సాయంత్రం అవుతూండగానే కిశోర్‌కు హార్ట్ ఎటాక్ వచ్చింది. ఇలాటి ఎటాక్‌లు వస్తే వాడడానికి గాను అశోక్‌కుమార్ అంతకుముందే ఓ మందు ఇచ్చి వున్నాడు.

అశోక్‌కుమార్‌కు హోమియో వైద్యం బాగా తెలుసు. అంతే కాదు, జ్యోతిష్యం కూడా తెలుసు. కిశోర్ జాతకం చూసి నీకు 58వ యేట గండం ఉంది అని చెప్పాడు. అది కిశోర్ మనసులో మెదులుతూనే ఉంది. గల్ఫ్‌లో మ్యూజిక్ ప్రోగ్రాం ఏర్పాటు చేయడానికి సన్నాహాలు జరుగుతున్నప్పుడు మ్యూజిక్ డైరక్టరు ఆనంద్‌జీతో "ఏమో, నేను ఎలా వుంటానో ఏమో, అసలుంటానో లేదో" అన్నాడు. ఆనంద్‌జీకి అర్థం కాలేదు. "ఏమిటిలా మాట్లాడుతున్నావ్?" అన్నట్టు చూశాడు. కిశోర్ సర్దుకుని "ప్రతీ మనిషి జీవితంలోనూ 58వ యేడు చాలా క్లిష్టమైనది అంటారు" అనేశాడు గానీ అన్నగారు చెప్పిన ప్రిడిక్షన్ చెప్పలేదు.

కిశోర్‌కు గుండె జబ్బు ఉంది. 1982లో బెంగాలీ పాటలు రికార్డు చేయడానికి కలకత్తా

## కిశోర్ జీవితాన్ని మలుపు తిప్పిన అశోక్ సలహా



కిశోర్ కుమార్ తలతిక్క మనిషి. సెట్స్ మీద పిచ్చిపిచ్చిగా ప్రవర్తించే వాడు. అన్నగారు అశోక్‌కుమార్ ఎంత హుందాగా, పెద్దమనిషి తరహాగా ఉండేవాడో కిశోర్ దానికి పూర్తిగా వ్యతిరేకం. పైగా వ్యక్తిగత వైవాహిక జీవితం చిందరవందర కావడంతో కిశోర్ ఆగడాలకు హద్దు ఉండేది కాదు. "హాఫ్ టికెట్" (1962) సినిమా నిర్మాణంలో ఉండగా కిశోర్ దర్శకుణ్ని నిర్మాతలను ఏడిపించుకుని తిన్నాడు. సెట్స్ పైకి వచ్చేవాడు కాదు. వచ్చినా బాసిం పట్టు వేసుకుని కూచుని "నాకివాళ మూడ్ లేదు" అనేవాడు. దర్శకుడు కాళిదాస్ జుట్టు పీక్కునేవాడు. కొంతకాలం భరించి, భరించి చివరికి ఓ రోజు గట్టిగా పోట్లాట వేసుకున్నాడు.

కిశోర్‌కు తిక్కరేగింది. "నేను షూటింగులో పాల్గొంటాను. కానీ ఓ షరతు! ఆ మూలనున్న చెత్తబుట్ట నెత్తిమీద పెట్టుకుని నువ్వు స్టూడియో చుట్టూ మూడుసార్లు రౌండ్ కొట్టాలి" అన్నాడు. గత్యంతరం లేక ఆ పని చేసినా కాళిదాస్ కుతకుతలాడిపోయాడు.

ఈ విషయం విన్న ఫిల్మ్‌ఫైనాన్సర్ కిషన్ ఛబ్రియా కూడా మండిపడ్డాడు. "ఈ పిచ్చోడికి ఎలా బుద్ధి చెప్పాలో నాకు తెలుసు. ముందు సినిమా పూర్తి చేద్దాం" అన్నాడు. సినిమా పూర్తయ్యాక మామూలుగా సైన్ చేయవలసిన కాగితాలతో బాటు ఒక తెల్ల కాగితం కూడా వాటిల్లో పెట్టేడు. చూసుకోకుండా కిశోర్ సంతకం పెట్టేశాడు. ఛబ్రియా ఆ కాగితంతో ఓ రసీదు తయారు చేసేడు.

1963లో ఆ రసీదు ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటుకు చేరింది. 1962-63 సంవత్సరానికి కిశోర్‌కుమార్ ఫైల్ చేసిన రిటర్న్‌లో ఆ రసీదులో ఉన్న మొత్తం చేర్చబడలేదు కాబట్టి కిశోర్ ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటును మోసగించినట్లే లెక్క!

ఓ రోజు తెల్లవారకుండానే ఇన్‌కంటాక్సు అధికారులు కిశోర్ ఇంటిపై దాడి చేశారు. నిద్రపోతున్న కిశోర్‌ను లేపి ఇన్‌కంటాక్సు ఆఫీసుకు లాక్కొచ్చారు. బ్రేక్‌ఫాస్ట్ కూడా చెయ్యనివ్వలేదు. జైల్లో పెట్టకుండా ఉండాలంటే 25,000 రూ॥లు తక్షణం డిపాజిట్ కట్టాలన్నారు. నిజానికి అప్పటికీ కిశోర్ వద్ద అంత డబ్బు లేదు. అతను సంపాదించిన దానిలో చాలా భాగం ఖర్చయిపోయింది. ఆపదల్లో కిశోర్ తలచుకునే మొదటిపేరు అన్నగారు అశోక్‌కుమార్‌దే! అదృష్టవశాత్తూ అతను ఇంటి దగ్గర దొరికాడు. వెంటనే వచ్చి ఇన్‌కంటాక్స్ కమిషనర్‌ను కలిశాడు. "మీ తమ్ముడి దగ్గర 25,000 లేదంటున్నాడు. నమ్మ శక్యంగా ఉందంటారా?" అన్నాడు కమిషనర్. ఇది కిశోర్ వేస్తున్న ప్రాక్టికల్ జోక్ అని అతని అభిప్రాయం.

అశోక్ కుమార్ వద్ద సరిగ్గా పాతిక వేలున్నాయి. వెంటనే కట్టివేసి ఆ బిల్డింగులో గ్రాండ్ ఫ్లోర్‌లో ఉన్న కాంటీన్‌కు తమ్ముణ్ని తీసుకెళ్లి టిఫిన్ పెట్టించాడు. అప్పటికే కిశోర్ గడగడ వణుకుతున్నాడు. అశోక్ అనునయంగా చెప్పాడు. "కిశోర్, ఈ సినిమా వేషాలలో నువ్వు ఇమడలేవు. లైవ్ కాన్సర్ట్స్ ఇయ్యి. డబ్బూ వస్తుంది. పేరూ వస్తుంది. మ్యూజిక్‌లో నీకు మంచి కెరియర్ ఉంది" అని హితవు పలికాడు.

ఆ మాటల్లో సత్యం గ్రహించడానికి కిశోర్‌కు ఆరేడేళ్లు పట్టింది. వేషాలు పోయి, గాయకుడిగా పునర్జన్మ ఎత్తడానికి మధ్యకాలంలో కచ్చేరీలే అతనికి అన్నం పెట్టాయి.

## కిశోర్ గీతాంజలి

యే జీవన్ హై ఇస్ జీవన్ కా యహీ హై
యహీ హై.... యహీ హై రంగ్ రూప్
యే జీవన్ హై....
థోడే గమ్ హైఁ థోడే ఖుషియాఁ
యహీ హై, యహీహై.... యహీహై ఛాఁవ్ ధూప్
యే జీవన్ హై.....
ఏ న సోచో ఇస్‌మే, అపనీ హార్ హైకి జీత్ హై
ఉసే అపనా లో జోభీ జీవన్ కా మీత్ హై
యే జిద్ ఛోడోఁ ముహ్ న మోడోఁ
హర్ పల్ ఇక్ దర్‌పన్ హై ఏ జీవన్ హై.....
ధన్ సే న దునియాసే, ఘర్ సే న ద్వార్ సే
అసువోం కి ధూప్ మచీ హై ప్రీతమ్ కే ప్యార్ సే
దునియా రూఠే పర్ న ఛూటే ఏ కైసా బంధ న్ హై
ఏ జీవన్....


'పియాకాఘర్' చిత్ర నాయికానాయకులు-జయాబాధురి,అనిల్‌ధావన్.

పియా కా ఘర్ (1972) చిత్రానికి ఆనంద్ బక్షీ రాసిన ఈ పాట కిశోర్ కెంతో ఇష్టమైనది. బొంబాయిలో గూడు దొరకని బడుగు జీవులపై చిత్రీకరించిన ఈ నేపథ్య గీతానికి లక్ష్మీకాంత్ ప్యారేలాల్ చక్కటి గిటార్ సంగీతాన్ని సమకూర్చారు.

ఏ పాటి రిహార్సల్ లేకుండా కిశోర్ ఈ పాట పాడాడంటే ఆశ్చర్యం కలుగుతుంది. రికార్డింగుకు కొద్దిగా ముందుగానే పాట లిరిక్, ట్యూన్ ఇవ్వడం జరిగింది. పాట ప్రజాదరణ పొందడంతో కిశోర్ ఎంతో సంతోషించాడు. 1986లో లతా మంగేష్కర్ ఎవార్డు పొందిన కిశోర్ ఆ సభలో ఈ పాటే ఎంతో ఆర్ద్రంగా పాడాడు. సభలోని ముప్ఫైవేల మంది శ్రోతలూ ఏకగ్రీవంగా తీర్మానించారు - సినిమాలో కంటె కిశోర్ బయటే బాగా పాడాడని!

వెళ్లినప్పుడు మాసివ్ హార్ట్ ఎటాక్ వచ్చింది. వెంటనే అతన్ని హాస్పటల్‌లో చేర్చారు. ఆ వార్త వినగానే అతని వద్దకు పరుగుపెట్టిన తొలి వ్యక్తి - అతని మొదటి భార్య రూమాదేవి. ఆమె కలకత్తాలోనే వుంటుంది. కిశోర్‌ను చూశాక, అశోక్‌కుమార్‌కి కబురు పెట్టింది. అప్పుడు అశోక్‌కుమార్ అమితాబ్ బచ్చన్‌తో కలిసి "మహాన్" సినిమా షూటింగుకై మద్రాసులో ఉన్నాడు.

సంగతి తెలియగానే అశోక్‌కుమార్ విమానంలో మద్రాసు నుండి కలకత్తా చేరాడు. రూమా ఎయిర్‌పోర్టులోనే అతన్ని కలిసింది. ఇద్దరూ కలిసి హాస్పటల్‌కు వెళ్లారు. అన్నగారిని చూడగానే కిశోర్ పసివాడిలా బావురుమన్నాడు. అతనికి అధైర్యం పుట్టింది. చావు ఇంత దగ్గరలో ఉంటుందని అతను ఎన్నడూ అనుకోలేదు.

హార్ట్ ఎటాక్ వచ్చాక కిశోర్ జాగ్రత్తగా ఉండసాగాడు. కొన్ని వారాల పాటు విశ్రాంతి తీసుకున్నాడు. తిండి బాగా తగ్గించాడు. బరువు తగ్గాడు. పాటలు పాడేటప్పుడు కూడా ఊపిరితిత్తులకు మరీ శ్రమ కలగనట్లు తక్కువ స్కేలులోనే పాడసాగాడు.

బైపాస్ సర్జరీ చేస్తే మంచిదన్నారు డాక్టర్లు. కానీ కిశోర్‌కు ఆపరేషన్ అంటే భయం. వద్దన్నాడు. అశోక్‌కుమార్ కూడా "ఆపరేషన్ వద్దులే. హోమియో పతి మందులతో తగ్గించవచ్చు" అన్నాడు. అంతేకాదు 'విమానప్రయాణాలు తగ్గించు. విమానంలో వెళితే గుండె మీద భారం పడుతుంది" అన్నాడు.

అలా కొంతకాలం జాగ్రత్తగానే ఉన్నా కాలం గడుస్తున్న కొద్దీ కిశోర్ అశ్రద్ధ వహించాడు. మామూలు పద్ధతులు మొదలు పెట్టేశాడు. తిండి బాగా తినడం అతని పాలిట శాపం అయింది. దేశదేశాల నుండి లైవ్ కాన్సర్ట్‌లకై వచ్చిపడుతున్న ఆహ్వానాలను తిరస్కరించలేక విమాన ప్రయాణాలు కూడా బాగానే చేయసాగాడు. ఇవన్నీ అతని గుండెను బలహీనపరిచాయి.

కిశోర్ మరణానికి రెండు వారాల ముందు అశోక్‌కుమార్ తమ్ముడి ఇంటికి ప్రత్యేకంగా వచ్చి విమాన ప్రయాణాలు మానుకోమని గట్టిగా చెప్పాడు. "ఏ క్షణంలో ఏం జరుగుతుందో ఏమో, ఎందుకైనా మంచిది ఈ హోమియోపతి అరకు మందు ఇస్తున్నాను. ఏదైనా ఎటాక్ వస్తే రెండు, మూడు చుక్కలు వేసుకుంటే అప్పటికి ప్రమాదం తప్పుతుంది. తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు."అని ఓ మందుసీసా ఇచ్చాడు.

అక్టోబరు 13న కిశోర్‌కుమార్ పై అంతస్తులో బెడ్‌రూములో ఉండగా సడన్‌గా తీవ్రమైన ఎటాక్ రాగానే అశోక్‌కుమార్ ఇచ్చిన మందుసీసా గురించి వెతికారు. అది ఎక్కడా కనబడలేదు. కొద్ది క్షణాలలో కిశోర్‌కుమార్ శవంగా మారిపోయాడు.

విషయం తెలిసి పరిగెట్టుకు వచ్చిన అశోక్‌కుమార్ "నాకు బర్త్‌డే గిఫ్ట్ ఇస్తానన్న మా కిశోర్ నాకు ఏమిచ్చాడో చూడండి" అంటూ బావురుమన్నాడు. తను ఎంతగానో ప్రేమించిన అన్నగారికి జన్మదినాన కిశోర్ ఇచ్చిన 'సర్‌ప్రైజ్' చివరకు అలా తేలింది!

( ఇంకా వుంది)

### తిక్కమనిషి కిశోర్

కిశోర్‌కు వెర్రి ఉన్నదన్న మాట వాస్తవం. అది ఒక్కోప్పుడు వేపకాయంత వుంటే, మరొప్పుడు వెలక్కాయంత అయేది. కిశోర్ కొంతకాలం పాటు వార్డెన్‌రోడ్‌లో ఫ్లాట్‌లో ఉన్నాడు. సాధారణంగా అందరూ'బివేర్ ఆఫ్ డాగ్' అని కట్టుకున్నట్టు అతను తన ఫ్లాట్ బయట 'బివేర్ ఆఫ్ కిశోర్‌కుమార్' అనే బోర్డు వేలాడదీసాడు. ఓ సారి దర్శక నిర్మాత హెచ్.ఎస్.రవైల్ డబ్బివ్వడానికి వచ్చాడు. నౌకరు బయట వెయిట్ చేయమని చెప్పినా, డబ్బిస్తున్నాం కదా అన్న ధీమాతో ఫ్లాట్‌లోపలికి వచ్చేశాడు. కిశోర్ లోపల్నుంచి వచ్చాడు. డబ్బు ఏమీ మాట్లాడకుండా డబ్బు తీసుకున్నాడు. థాంక్యూ అన్నట్టు చేయిచాపాడు. షేక్‌హాండ్ ఇవ్వడానికి రవైల్ చేయిచాపగానే అది అందుకుని చటుక్కున నోట్లో పెట్టుకుని కొరికాడు. రవైల్‌కి బాధ కంటే భయం ఎక్కువ వేసింది." బయట బోర్డు చూశారుగా" అన్నాడు కిశోర్.

రవైల్ ఓ వెర్రి నవ్వు నవ్వి, గబగబా బయటకు వచ్చిపడ్డాడు.

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# నవ్వుటద్దాలు

క్లాసిక్స్ రీటోల్డ్

- ఆచార్య తిరుమల

# అలవాట్లకు కవుల కితాబు

కవులు శాపానుగ్రహదక్షులై ఉండాలి. అంటే, వారు శపించినా, దీవించినా - ఫలించాలి. అంతటి దూరదృష్టి, వశ్యవాక్కు, ఆత్మనిష్ఠ ఉన్న వారికి ప్రభువులు కూడా పాదదాసులైన సంఘటనలు చరిత్రలో లేకపోలేదు. అటువంటి కవులు ఏం చేయలేరు? నందిని పంది చేయగలరు. పందిని నంది చేయగలరు. లోకం చెడుగా భావించే కొన్ని అలవాట్లను వారెలా సమర్థించారో చూస్తే బలే సరదా పుడుతుంది. హద్దులో వుంటే ఏమీ చేసినా తప్పు లేదు. ఆరోగ్యానికి దెబ్బ తగలదు. హద్దు మీరి అలవాటైనా నిగ్రహం వుంటే కొంతవరకు ఫర్వాలేదు. అలవాటుకు బానిసైతే మాత్రం అది వ్యసనమై తనకూ, సమాజానికీ కూడా పాపంగా, శాపంగా పరిణమిస్తుంది, దోషమై నిందింపబడుతుంది. మద్యాన్ని త్రాగటం, పొగత్రాగటం, కాఫీ త్రాగటం, ముక్కు పొడుం పీల్చడం, కిళ్లీలు నమలటం, వేశ్యాలోలత్వం, బూతులు మాట్లాడటం వంటివి శ్రుతిమించితే ఎంత హానికరమో అందరికీ తెలుసు. కవులు వీటినెలా సమర్థిస్తారో, ఆ చమత్కారాలెలా వుంటాయో చూడండి.

**భుగభుగమని పొగలెగయగ**

**నగణితముగ నాజ్యధార లాహుతి కాగా**

**నిగమాది మంత్రయుతముగ**

**పొగత్రాగని వాడు దున్నపోతై పుట్టున్!!**

ఓ యజ్ఞం చేస్తున్నట్టు వేద మంత్రాలతో పొగత్రాగనివాడు దున్నపోతై పుడతాడని ఓ కవి అంటే మరో కవి దీన్ని సమర్థిస్తూ -

**ఖగపతి అమృతము తేగా**

**భుగభుగమని చుక్కయొకటి భూమిని వ్రాలెన్**

**పొగ చెట్టయి జన్మించెను**

**పొగత్రాగని వాడు దున్నపోతై పుట్టున్!!**

అని అమృతం లాంటి పొగాకు చెట్టు భూమి మీద ఎలా మొలిచిందో, (భారతంలోని సౌపర్ణోపాఖ్యానం కథ ఆధారంగా) తెలియజేశాడు. పొగాకును గూర్చి, దాని అమృతత్వాన్ని గూర్చి, దాని వినియోగ సౌఖ్యాన్ని గూర్చి చాలా చాటు పద్యాలున్నా - మరో సత్యవాదియైన కవి-

**పదపడి ధూమపానమున ప్రాప్తము తా పదమూడు చేటులున్**

**మొదలు ధనంబుపోవుట, నపుంసకుడౌట, విదాహమౌటయున్**

**వెదకుచు జాతి హీనులను వేడుట. తిక్కట చొక్కుటల్, రుచుల్**

**వదలుట, కంపు కొట్టుట, కళల్ తొలగించుట, రిమ్మ పట్టుటల్**

**పెదవులు నల్లనై చెడుట, పెద్దకు లొంగుట, బట్టకాలుటల్!!**

అని పొగత్రాగటం వల్ల కలిగే అనర్థాల్ని పదమూడింటిని ఏకరువు పెట్టి తన గురుత్వాన్ని కాపాడుకున్నాడు.

ఇప్పుడు ముక్కుపొడుం పట్టు ఆట్టే కనిపించదు కానీ పూర్వం కవిపండితులకీ అలవాటు బాగానే వుండేది. "నశ్యం వశ్యకరం సదా రుచికరం పాండిత్య శోభాకరం'' అని ఓ కవిగారు నస్యాన్ని పాండిత్యశోభను కలిగించేదని మెచ్చుకున్నాడు. నస్యం అంటే ముక్కుపొడెం. ఇది జలుబు అనే ఏనుగు పాలిట సింహంలాంటిదని, రోగమనే చీకటి పాలిట సూర్యబింబంలాంటిదని, విద్వాంసుల విచిత్ర విలాసమని, రాజుల్ని కూడా లొంగదీసుకోగలదని చెప్పి, దీన్ని పొగడటం సాధ్యం కాదంటూ మరో కవిగారూ ఇలా ఓ గంభీరమైన పద్యం చెప్పాడు.

**నస్యము శీత మత్త గజనాశన హేతు విచారధీరపం**

**చాస్యము, సుప్తరోగ నిబిడాంధ తమః పటలార్క బింబసా**

**దృశ్యము, వేద శాస్త్రచయ దీప్త సుపండిత వాగ్విచిత్ర సా**

**రస్యము, రాజవశ్యమణి రాణ్మణికైన నుతింప శక్యమే!!**

నస్యం మీదిలా ఒకటో రెండో పద్యాలేమిటి? భీమవరంలో తమ్మన వెంకటేశ్వరరావు గారని ఒక మహాకవి "నస్య నిషేవణము'' అని ఓ కావ్యమే రాశారు. అదొక అద్భుత కావ్యం. చదివి తీరాలి.

వ్యభిచారం నేరమే అయినా వేశ్య (వెలయాలు)ని భోగవస్తువుల్లో ఒకటిగా జేర్చి శ్రవణానందం కావ్యంలో తిరుపతి కవులు -

**వలచిన లేమ గూడుటయె భాగ్యము, భార్యల వల్ల తత్సుఖం**

**బలవడ దన్యకాంతలనగా మరి తల్లుల వంటి వారు, వే**

**శ్యలకిది సున్న, యొక్కయెడ సంభవమందిన నట్టి వేశ్యతో**

**గలయుట కన్న వేరొకటి గల్గునె స్వర్గము మోక్షమున్ భువిన్!!**

అని వేశ్యా సంపర్కాన్ని స్వర్గీకరించారు. ఈ పద్యం సందర్భానుసారంగా చెప్పిన శ్రవణానంద పద్యమే కానీ ఆత్మానంద పద్యం కాదు. ఈ వీర్యస్వర్గానికెంత దుష్పరిణామముంటుందో విప్రనారాయణ, పుండరీక, గుణనిధి, చింతామణి వంటి కథల ద్వారా మనకు తెలుసు. ఇలాగే - కవి చౌడప్ప "నీతులకేమి వొకించుక బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో - నీతులు బూతులు లోక ఖ్యాతులురా'' అని నవ్వుకోసం సభల్లో కూడా బూతులు మాట్లాడొచ్చునని చెప్పిన మాటని ప్రమాణంగా తీసుకోకూడదు. హాస్యం బూతులోంచే పుడితే అది రసం కాదు విషమే అవుతుందని గ్రహించాలి.

అలవాటు అవసరంగా, ఆచారంగా మారిన కాఫీ త్రాగటాన్ని గురించి కవుల సమర్థన హద్దులు దాటినా ముచ్చటగానే వుంది. చూడండి - శ్రీశ్రీ

**ఎప్పుడు పడితే అప్పుడు - కప్పుడు కాఫీ నొసంగ గలిగిన సుజనుల్**

**చొప్పడిన యూర నుండుము - చొప్పడ కున్నట్టి యూరు చొరకుము మువ్వా!!**

అంటూ సుమతీ శతకకారుని "అప్పిచ్చువాడు వైద్యుడు" లిస్టులో కాఫీని గూడా చేర్చాడు. ఒక కవికి కాఫీ ముందు అధర సుధ, సుధలు కూడా ఆనలేదు. - అతగాడు పొద్దునే ఓ అయ్యరు హోటల్లో కూర్చుని -

**తరుణుల మోవి పానకము త్రాగక పోయిన నేమిగాక, యా**

**సురపతి వీటియందు సుధ జుర్రక పోయిన నేమిగాక, మా**

**కరుణ గభస్తి బింబ ముదయాచల మెక్కక మున్నె వెచ్చనై**

**గరగరలాడు కాఫి యొక కప్పిదిగోనని అయ్యరిచ్చినన్!!**

అంటూ పద్యం చెప్పాడు. సుమారు 70 ఏళ్ల క్రితమే గౌరవర్ఝుల సోదరకవులు కాఫీ మీద "కాఫీ పురాణ"మని ఓ పురాణమే రాశారు.




అందులోంచి ఈ శ్లోకాన్ని కాఫీ రాగంతో రుచి చూడండి:

**త్రికాల మేక కాలం వా జపే ద్విద్వాన్ సునిశ్చలః**

**పీత్వా పీత్వా పునః పీత్వా స్వర్గలోక మవాప్నుయాత్**

**కాఫీ తీర్థసమంతీర్థం ప్రసాద ముపమా సమం**

**అయ్యర్ సదృశ దేవేశో నభూతో న భవిష్యతి!!**

అయ్యరింద్రుడిచ్చిన ఉప్మా తిని కాఫీ తాగితే మళ్లీ మళ్లీ తాగితే, స్వర్గప్రాప్తేనట!

కొంతమందికి కాఫీ, టీల కంటె టిఫెన్ల మీద యిష్టం యెక్కువగా వుంటుంది. అది కాఫీకి బాధ కలిగి - "అరయన్ శంతను పుత్రుపై విదురుపై నక్రూరుపై" పద్యం వరసలో ఓ తిండిపోతూ కిలా అర్జీ పెట్టుకుంది.

**వడపై ఆవడపై పకోడి పయి హల్వా తుంటిపై బూంది యోం**

**పొడిపై ఉప్పిడిపైర విడ్డిలి పయిం బోండా పయిం సేమియా**

**సుడిపై పారు భవత్కృపారసము నిచ్చోకొంత రానిమ్ము నే**

**ఉడుకుం కాఫిని ఒక్కగుక్క గొనవే ఓ కుంభలంబోదరా!!**

కాఫీ ప్రార్థన పాలిపోవదని తలుస్తాను.

తాంబూలం (వేసుకోవడం) కూడా భోగ వస్తువుల జాబితాలో ఒకటి. కవి చౌడప్ప

**"పరగడుపున, సభలోపల**

**తరుణుల యెడ, భుక్తమైన తరి, యొక విడెమున్**

**దొరకని నరునకు సౌఖ్యము**

**కరువప్పా"**

అంటాడు. నిద్రలేవగానే, సభలో, ఆడవారితో మాట్లాడుతున్నప్పుడు అన్నం తిన్న తర్వాత తాంబూలం దొరకని వాడికే సుఖం లేదంటాడు. ఈ పద్యం చూడండి.

**శిల వృక్షల తల బుట్టిన**

**చెలువలు ముప్వురును గూడి శివలగ్నమునన్**

**తలవాకిట రమియింతురు**

**చెలువలరగ దీన దెలియు శ్రేష్టులు గలరే!!**

ఇదో పొడుపు కథ. తాంబూలం వేసుకోవటం దీని సమాధానం. రాతికి సున్నం. చెట్టుకి వక్క. తీగెకు తమలపాకు పుట్టి (తలవాకిలి అయిన) నోటిలో కలిసాయని తాత్పర్యం.

తాంబూలంతో మరో మూడు వస్తువులు కలిపి ఓ సంస్కృత రసికుడిలా శ్లోకించాడు.

**కూపోదకం వటచ్ఛాయ**

**తాంబూలం తరుణీకుచం**

**శీతకాల భవే దుష్ణం**

**ఉష్ణకాలే తు శీతలమ్!!**

బావి నీరు, మర్రినీడ, తాంబూలం. స్త్రీ స్తనద్వయం - శీతకాలంలో వేడిగాను, వేసవికాలంలో చల్లగానూ ఉంటాయట! అనుభవం మీద వేడెక్కినవి చల్లబడతాయి కదా! ఇక.

సురాపానానికి వైదిక సమర్థన వున్నా, మత్తు పదార్థాల వినియోగాని కెటువంటి సమర్థన దొరకదు. త్రాగుబోతుల్ని గూర్చి వ్యాసాలు కాదు గ్రంథాలే రాయవచ్చు. చూడండి.

ఒకడు - అప్పుల బాధ మరిచిపోవటానికి తాగుతున్నానని, అప్పెందుకు చేశావంటే తాగటానికనీ చెప్పాడట.

మరో తాగుబోతు తనింటి తాళం తీయటానికి నానా అవస్థ పడుతుంటే చూసి, జాలిపడి ఓ పెద్దమనిషి "తాళం చెవి ఇలా ఇవ్వండి. నేను తీస్తా"నంటే.

"అవసరం లేదు. నేను తీయగలనని. కాస్త ఇల్లు కదలకుండా పట్టుకో" అని తూలిపడ్డాడట ఆ తాగుబోతు.

అయ్యా! ఇలా ఉంటా యీ వ్యవహారాలు. కదూ!

# పరా - పరీ
# ఫైవ్‌స్టార్ ప్రైజుకు బరాబరీ

-సి.హెచ్.కమల

**పరంధామయ్యా, పరమేశ్వరీ కలిసి వినాయక చవితికి బట్టలు కొనుక్కుందామని బజారుకు వెళ్ళారు.**

పరంధామయ్య ఓ షాపు దగ్గర ఆగి "ఈ షాపులోకి వెడదామా? పరీ" అంటూ వెనుకకు చూసాడు. ఆయనకు భార్యను "పరీ" అని పిలవటం అలవాటు. ఆయన్ని చిన్నప్పటినుండీ 'పరా' (పరంధామయ్యకు షార్ట్‌కట్) అని ముద్దుపేరు.'పరా' కు స్త్రీలింగం 'పరీ' అనుకుని, " మీ అమ్మనాన్న నీకు పెద్దపేరు పెట్టేశారు. అంటూ మొదటి అక్షరాన్ని, చివరి అక్షరాన్ని కలిపి "పరీ" అని పిలుస్తా" అని చెప్పి అలా పిలవటం అలవాటు చేసుకున్నాడు!



కానీ భార్య సమాధానం వినబడక తిరిగిచూస్తే, అవిడ కనబడలేదు కూడా. భార్య కనుపించక పోయే సరికి కంగారయిందా యనకు. ఏమయింది. ఏమిటో అనుకుంటూ వెతుక్కుంటూ వెళ్ళే సరికి "అంబా బ్రదర్స్" షాపు ముందు నుంచుని బోర్డులో ఉన్న పేర్లన్నీ కూడబలుక్కుంటూ చదువుతోంది. ఆ బోర్డుకు ముందు ఓ కొత్త "మారుతి" కారుకి రిబ్బన్ కట్టి పెట్టారు. ఎంత డబ్బు పెట్టి బట్టలు కొంటే ఏ లాటరీకి అర్హులో వ్రాసిఉందా బోర్డులో.

ఆమెని చూసేసరికి కంగారు తగ్గినా "నువ్వలాసోద్యం చూస్తూ నుంచుంటే, ఏమయి పోయావో అని వెదకలేక చస్తున్నా" అంటూ మండిపడ్డాడు పరా.

"మీరేమయ్యారో అని నేనూ ఇందాకటి నుండి చూస్తున్నా! వెనక మనిషి వస్తోందో లేదో? చూసుకోకుండా పిలకాడించుకుంటూ వెళ్ళి పోవటమేనా?" అంటూ విరుచుకుపడింది పరీ.

పరీ గారు పిలక గురించి దెప్పి పొడవడానికి కారణం ఉంది. పరంధామయ్య ముందులో మామూలేగానే ఉండేవాడు. ప్రొఫెసరుగా చేసి రిటైరయ్యాడు. ఉన్న ఇద్దరు పిల్లలకి మంచి చదువులు చెప్పించి పెళ్ళిళ్ళు చేసాడు. వాళ్ళిద్దరికి అమెరికాలో ఉద్యోగాలు వచ్చేసరికి, విదేశాలకెళ్ళి అక్కడే స్థిరపడారు. పిల్లలకి బొత్తిగా తెలుగుతనం వాసన తగలకుండా పెంచుతున్నారు.




అదేమిట్రా అంటే మీ పాతతరం కంటె, మీరు మారలేదా, ఈ మార్పు సహజం. మేం అక్కడికి రాం. మీరే ఇక్కడికి రండి. మాతో బాటే, మా లైఫ్ స్టయిల్‌కు తగ్గట్టు ఉండండి. అన్నారు. దాంతో పరా గారికి ఒళ్లు మండింది. మీ అప్రాచ్యదేశాలకు ఛస్తే రాను అన్నాడు. పంతం వచ్చి - విత్ ఏ వెంజన్స్ అన్నట్టు - సూటూ, బూటూ వేయడం మానేశాడు. పంచి, లాల్చీ మొదలెట్టి, క్రాపు మీద కొత్తగా పిలక పెంచడం మొదలుపెట్టాడు. తాతలనాటి అలవాట్లన్నీ తిరగతోడడం ప్రారంభించడంతో పరీగారికి విసుగు పుట్టింది. ఈయన మరీ ఓవర్ చేస్తున్నాడని ఆవిడ అభిప్రాయం. అందుకే ఆ విసురు!



వీళ్ల వాదాలు సాగుతూండ గానే ఒకమ్మాయి వచ్చి వాళ్లను షాపులోకి తీసుకెళ్ళి, లాటరీ వివరాలన్నీ చెప్పింది. ఫస్టు ప్రైజుకి సింగ పూర్ వెళ్ళటానికి ఫ్లయిట్ టికెట్స్ కాక అక్కడొక ఫైవ్ స్టార్ హోటల్లో మూడు రోజులు ఫ్రీగా గడపటానికి ఏర్పాటు చేస్తారు. రెండవ ప్రైజు మారుతి కారు, మూడవ ప్రైజు హీరో హోండా. ఇవన్నీ చెప్పి షాపు వాళ్ళు రెండు కూల్ డ్రింక్‌లు తెప్పించే సరికి పరా గారు సంబర పడిపోయి ఆవిడకో పట్టు చీర, తనకో రెండు ధోవతులు కొన్నాడు.

నాలుగురోజుల తర్వాత భోజనం చేసి ఓ కునుకు తీసి పరీగారు పేపరు తిరగేస్తున్నారు. అందులో ఆ రోజే "అంబా బ్రదర్స్" వాళ్ళు లాటరీ తీస్తారని ఉంది.

"ఈ రోజే లాటరీ తీస్తారుట. మీరు పొద్దుట పేపర్‌లో చూడ లేదా?" అంది భర్తతో.

"చూసాను కాని అవేం మనకు రావు కదా అని నీకు చెప్పలేదు" అన్నాడు.

"సినిమాస్టార్లు వచ్చి "డ్రా" తీస్తారుట. మనకి వచ్చినా రాకపోయినా కొంచెంసేపు కాలక్షేపంగా వెళ్లి వద్దాం రండి. ఇంట్లో కూర్చుని ఏం చేస్తాం?" అంటూ ఆయనని బయలుదేరదీసింది.

కొంత సేపటికి ఓ పెద్ద సినిమా హీరో, కొందరు పురప్రముఖులు వచ్చి, స్టేజి మీద కూర్చుని చిన్న స్పీచ్ ఇచ్చి డ్రా తియ్యటం మొదలు పెట్టారు. డ్రాలో మొదటి పేరు పరంధామయ్యదే!

ఫస్టు ప్రైజు వచ్చిన పరా, పరీలను స్టేజి పైకి తీసుకెళ్లి కుర్చీలో కూర్చోపెట్టారు. సెకండ్, థర్డ్

ప్రైజులు వచ్చిన వాళ్ళు అక్కడికి రానందువల్ల, ఆ దంపతులకే సన్మానాలన్నీ జరిగాయి. శాలువా కప్పి, పూలహారంతో సత్కరించి, అంతా మెచ్చుకుని షేక్ హేండిచ్చి టికెట్లు చేతిలో పెట్టి, వాళ్ళ కారులో ఇద్దరిని ఇంటి దగ్గర దిగబెట్టారు.

పరాగారు పరవశించి పోతూ, ఇంటికి వచ్చాక భార్యను మెచ్చుకుంటూ "అనవసరంగా నిన్ను కసురుకున్నాను. నా రిటైర్మెంటురోజు కూడా ఇంత గ్రాండ్‌గా జరగలేదు. పెద్దలంతా మెచ్చుకుంటూ కరచాలనం చేస్తుంటే, నా జన్మతరించినట్లనిపించింది. నాకెంతో సంతోషంగా ఉంది" అంటూ వెంటనే పిల్లలకి ఫోన్ చేసి జరిగినదంతా చెప్పాడు.

పిల్లలు సంగతి తెలుసుకుని "మీరా ప్రయాణం మానుకోకండి. నాన్నగారు ఎలాగా బెట్టు నడలించి ఇల్లు కదులుతున్నారు కాబట్టి సింగపూర్ నుండి ఇక్కడికి కూడా వచ్చి కొంతకాలం ఉండి వెళ్ళండి." అని చెప్పారు.

ఆ మాట వినగానే పరాగారు అగ్గిలం మీద గుగ్గిలం అయ్యాడు. "సింగపూరు అప్రాచ్య దేశం కాదు. తూర్పు వైపు ఉంది. మనదేశం వాళ్లు, ముఖ్యంగా అరవ్వాళ్లు అక్కడుండి మన సాంప్రదాయం నిలబెడుతున్నారు. అందుకే ఒప్పుకున్నాను గానీ అదే అమెరికా అయితేనా.." అని అరిచారు.

పరీగారికి ఈ వరస నచ్చలేదు. పిల్లలు చెప్పినట్టు అమెరికా కూడా వెళ్లి వస్తే యేం? అనుకుంది. భర్తతో అంది కూడా. దాంతో పరాగారికి ఇబ్బంది వచ్చిపడింది. ఈ అదృష్టమంతా "పరీ" వల్లేగా జరిగింది. దాన్ని తీసుకెళ్లి అన్నీ చూపించాలి. వెఱ్ఱిది. ఎప్పుడు ఏది అడగదు. ఇల్లే స్వర్గం అనుకుంటుంది. తీసుకెళ్లి వింతలన్నీ చూపాలి. అనుకున్నాడు. కానీ అమెరికా వెళితే తన వ్రతభంగం కాదూ?

ఆయన ఇబ్బంది తొలగిపోయింది షాపు వాళ్ల పుణ్యమాని. 'సింగపూర్‌లో మూడు రోజులుండి వెనక్కి వస్తేనే ఏర్పాటు చేస్తాము. అక్కడ నుండి వేరే ప్లేసుకు వెడితే మా రూల్సు ఒప్పుకోవు' అన్నారు వాళ్లు.

వచ్చిన అవకాశాన్ని ఒదులుకోవట మెందుకని సింగపూరుకే బయలు దేరారు. ఎయిర్‌పోర్టుకు వెళ్లేటప్పుడు పరీ అని చూసింది - 'పోనీ పంచీ, లాల్చీ బదులు పాంటు వేసుకోవచ్చు కదాని' పరాగారు ఇంకా బిగిసిపోయారు. పంచె కట్టుకోవడమే కాదు, "విమానంలో తినడానికి నువ్వేమీ పట్టుకురావద్దు. వాళ్ల దుంపతెంపి మనకు కావలసినవి తెప్పిస్తాను చూడు." అని శపథం చేశారు.

విమానం ఎక్కిన కొంతసేపటికి ఎయిర్ హోస్టెస్ వచ్చి అందరికి ఫుడ్ అరేంజి చేసి వీళ్ళకి కూడా ఇచ్చింది. ఆ ప్లేటులోవి వాసన చూసేసరికి ఇద్దరికి వెగటు పుట్టింది. ఆమెని పిలిచి మాకిలాంటివి నచ్చవు, అన్నం కూరా కావాలి! అన్నారు పరా. అటువంటివి దొరకవని చెప్పేసరికి పోనీ ప్యూర్ వెజిటేరియన్ తెచ్చి ఇవ్వండి అన్నారు. కేక్ ఇస్తే దాంట్లో కోడిగుడ్డు ఉంటుంది తినం అన్నారు. ఎయిర్‌హోస్టెస్‌కి విసుగుపుట్టి "ఇది వెస్టర్న్ ఎయిరెలైన్స్, గట్టిగా మాట్లాడితే బీఫ్, పోర్కు తెస్తాను' అని బెదిరించింది. పరాగారు నెత్తి మొత్తుకున్నారు. చవగ్గా వస్తుందని షాపు వాడు



వీడితో బేరం పెట్టుకుని ఉంటాడు. ఎయిరిండియాలోనే ఎక్కుతామని పట్టు బట్టాల్సింది అని ఘొల్లుమన్నాడు.

నీరసం మొహంతో ఉన్న భార్యకేసి చూసి జాలివేసింది.'ఫుడ్డు ఫ్లయిటులో ఇస్తారంటే నిజమే అనుకుని ఇంటి దగ్గర నిన్నేం వండద్దన్నాను. తీరా చేసి ఇలాటి పనికిరానివేవో ఇస్తారనుకోలేదు. ఇప్పుడు కడుపులో కాలుతోంది. ఫ్లయిటు దిగగానే ముందు మంచి భోజనం చేద్దాంలే' అన్నాడు.

ఇద్దరు ఫ్లయిటు దిగగానే షాపువాళ్ళు ఏర్పాటు చేసిన కారులో ఫైవ్ స్టార్ హోటలుకు చేరుకున్నారు. అది చైనావాళ్ల హోటల్. షాపువాడు ఈ విషయంలో కూడా కక్కుర్తి పడివుంటాడని పరాగారి అనుమానం. గబగబా స్నానం చేసి, బెల్ నొక్కి బేరర్ రాగానే మీల్సు తీసుకురమ్మని చెప్పారు. బేరర్ మెనూ కార్డు తెచ్చి ఇచ్చాడు. అందులో చూస్తే కొత్త కొత్త పేర్లతో అర్థం కాకుండా ఉంది. అసలే చైనా హోటలు. ఏ పేరు చెపితే ఏం తెస్తాడో? అది పాము, కప్ప అయితే! ఇవాళే కాదు జన్మంతా తిండి మానేయాల్సి వస్తుందనుకుని ఆంధ్రా వెజిటేరియన్ మీల్సు కావాలని చెప్పారు. ఆ మీల్సు ఈ హోటల్‌లో దొరకదంటూ, అక్కడ దొరికే వెజిటేరియన్ వాటి పేర్లన్నీ స్పీడుగా మంత్రాలు చదివినట్లుగా వల్లించే సరికి, అర్థంకాలేదు. వెజిటేరియన్‌కు వీడి నిర్వచనం ఏమిటో అని గొణుక్కుంటూ వేడిగా పాలు తీసుకురమ్మని చెప్పి, పరీ బేగ్‌లో ఉన్న అరటి పళ్ళు తిని క్షుద్బాధ తీర్చుకున్నారు.

భోజనం లేక పోయే సరికి చిరాకొచ్చింది పరంధామయ్యకి. "అందరూ వెళ్ళమని ప్రోత్సహిస్తే చాలా బాగుంటుందనుకున్నాను. తీరా చేసి భోజనమే దొరకలేదు. ఇంకా రెండు రోజులు ఎలా గడపాలో? నీ మూలానే ఇదంతా, హాయిగా ఇంట్లో కూర్చోనివ్వకుండా చేసావు" అన్నాడు.

"ఇప్పుడేమయిందని? ఇంట్లో ఉంటే ఏకాదశి ఉపోషాలుండటల్లేదా? అలాగే అనుకోండి. సాయంత్రం బయటికెళ్ళినప్పుడు ఎక్కడయినా ఆంధ్రా మీల్సు దొరుకుతుందేమో కనుక్కుందాం" అంటూ శాంతపరిచింది పరీ.

ఇద్దరూ ఓ కునుకుతీసి హోటలు వాళ్ళు ఏర్పాటుచేసిన కారులో, సింగపూరులో కొన్ని ప్రదేశాలన్నీ తిరిగి ఆంధ్రామీల్సు ఎక్కడ దొరుకుతుందో ఎంక్వయిరీ చేసారు. అక్కడికి కొంతదూరంలో ఇండియన్ రెస్టారెంటు ఉంది వెళ్ళండి అని చెప్పారొకరు. రాత్రికి ఆ రెస్టారెంటుకి వెళ్ళి సుష్టుగా భోజనం కానిచ్చి రూమ్‌కి వచ్చి పడుకున్నారు.

ఆకలి తీరగానే పరంధామయ్యకు ఆచారాలు, తన పంతం గుర్తుకువచ్చాయి. "ఛ, ఛ. దేశం కాని దేశం రాగానే అన్నీ మర్చిపోయి, నిన్నరాత్రి టేబుల్ మీద కూచుని భోజనం చేశాను. పూజ చేయడం మర్చిపోయాను. " అని తిట్టుకుని, రేపటినుండీ నిష్ఠగా ఉండాలి. అనుకున్నాడు.

పొద్దున్న లేస్తూనే "పరీ, లే! లేచి పాచిల్లు తుడు. నేను సంధ్య వార్చుకోవాలి" అన్నాడు. ఆమె కళ్ళు నులుముకుంటూ నిద్ర లేచి "మీకేమైనా మతిపోయిందా? ఇక్కడ పాచిల్లు ఎక్కడుందండీ? మనం ఉన్నది ఫైవ్ స్టార్ హోటల్లో. గదంతా కార్పెట్టు పరిచారు కదా? ఇంకెక్కడ తుడవాలి? "అంది, పని తప్పుతుంది కదా అని.

"మనం ఎక్కడ ఉంటే అక్కడే శుచిగా చేసుకోవాలి. బయటకొచ్చాము కదాని ఆచారాలు మానుకుంటామా? లేచి తుడు" అంటూ కార్పెట్టు చుట్టేసి మూలపెట్టాడు.

ఇంక తప్పదన్నట్లుగా లేచి గదంతా నీళ్ళు చిలకరించి బట్టతో తుడిచి ముగ్గుపెట్టింది. ఫైవ్‌స్టార్ హోటలయినా సరే, పద్నాలుగంతస్తుల మేడయినా సరే, నా ఆచారాలు మానుకోనంటూ బేగ్‌లో ఉన్న పూజా సామాగ్రినంతా తీసి బయట పెట్టి పట్టుపంచ కట్టుకుని, రుద్రాక్షలు విభూతి రేకలు పెట్టి, దేముడి పటాలన్నీ ఓ మూల అమర్చి తన పూజా కార్యక్రమాన్ని కానిచ్చాడు పరాగారు.

పరమేశ్వరికి అతడి పద్ధతి చూస్తే భయం వేసింది. - ఎక్కడనుంచయినా వంటసామాగ్రి తెచ్చి మడిగా మహానైవేద్యానికి వంట చెయ్యమంటాడేమో అని. కాని పుణ్యాత్ముడు పళ్ళు, పాలతో నైవేద్యం కానిచ్చాడు. హమ్మయ్య అనుకున్న సంతోషం ఎక్కువసేపు నిలవలేదు.

భోజనానికి నిన్నటి ఇండియన్ రెస్టారెంటుకి వెళ్లాక పరా కొత్త షరతు పెట్టాడు - 'నేను ఇవాళ ఔపోసన పట్టి నైవేద్యం పెట్టుకుంటే కాని భోజనం చెయ్యను. నిన్నంతా భగవంతుడికేమీ పెట్టకుండా పస్తుంచాను. ఈ రోజు నాకు కింద విస్తరేసి వడ్డించాల్సిందే" అన్నాడు.

హోటల్ వాళ్లకు అతను చెప్పింది అర్థం కాక, అందులో పని చేస్తున్న ఆంధ్రాకుక్‌ని పిలిచి "ఆయనకేం కావాలో చూడు" అన్నారు.

అతను పరిస్థితి అర్థం చేసుకుని వాళ్ళిద్దరిని కిచెన్‌లోకి తీసుకెళ్లి, కిందవిస్తరి వేసి వడ్డించాడు. తన పద్ధతి ప్రకారం భోజనం కానిచ్చి, కుక్‌ని, రెస్టారెంటు వాళ్ళని మెచ్చుకుని బయటకు వస్తూంటే తీరి కూచోక పరీ ఓ మాటంది. "ఉత్తిపుణ్యానికి ఇంత హడావుడి చేస్తున్నారు. రేపు వినాయకచవితి కదా! పూజెలా చేస్తారు? మన ఆచారాలన్నీ ప్రస్తుతానికి కట్టిబెట్టి.."

అప్పటికే ఆలస్యం అయిపోయింది. పరాగారు రెచ్చిపోయారు. "భలే గుర్తు చేశావ్! శాస్త్రోక్తంగా వినాయకపూజ చేసినప్పుడే గొప్ప! దేనికీ కాంప్రమైజ్ కాకూడదు." అని అన్నాడు.

పరీ నాలిక కరుచుకుని, "అంత ఇదవకండి. దొరికిన వాటితో సింపుల్‌గా కానిచ్చేసి, ఇంటికి వెళ్ళాక శాస్త్రోక్తంగా చేసుకుందాం" అంది.

పరా గారు ఒప్పుకోలేదు. ఇద్దరూ కలిసి సింగపూరంతా తిరిగి కావాల్సిన సామాగ్రినంతా సేకరించ గలిగారు. రాత్రే పూజ కోసం ఏర్పాట్లు మొదలు పెట్టారు. ఆమె "ఏ హోటలో, ఏమో, ఈ గదికి ఓ గడపయినా లేదు" అనుకుంటూ, ద్వారబందానికి అటు ఇటు ఓ మూరెడెత్తున పసుపురాసి కుంకుం బొట్లు పెట్టేసింది.

అతను మామిడాకు ల్లేక పోతేనేం ఏవో వొకటి పచ్చగా కట్టుకుంటే సరి, అంటూ బజారులో

# అవాకు-చెవాకు

**-స్వామిచిత్రానంద**



హీరో: రండి ఇన్‌స్పెక్టర్! సమయానికొచ్చారు.
ఇన్‌స్పెక్టర్: ఇంకా ఎర్లీగా వద్దును. డ్రెస్సు రావడం లేటయింది.



డాక్టర్:ఈ రాత్రి గడిస్తేగానీ చెప్పలేం
పేషంటు తల్లి: రేపు షూటింగు లేదు సార్.



తండ్రి: (కొడుకుతో) నువ్వు నా కొడుకువు కాదు. నేను నీ తండ్రినీ కాదు.
తల్లి: (భర్తతో) ఇదేమిటండీ! నా శీలాన్నే శంకిస్తున్నారు?

సంపాదించిన ఆకుల్లో కొన్ని తీసి దారానికి కట్టి గుమ్మం పైన తోరణంలా టేపు పెట్టి అతికించేసాడు. కిందకు వెళ్లి గార్డెన్‌లో చెట్ల దగ్గర మట్టి కొంత తెచ్చి గణపతిని, మూషిక వాహనాన్ని తయారుచేసి, టి.వి తీసి ఓ మూలగా పెట్టి, ఆ టీపాయ్ మీద గణనాయకుని పుస్తకాలను పెట్టి, అగరొత్తుల కట్టలతో పాలవెల్లి కట్టి గణేశ మండపాన్ని యదావిధిగా తయారు చేసాడు.

తెల్లవారు ఝామునే లేచి ఇద్దరూ శుచిగా తయారయి పూజ మొదలు పెట్టారు. పెద్దగా మంత్రాలు చదువుతూ గంట గణగణ మ్రోగిస్తూ, ఓ కట్ట అగరువత్తులు వెలిగించి పరాయిదేశంలో ఉన్నా పూజ చేసుకోగలుగుతున్నందుకు పరవశించిపోతూ కొబ్బరి కాయలు నేలకేసి టపటపా కొట్టసాగారు.

ఈ శబ్దాలకు పక్క రూముల్లో వాళ్ళు లేచి ఏం జరుగుతుందో అర్థం కాక కాలింగ్‌బెల్ నొక్కి బేరర్స్‌ని పిలిచి 'ఎర్లీ మార్నింగ్ ఈ డిస్టర్బన్సేమిట'ని తిట్టారు. వాళ్లు ఏ రూములోంచి సౌండు వస్తోందాని వెతకబోతుండగా స్మోక్ డిటెక్టర్ (అగరువత్తుల ప్రభావం!) వీళ్ల రూముకి నడిపించింది.

వాళ్లు వచ్చి తలుపులు బాదే టైముకి పరంధామయ్య ఇంత కర్పూరం వెలిగించి బొజ్జ వినాయకుడికి మంగళ హారతులు పాడేస్తున్నాడు. ఆమె కూడా వంత పాడుతూ, ఇంత పొద్దుటే తలుపు తడుతున్నారెవరా? అని తలుపు తీసింది. బేరర్స్ లోపలకి వచ్చి అక్కడి దృశ్యాన్ని చూసి స్తంభించి పోయారు.

కానీ పరాగారు చలించలేదు. టైముకి వచ్చారంటూ పెద్దగా మండుతున్న కర్పూరం తెచ్చి వాళ్ళని కళ్ల కద్దుకోమన్నాడు. ఆ మంట చూసి వాళ్ళు సీలింగెక్కడ అంటుకుంటుందో అని బైటకి వెళ్లి స్వీస్ పైపు తెచ్చి ముందు ఆ మంట నార్పేశారు.

'అయ్యో, అయ్యో అపచారం' అంటూ పరాగారు లెంపలు వాయించుకుని గణపతి ముందు సాష్టాంగం పడుకున్నాడు. ఆ కేకలు, దబ్బున పడిపోవడం చూసి ఆయనకేదో మూర్ఛ వచ్చిందనుకుని బేరర్స్ బాత్‌రూమ్‌లోంచి బకెట్టు నీళ్ళు తెచ్చి ఆయనమీద గుమ్మరించారు.

ఆయన ఉలిక్కిపడి లేచి "మీకేమయిందర్రా శుంఠల్లారా, ఇలా చేస్తున్నారు. అన్నీ అపచారాలే జరుగుతున్నాయి' అంటూ వాళ్ళమీద విరుచుకుపడ్డాడు. ఈలోగా రూమ్స్‌లో ఉన్న వాళ్ళంతా అక్కడకు చేరుకున్నారు. ఒక బేరర్ వెళ్ళి మేనేజర్ని పిలుచుకు వచ్చాడు.

మేనేజరు వచ్చి రూమంతా చూసి తెల్లబోయాడు. కార్పెట్టంతా చుట్టబెట్టి ఓ మూలగా ఉంది. టి.వి ఇంకో మూల కింద పడి ఉంది. ఒకదాని మీదొకటి సోఫాలు వాటి మీద తడిబట్టలు, గదంతా నీళ్ళు, గణపతి మండపం, దాని దగ్గర పళ్ళెంలో చలిమిడి, ఉండ్రాళ్ళు, పళ్ళు కొబ్బరి చెక్కలు, పిండితో రూమంతా ముగ్గులు! అగరొత్తుల పొగరూమంతా చుట్టేసి ఊపిరాడకుండా ఉంది. కుందుల్లో దీపాలు పెద్దగా వెలుగుతున్నాయి. ఎక్కడ సంపాదించారో గోడకే మేకు కొట్టి పాలవెల్లి వేలాడదీశారు. కొబ్బరికాయలు కొట్టినందువల్ల ఫ్లోరింగు పెచ్చులూడి పోయాయి.

అంతా బీభత్సంగా కనిపించే సరికి మేనేజరుకి వళ్ళు మండిపోయింది. కోపంగా వాళ్ళిద్దరికేసి చూసాడు. మొహాల కింతింత బొట్లు పెట్టుకుని వట్టుబట్టలతో కనుపించేసరికి ఇంకా చికాకేసింది. అందరికీ నిద్రాభంగం చేసి రూమంతా డర్టీగా చేసినందుకు ఫైన్ కట్టమంటూ అరిచాడు.

బిక్కమొహాలేసుకుని నిలబడ్డ వాళ్ళిద్దరిని చూసేసరికి, అక్కడ చేరిన వారిలో ఒకతనికి చాలా జాలి కలిగింది. అతను గణేశన్ అని తమిళుడు. ఆ హోటలుకి చాలా ఏళ్ళుగా రెగ్యులర్ కస్టమరు. ఆ మేనేజరుకి, అక్కడ చేరిన వారికీ ఆ రోజు వినాయక చవితి అనే పండుగ అవటం వల్ల, వాళ్లిద్దరూ సనాతనాచారం వున్న పెద్ద వయసు వాళ్ళవటం వల్ల అలా చేసారని, వాళ్ళని మన్నించమని సర్దిచెప్పి తను వెళ్ళి గణపతి ముందు మోకరిల్లి, మూడు గుంజీలు తీసి మూడు మొట్టికాయలు వేసుకున్నాడు. అతని మీద గౌరవం కొద్దీ మేనేజరు ఊరుకున్నాడు. వాళ్లను ఇంకా చల్లార్చడానికి గణేశన్ "అంకుల్, వాళ్లకు తీర్థ ప్రసాదాలివ్వండి'. అన్నాడు.

వాళ్లు వళ్లు తోముకుని ఉండరని అనుమానించినా, ఆపదలోంచి గట్టెక్కించిన గణేశన్ మాట కొట్టేయలేక వచ్చిన వాళ్లకు ప్రసాదం ఇచ్చారు పరాగారు. ఎవడో ఒక దేవుడు, ప్రసాదం వద్దంటే ఏం ముప్పో అని వాళ్లూ వినాయకునికి ఓ నమస్కారం చేసి ప్రసాదం తీసుకుని వెళ్లారు.

అందరు వెళ్ళాక గణేశన్ వీళ్ళ దగ్గరకొచ్చి "మీరు నిశ్శబ్దంగా చేసుకునుంటే ఇంత గొడవయ్యేది కాదు. మీరీ పండగ వెళ్ళాక రావాల్సింది" అన్నాడు.

"ఇదిగో ఈవిడ వల్లే ఇలా జరిగింది. లాటరీలో ప్రైజు వచ్చినందువల్ల ఇలా రావాల్సి వచ్చింది. ఇప్పుడా మేనేజరు ఎంత ఫైను వేస్తాడో ఏమో?" - అన్నాడు పరా.

పరీగారు మూతి విరిచింది - "మరే నా వల్లే వచ్చింది! ఆ రోజేమో పొంగిపోయి ఇక్కడికి తీసుకువచ్చారు. మూడు రోజులు పనులు తప్పుతాయి కదా అనుకుంటే, ఇక్కడేమో చచ్చే చాకిరీ చేయించారు. మళ్ళీ నెపమంతా నామీద వేస్తున్నారా?"

వాళ్లిద్దరిని చూసి నవ్వుకుంటూ గణేశన్ 'మీరేమీ కట్టక్కరలేకుండా నేను మేనేజ్ చేస్తాను లెండి' అని హామీ ఇచ్చి తన రూమ్‌కి వెళ్లిపోయాడు.

"శుభమా అని పూజ చేసుకుంటుంటే వీళ్ళకేమయిందో? అందరిని లేపి గందరగోళం సృష్టించారు. కథ చెప్పుకుని అక్షింతలు వేసుకోవడం మిగిలి పోయింది. ముందుకు సాగడానికి కాళ్లూ చేతులూ ఆడటం లేదు. వాళ్ళు లేవకపోతే పూజ పూర్తి చేసుకుని, భజన కూడా చేసుకునే వాళ్ళం" అంటూ భార్యా భర్తలిద్దరూ కలిసి నెపమంతా హోటల్ వాళ్ళ మీదకు నెట్టారు.

మధ్యాహ్నం ఇండియన్ హోటల్‌కు వెళ్లి విస్తరేయించుకుని భోజనం చేసి వచ్చేసరికి వినాయకుడి ప్రతిమ మాయం! మేనేజరుకి కంప్లయింటు ఇద్దామంటే ఇంకా తిడతాడేమోనని భయం! అసలు వినాయకుడిని మాయం చేయడంలో వాడి హస్తం ఉందే మోనని పరాగారి



అనుమానం.

రాత్రి గణేశన్ రూముకి వచ్చాక పరాగారు అతన్ని కలిసి తన సందేహం తెలియబరచేడు. "అబ్బే, వాళ్లు అలాటి వాళ్లు కారండి. నేను చెప్తనే ఊరుకున్నాడు కూడా. హిందూ విగ్రహాలలో వజ్రవైఢూర్యాలు ఉంటాయని ప్రపంచం అంతా అనుకుంటారు. గజనీ మొహమ్మదు మన గుళ్ల మీద దండెత్తినది కూడా అందుకే! ఈ బేరర్ల లో ఎవడో ఒకడు అదే ఉద్దేశ్యంతో ఎత్తుకుపోయి వుంటాడు. రేపు చూద్దాం లెండి"అన్నాడు గణేశన్.

"మేం రేపే వెళ్ళిపోవాలి. నువ్వే ఆ గణపతిని వెతికి పట్టుకుని మీ మద్రాసు సముద్రంలో నిమజ్జనం చేసేయి నాయనా" అని చెప్పి విమానం ఎక్కారు.

నాలుగు రోజుల తరువాత షాపు కుర్రాడు వీళ్లింటికి వచ్చాడు. "మీరక్కడ రూమ్‌కి డేమేజ్ చేసి స్విమ్మింగ్‌పూల్‌లో చెత్తవేశారుట. వాళ్ళు ఆ రిపేర్లకయినదంతా బిల్లు పంపారు. మేము రానుపోను టికెట్సు, అకామ్‌డేషను ఇస్తామన్నాము కాని, ఇటువంటి బిల్లులు కట్టం. మీరే కట్టుకోవాలి. వారం లోపల కట్టకపోతే కేసు కూడా పెడతారట. తక్షణం డబ్బు పట్టుకు రమ్మన్నారు మా షావుకారుగారు. " అన్నాడు.

"అదేమిటండీ, రూము డామేజి గురించి గణేశన్ మాట్లాడతానన్నాడుగా" అంది పరీ.

షాపువాడు వివరించాడు. "డామేజి గురించి హోటల్ వాడు పోన్లే పాపం అనుకున్నాట్టండి. కానీ స్విమింగ్‌పూల్‌లో వినాయకుడి ప్రతిమ, పత్రీ పడేయడంతో వాళ్లకు కోపం వచ్చింది. నీళ్లన్నీ పొల్యూట్ అయిపోయాయని వాళ్ల బాధ. పర్యావరణ కాలుష్యం గురించి వాళ్లకు చాలా పట్టింపండి." అన్నాడు.

పరీ ఏదో అనబోతూంటే పరా వారించేడు - 'మన బొమ్మ ఎత్తుకెళ్లిన ఆ బేరరుగాడు పట్టుకెళ్లి అక్కడ పారేశాడంటే ఎవడు నమ్ముతాడు? సాక్ష్యం ఉందా అంటారు. రూములో ఇంత హడావుడి చేసినవారు అది మాత్రం చేయకుండా ఉంటారా? అంటారు. కథ విని అక్షింతలు వేసుకోనప్పుడే అనుకున్నాను ఇలాటి నీలాపనిందలు ఏవో వస్తాయని."అన్నాడు.

"చాల్లెండి, మీ చాదస్తమే ఇంతకు తెచ్చింది" అంది పరీ మండిపడుతూ.

"చాల్లే, అవాళ నువ్వు నా వెంట రాకుండా, వీళ్ల బోర్డు చూసి లొట్టలు వేసుకుంటూ నిలబడకుండా ఉంటే ఇదంతా జరిగేదే కాదు'. అని అరిచాడు పరంధామయ్య.

'బిల్లు కట్టేసి మీరు తీరిగ్గా వాదించుకోండి' అంటూన్న షాపువాడి మాటలు పట్టించుకోకుండా వాళ్లు హోరాహోరీగా పోట్లాడుకుంటూనే ఉన్నారు.

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

## 1935

అప్పటిదాకా అతి తక్కువ వాయిద్యాలతో సంగీతం సమకూర్చే సాంప్రదాయానికి విరుద్ధంగా అనిల్ బిశ్వాస్ 12 వాయిద్యాల ఆర్కెస్ట్రా ఉపయోగించారు. 'ధర్మాకీ దేవీ' అనే సినిమాలో. క్రమంగా ఆర్కెస్ట్రా ఉపయోగం ఇంతింతై.... అన్నట్టు పెరిగి సాహిత్యాన్ని మింగేసే స్థాయికి చేరుకొందీ నాడు.

ప్లేబాక్ సిస్టమ్ ప్రారంభమయింది కూడా ఈ సంవత్సరంలోనే. రాయ్‌చంద్ బొరాల్ సంగీత దర్శకత్వంలో 'ధూప్‌ఛావ్' అనే సినిమాకై పరుల్‌ఘోష్, సుప్రభా సర్కార్, హరిమతి, 'మై ఖుష్ హెూనా చాహూఁ' అనే పాట పాడారు. ప్లేబాక్ పుణ్యం వల్ల పాటరాని వాళ్లు నటించే అవకాశం కలిగింది. క్రమంగా అది ముదిరి మాట (భాష) రాని వాళ్లు కూడా నటించే వీలు కలిగింది.


కిదార్‌శర్మ

సైగల్ 'దేవదాస్' విడుదలయింది. కిదార్ శర్మ పాటలు రాయగా, తిమిర్ బరన్ సంగీతం అందించారు. సైగల్ 'బాలమ్ ఆయే బసే మొరే మన్ మేఁ' జనాలను ఉర్రూత లూగించింది. కిదార్‌శర్మ దర్శక నిర్మాతగా ఎదిగి రోషన్ వంటి సంగీత దర్శకుణ్ని, ముబారక్ బేగం వంటి గాయనిని, రాజ కపూర్, మధుబాల, నూతన్, తనూజ వంటి నటీనటులను తెరకు పరిచయం చేశారు.

కిదార్‌శర్మ ఆత్మకథ ఇటీవలే విడుదలయింది.

భారతదేశపు తొలి మహిళా సంగీత దర్శకురాలు గా సరస్వతీ దేవి అనే పార్శీ మహిళ ('జవానీ కా హవా' సినిమా ద్వారా ) ఆవిర్భవించారు.


సరస్వతీ దేవి

నటుడి గానే ప్రజలు గుర్తుంచుకునే మోతీలాల్ పాటలు పాడడమే కాక 'అస్మత్ కే మోతీ' సినిమాకై 12 పాటలకు సంగీ తాన్ని అందించారు.

## 1936

దంతవైద్యుడు ఘులామ్ హైదర్ 'స్వర్గ్ కీ సీడీ'తో మ్యూజిక్ డైరెక్టరుగా మారారు. ధోలక్‌ను హిందీ సినిమాలలో ప్రవేశపెట్టిన ఘనత ఆయనదే.

నర్గీస్ తల్లి గాయని - నటి జద్దన్‌బాయి 'మేడమ్ ఫేషన్' అనే సినిమాకు మ్యూజిక్ కంపోజ్ చేశారు.

'జీవన్‌నయ్యా' సినిమాలో అశోక్‌కుమార్ నటుడిగా, గాయకుడిగా ప్రవేశించారు. కానీ సక్సెస్ వరించింది రెండో సినిమా 'అఛూత్ కన్యా' (మై బన్‌కీ చిడియా పాట)తోనే.


'అఛూత్ కన్యా'లో దేవికారాణి తో అశోక్‌కుమార్

స్వాతంత్ర సమరయోధుడు ఎస్.ఎన్. త్రిపాఠి గాయకుడి గానూ - సంగీత దర్శకుడి గానూ ప్రవేశించారు. 'ఆయిరే దయ్యారే దయ్యా' సినిమాతో.

మరొక నట గాయకుడు 'సురేంద్ర' ప్రవేశం - 'డెక్కన్ క్వీన్' సినిమాతో. ప్రాణ్‌సుఖ్ నాయక్ మ్యూజిక్ డైరక్షన్‌లో 'యాద్ న కర్' వంటి అనేక పాటలు పాడారు.

తొలి ప్యారడీ సాంగ్ కూడా ఈ సంవత్సరంలోనే ! 'పూరన్ భగత్' (1933)లో ఆర్.సి.బోరల్ పాట! 'జావో జావో ఎయ్ మేరే సాధో' పాటను వెక్కిరిస్తూ 'గావో గావో ఎయ్ మేరే సాధు' అనే పాట వెలువడింది. 'ఫ్రాంటియర్ మెయిల్'లో! ఈనాటి హిట్ డైరెక్టరు రాజ్‌కుమార్ సంతోషి తండ్రి ప్యారేలాల్ సంతోషి గేయ రచయితగా 'విష వమన్' సినిమా ద్వారా పరిచయం.




1956లో అశోక్‌కుమార్ హీరోగా నటించిన 'కిస్మత్' చిత్రం విడుదలయింది, అందులో - విధివశాత్తూ దొంగగా మారి పైకి ఘరానాగా చలామణి అవుతూ దొరికిపోతానని తెలిసినా -తనవల్ల అవిటి బ్రతుకుసాగిస్తున్న కథానాయికను ఆ దౌర్భాగ్యం నుంచి తప్పించడానికి సాహసాలు చేసే హీరో పాత్ర ఎందర్నో ఉత్తేజితుల్ని చేసింది కాకపోతే ఆ చిత్రం విడుదలయిన మొదటివారంలో బొంబాయ్‌లో దొంగతనాలు జరిగేయన్న కంప్లయింట్స్ ఎక్కువయ్యాయని, దానికీ చిత్రం ప్రభావమే కారణమని చెప్పుకునే వారు. ఆ చిత్రంలో సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్ స్వరపరిచిన 'ధీరేధీరే ఆరే బాదల్', 'ఘర్ ఘర్‌మె దివాలీ హై, పెరా ఘర్‌మె అంధేరా' వంటి పాటలు బాగా పాపులర్ అయ్యాయి. ఆ 'కిస్మత్' ఆధారంగా 1956లోనే నిర్మించిన చిత్రమే:

# భలేరాముడు

ఈ 'భలే రాముడు' చిత్రం కూడా తెలుగునాట చక్కటి ప్రజాదరణ పొందింది. ఈ చిత్రానికి దర్శకుడు వేదాంతం రాఘవయ్య, సంగీత దర్శకుడు యస్.రాజేశ్వరరావు, మాటలు, పాటలూ సదాశివబ్రహ్మం. ఈ చిత్రంలోని కొన్ని పాటల గురించి:

ఓహో...
ఓహో మేఘమాలా - నీలాల మేఘమాలా
చల్లగరావేలా - మెల్లగరావేలా - చల్లగరావేలా - మెల్లగరావేలా... మెల్లమెల్లగ రావేలా
ఈలీలా దుడుకుతనమేలా - ఈలీలా దుడుకుతనమేలా
ఊరుకోవే మేఘమాలా
ఊరుకోవే మేఘమాలా ఉరుముతావేలా - మెరవగానేలా
చల్లగరావేలా - మెల్లగ రావేలా
ఓహో... గూటిలోన రామచిలుక నిదురపోతోంది
గూటిలోన రామచిలుక నిదురపోతోంది - చిలక బెదిరిపోతుందీ
ఊరుకోవే మేఘమాలా - ఊరుకోవే మేఘమాలా
ఉరుముతావేలా - మెరవగానేలా - చల్లగరావేలా. మెల్లగరావేలా
ఓహో... తీయతీయని కలలుకంటూ మురిసిపోతోందీ
తీయతీయని కలలుకంటూ మురిసిపోతోందీ మైమరచిపోతోందీ
ఊరుకోవే మేఘమాల - ఉరుముతావేలా - మెరవగావేలా
చల్లగరావేలా - మెల్లగరావేలా - చల్లగరావేలా - మెల్లగరావేలా... ఓహో... ఓహో...









***This feature is sponsored by***

**Shri Chandrabose**, *the popular lyricist as a birthday (19th Oct) gift to his beloved wife* **Smt. Suchitra**, *the famous dance director*

అ: ఓహో మేఘమాలా - నీలాలమేఘమాలా
ఓహో మేఘమాలా - నీలాలమేఘమాలా
చల్లగరావేలా - మెల్లగరావేలా - చల్లగరావేలా - మెల్లగరావేలా
వినీలా మేఘమాలా - వినీల మేఘమాలా
నిదురపోయే రామచిలుకా
నిదురపోయే రామచిలుకా బెదిరిపోతుందీ కల చెదిరిపోతుందీ
చల్లగరావేలా మెల్లగరావేలా
ప్రేమసీమలలో చరించే బాటసారీ ఆగవోయీ
ప్రేమసీమలలో చరించే బాటసారీ ఆగవోయీ
పరవశంతో ప్రేమగీతం పాడబోకోయీ
పరవశంతో ప్రేమగీతం పాడబోకోయీ
ఏం...? నిదురపోయే రామచిలుక
నిదురపోయే రామచిలుక బెదిరిపోతుందీ కల చెదిరిపోతుందీ
చల్లగరావేలా మెల్లగరావేలా
అ: ఓహో... ఆ: ఓహో...
ఆ: ఆశలన్నీ తారకలుగా హారమొనరించీ
ఆశలన్నీ తారకలుగా హారమొనరించీ అలంకారమొనరించి
మాయచేసి మనసుదోచీ - మాయచేసి మనసుదోచీ
పారిపోతావా దొంగా పారిపోతావా
చల్లగరావేలా మెల్లగరావేలా - చల్లగరావేలా మెల్లగరావేలా












ఈ రెండు పాటలూ భీంప్లాస్ రాగంలో స్వరపరచబడ్డాయి. 'సాలూరి రాజేశ్వరరావు - భీంప్లాస్ రాగం' అనగానే సంగీత ప్రియులెవరికైనా మదిలో మెదిలేపాట 'పాట పాడుమా కృష్ణా... పలుకు తేనెలొలుకు నటుల... మాట లాడుమా ముకుందా మనసు తీయగా' - హృదయం రసప్లావితం అయ్యేటట్లు భావస్ఫోరకంగా పాడే విధానానికి ఒరవడి దిద్దిన ఈ ప్రైవేట్ సాంగ్‌లో రాజేశ్వరరావు ఒక ప్రయోగం చేశారు. భీంప్లాస్ రాగానికి ఆరోహణలో 'సగమపనిస' అవరోహణలో 'సనిదమసగరిస' స్వరాలు వస్తాయి. ఆరోహణలో 'సగమపనిస' బదులు 'సరిగమపదనిస'అనే స్వరాలను ఉపయోగిస్తే 'ఖరహరప్రియ' రాగంలా వినిపించే అవకాశం వుంది. అయినా సరే ఆరోహణలో 'సరిగమపదనిస' స్వరాలనే ప్రయోగిస్తూ భీంప్లాస్ లాగే వినిపించేట్టుగా స్వరపరిచారాయన. 'భలేరాముడు' చిత్రంలోని 'ఓహో మేఘమాల' పాటలో కూడా అదేవిధంగా ఆరోహణలో సప్తస్వరాల్ని పలికిస్తూ భీంప్లాస్ లక్షణాలకు దూరం కాకుండా స్వరపరిచారాయన.

యస్.రాజేశ్వరరావు తన తొలిరోజుల్లో జెమినీ సంస్థలో ఉండేవారు. జెమినీ అధినేత వాసన్ మంచి కళాపోషకుడు, ప్రతిభావంతుల్ని తన సంస్థలో తెచ్చిమరీ పెట్టుకునే వారు. వారితో పని చేయించుకున్నా లేక పోయినా సరే, కొన్ని కొన్ని సమయాల్లో ఆయా కళాకారుల అమూల్యమైన అభిప్రాయాలను స్వీకరించి అమలు జరిపేవారు. తమిళ నాట వాగ్గేయకారుడిగా పేరు పొందిన పాపనాశమ్ శివన్ వంటి సత్సంప్రదాయ నిష్టాగరిష్టులు వాసన్ ఆస్థానంలో ప్రముఖ స్థానంలో ఉండేవారు. 'అటువంటి వారు మీ ప్రయోగాలను ఎలా ఆమోదించేవారు?' అని యస్.రాజేశ్వరరావు గారిని అడిగితే - చెవికి ఇంపుగా వుండే ఈ ప్రయోగాన్ని ఆయన ఎంతగానో అభినందించేవారని చెబుతూ ఒక ఉదాహరణను కూడా తెలిపారు. ఒకసారి కాంభోజిరాగం ఆలపించవలసివస్తే ఎనిమిది రకాలుగా పాడి వినిపించారట యస్. రాజేశ్వరరావు. దానికి పాపనాశమ్ శివన్ పొంగిపోయి రాజేశ్వరరావు గారి ప్రయోగశీలత్వాన్ని కొనియాడారట.

అటువంటి కారణజన్ముల శుభాశీసులు జెమినీ సంస్థను రాజేశ్వరరావు వదిలిపెట్టినా, ఆయన వెన్నంటే వున్నాయి. అందుకే భీంప్లాస్ రాగం ఆరోహణలో తిరిగి సప్తస్వరాలను స్పృశిస్తూ జనరంజకమైన పాటగా 'ఓహో మేఘమాల నీలాల మేఘమాల' పాటను స్వరపరిచారని ఆయన అభిమానులు గర్వంగా అనుకుంటారు. ఇక్కడ ఇంకో విషయం చెప్పుకోవాలి. 'భలేరాముడు' మాతృక అయిన 'కిస్మత్'లోని 'ధీరే ధీరే ఆరే బాదల్' పాటకు, 'ఓహో మేఘమాల' పాటకు సంగీతపరంగా ఏ పోలికా లేదు. తెలుగు పాటలో 'ఊరుకోవే మేఘమాల' అనే లైను హిందీ పాటలో 'మేర బుల్‌బుల్ సోరహాహై' అనే లైను యొక్క నడకను కొద్దిగా గుర్తు చేస్తుంది తప్ప రెండింటికీ మధ్య చాలా వ్యత్యాసం ఉంది. ఈ నాటికే కాదు ఏనాటికైనా స్వరతరాల మధ్య అంతరాలు వచ్చినాసరే -అభిరుచి, ఆదరణ విషయంలో ఏ అవాంతరం లేని పాటగా 'చల్లగ రావేలా' పాటను ఉదహరించవచ్చు. మొదటి పాటను సావిత్రికి లీల నేపథ్యగానం చేసారు. రెండవ పాటను ఘంటసాల, లీల పాడగా అక్కినేని, సావిత్రి అభినయించారు.

ఇదిలా ఉండగా రెండు పాటల్లోనూ చెప్పుకోదగ్గ తమాషా ఏమిటంటే నిజానికి చరణాల అతిచిన్నవి. అనుపల్లవిలో వచ్చిన లైన్లే రిపీట్ అయి పల్లవిని చేరుకుంటాయి. అయినాసరే అది మొనాటనస్‌గా జనం ఫీలవ్వలేదంటే ఆయా సంగీత సాహిత్యాలు సన్నివేశంలో ఎంతగా ఇమిడిపోయాయో ఊహించుకోవచ్చు. చిత్తశుద్ధి ఉంటే లక్ష్యసిద్ధి దానంతటదే సమకూరుతుందనడానికి ఇంతకన్నా నిదర్శనం ఏముంటుంది?

మురళీధరా హరే మోహనకృష్ణ - మురళీధరా హరేమోహనకృష్ణ
మొరవినవా దేవా - కరుణింపరావా - మురళీధరా హరే - మోహనకృష్ణ
కనిపెంచినా తండ్రి యెడమాయెనే-మాకు యెడమాయెనే(2)
ఎనలేని సంపదలిటులాయెనే-కుంటిబ్రతుకాయెనే
కనరాని కష్టాలు ఎదురాయెనే-కనరాని కష్టాలు యెదురాయెనే
కాపాడరారా గోపాల కృష్ణా-కాపాడరారా గోపాలకృష్ణా
మురళీధరా హరేమోహనకృష్ణా-హరేమోహనకృష్ణా
అనుదినము నిన్నే పూజింతురా - కృష్ణా పూజింతురా
మనసార నిన్నే ధ్యానింతురా - మనసార నిన్నే ధ్యానింతురా
కనికారమింతైన కనవేమిరా - కనికారమింతైన కనవేమిరా
కాపాడరారా గోపాలకృష్ణా
కాపాడరారా గోపాలకృష్ణా - మురళీధరా హరేమోహనకృష్ణా
మొరవినవాదేవా కరుణింపరావా - మురళీధరా హరేమోహనకృష్ణా
హరేమోహనకృష్ణా - హరేమోహనకృష్ణా
హరేమోహనకృష్ణా - హరేమోహనకృష్ణా






ఈ పాటను పి.లీల పాడగా సావిత్రి అభినయించింది. సన్నివేశ ప్రాధాన్యంగా అక్కినేని నాగేశ్వరరావు కూడా కన్పిస్తారు. నిజానికి ఈ పాటలో సాహితీ విలువలకన్నా సంగీతానికి సంబంధించిన విలువలు ఎక్కువ. ఒకసారి ఈ పాటను విన్నవారు ఈ పాటకి సంబంధించిన రాగాన్ని అలా ఆలపించుకుంటూనే ఉంటారు. దేశ్ రాగంలో రాజేశ్వరరావు స్వరపరిచిన పాటలు తక్కువే అయినా అవన్నీ మిన్నగా ఎన్నదగినవి. దేశ్ రాగంలో ఉన్న ఆర్ద్రతని సమూలంగా పిండుకుని ఈ పాటనిండా నింపారు రాజేశ్వరరావు.

కలమాయ మయేనా - తలవ్రాత యిదేనా
వలపించుట మురిపించుట మరపించుటకేనా - కలమాయ మయేనా
అనురాగసుధాధార వర్షింపగనేలా అలరింపగనేలా
అనురాగసుధాధార వర్షింపగనేలా అలరింపగనేలా
కొనసాగిన ఆశాలత కృశియించుటకేనా - కలమాయమయేనా
మనసారగ ప్రేమించుట విలపించుటకేనా తలవంచుటకేనా(2)
వినువీధుల విహరించుట - యిల కూలుటయేనా - యిల కూలుటయేనా
మునుజేసిన నా పూజల ఫలితాలుయివేనా - కలమాయమయేనా
తలవ్రాతయిదేనా - వలపించుట - మురిపించుట
మరిపించుటకేనా - కలమాయమయేనా









ఈ పాటను పి.లీల పాడగా సావిత్రి అభినయించింది. సన్నివేశ ప్రాధాన్యంగా అక్కినేని నాగేశ్వరరావు కూడా కన్పిస్తారు. ఇది పూర్తిగా రాజేశ్వరరావు మార్కు పాట. మొదటి చరణంలో 'అలరింపగనేలా' రెండవ చరణంలో 'తలవంచుటకేనా' దగ్గర వచ్చే ఆలాపనలు రాజేశ్వరరావు శైలిని స్పష్టంగా చూపిస్తాయి. ఎస్.రాజేశ్వరరావు పాటలను, ఆయన స్వరపరిచే పద్ధతిని సంపూర్ణంగా ఆకళింపు చేసుకున్న వారికి ఈ పాటను ఇప్పుడు వింటే మరో రెండు పాటలు గుర్తొచ్చి తీరతాయి. అందులో మొదటిది 'అమరశిల్పి జక్కన్న' సినిమాలో 'మధురమైన జీవితాల కథ ఇంతేనా' అయితే రెండవది 'డాక్టర్ చక్రవర్తి' సినిమాలో 'ఎవరో జ్వాలను రగిలించారు'. ఈ మూడు పాటలను ఒకసారి పక్కన పెట్టుకుని వింటే రాజేశ్వరరావు పాటల నడకలోని పోలికలు, తేడాలు సొగసుగా అవగాహనలోకి వస్తాయి.

భయమేలా ఓమనసా భగవంతునిలీలా
భయమేలా ఓమనసా భగవంతునిలీలా - ఇదంతా పరమాత్మునిలీలా
భయమేలా ఓమనసా భగవంతునిలీలా - ఇదంతా పరమాత్మునిలీలా
చీకటి వెనుక వెన్నెల రాదా - చీకటి వెనుక వెన్నెల రాదా
జీవితమింతేకాదా దీనికి చింతేలా - ఇదంతా పరమాత్మునిలీలా ॥భయమేలా॥
సంసారజలనిధిలో కష్టసుఖాలు తరంగాలుకావా - ఇది ఎరుంగవాజీవా(2)
శ్రీకృష్ణునినమ్మేవా - ఆ కృష్ణుని నమ్మేవా
నీకష్టాలన్నీ పటాపంచలయి కనుపించునుత్రోవా
నీకష్టాలన్నీ పటాపంచలయి కనుపించునుత్రోవా
అతడే నడిపించునునావా
దిగులేలజీవా కానలేవా భగవంతునిలీలా - ఇదంతా పరమాత్మునిలీలా॥భయమేలా॥



ఈ పాటను పి.బి.శ్రీనివాస్ పాడగా రాఘవన్ అభినయించారు. అర్ధాంగి చిత్రంలో 'రాధను రమ్మన్నాడు' పాటను అభినయించిన హరిదాసుగా ఈ రాఘవన్ సినీ ప్రేక్షకులకు గుర్తుండే వుంటాడు. పి.బి.శ్రీనివాస్‌కు తొలి రోజుల్లో గుర్తింపుని తెచ్చిన పాటలలో 'భయమేల ఓ మనసా' పాటను చెప్పుకోవాలి. టైటిల్స్‌లో పి.బి.శ్రీనివాస్ పేరును 'శ్రీనివాసాచారి'గా ఆ రోజుల్లో వేసారు. సింధు భైరవి రాగచ్ఛాయలో సాగిన ఈ పాటలో సన్నివేశ ప్రాధాన్యంగా సావిత్రి, గిరిజ, అక్కినేని కనిపిస్తారు.

అ: బంగరుబొమ్మా బలేజోరుగా
పదవేపోదామూ పై దేశంచూదాము
బంగరుబొమ్మా బలేజోరుగా
పదవేపోదాము పైదేశంచూదాము
ఆ: పైసా పైసా పైసా... పైసా
అ: హూ
ఆ: పైసాముందు జూపిస్తేను పైసంగతి చూదాము
అప్పుడు లంగరెత్తివేదాం - అప్పనమామా ఓ అప్పనమామా
అ: కలకత్తాపోయి కారులెక్కుదాం - బొంబాయిపోయి బోటు లెక్కుదాం
కలకత్తాపోయి కారులెక్కుదాం- బొంబాయిపోయి బోటు లెక్కుదాం
ఢిల్లీవెళ్లి విమానమెక్కి - ఢిల్లీ వెళ్లి విమానమెక్కి
మళ్లీతిరిగి మనవూరొద్దాం ॥బంగరుబొమ్మా॥
ఆ: దారికర్చుకి దప్పికర్చుకీ డబ్బు దస్కం తయారుచేస్తే
దూరదేశమైనా తెల్లాదొరల దేశమైనా
దూరదేశమైనా తెల్లాదొరల దేశమైనా
వస్తా పైసా పైసా
అ: పైసాకేమీ పరవాలేదు - డబ్బుంటే మనకిబ్బందిలేదు
ఆ: ఓహో...
అ: ఉన్నపాటున కురిపిస్తాను గలగలగలగలాగలా
ఆ: ఏమిటి?
అ: కాసులు - రూకలు
ఉన్నపాటున కురిపిస్తాను - తాతగారిసొమ్ము మనతాతగారిసొమ్ము
ఆ: తాతగారిసొమ్ముందని నాతోకోతలు కోస్తావేం మామా
కోతలుకోస్తావేం
చేతికిచ్చిమాటాడవోయి - చేతికిచ్చి మాటాడవోయి
నీతోవస్తా - నినుమురిపిస్తా అప్పనమామా
అ: బొంగరుబొమ్మా!
ఆ: అప్పనమామా!
అ: బొమ్మా
ఆ: మామా



ఈ పాటను పి.బి.శ్రీనివాస్, జిక్కి పాడగా రేలంగి, సీత అభినయించారు. రేలంగికి పి.బి. శ్రీనివాస్ కంఠం నప్పుతుందని ఎస్.రాజేశ్వరరావు నమ్మారనిపిస్తుంది. అందుకే 'భలే అమ్మాయిలు' చిత్రంలో కూడా ఆయన 'చీటికి మాటకి చీటీకట్టి' అనే పాటలో రేలంగికి పి.బి.శ్రీనివాస్ చేతనే పాడించారు. ఇక ఈ 'బంగారు బొమ్మ' పాట విషయానికొస్తే పాడించటంలో గాని అర్కెస్ట్రయిజేషన్‌లో గాని బోలెడంత హడావిడి చేసి ఒక కామెడీ పాటకి కావలసిన సరదాని, ఊపుని తగు పాళ్ళలో కూర్చి పెట్టారు రాజేశ్వరరావు.

నా బ్రతుకింతేనా ఈ బ్రతుకింతేనా
నాజీవితమంతా తీరనికన్నీరేనా
ఇంటింటను దీపావళి మా యింటికిలేదా - ఆ భాగ్యమురాదా(2)
కనిపెంచిన మా తండ్రి కనుపించకపోయే
కనికారమింతలేక తనదారినిపోయే సోదరి ననువిడిపోయె
మనసారవలచి వలపెంచిన ప్రియుడటులాయె మనోహరుడటులాయె(2)
ఇంటింటను దీపావళి మాయింటికిలేదా - ఆభాగ్యమురాదా
సిరిని వదలేనాడో చెల్లాచెదరాయె
నెరనమ్మినవారంతా ఏకాకిజేసిపోయె
కొరగాని బ్రతుకాయె మనసువ్యాకులమాయె
పరితాపము మితిమీరి లోకమంధకారమాయె
ఇపుడెవ్వరు మొరవినువారున్నారు జగాన
కృపజూపెడువారు అకటా లేరొకరైనా
విపరీతమైనలోకము నేనేమనుదాన ఎటులేమనుదానా
ఇంటింటను దీపావళి మాయింటికిరాదా -ఆభాగ్యమురాదా



ఈ పాటను పి.లీల పాడగా సావిత్రి అభినయించింది. క్లయిమాక్స్‌లో వచ్చే పాట గనక హీరో దగ్గరనుంచి సినిమాలోగల ముఖ్య పాత్రధారులందరూ సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఈ పాటకి మాత్రం ఈ సినిమాకి ఒరిజినలైన 'కిస్మత్' లోని 'ఘర్ ఘర్ మె దివాలీ హై మెరాఘర్ మెం అంధేరా' పాట ట్యూన్‌ను రాజేశ్వరరావు గారికి అనుకరించక తప్పలేదు. అది కూడా కొద్దిగానే...!

పైన ఉదహరించిన ఏడు పాటలు కాక-'ఎందున్నావో మాధవా', 'నాడెమైన పచ్చబొట్టు పొడిపించుకోవా', 'హరే మురారే హే చక్రధారే ఇటుసేయమేలా', 'భారతవీరా ఓ భారత వీరా', - అనే మరో నాలుగు పాటలు కూడా ఉన్నాయి. హిందీ చిత్రం 'కిస్మత్'లోని పాటలను, ఈ 'భలేరాముడు' చిత్రంలోని పాటలను సంపాదించి పక్కపక్కన పెట్టుకుని వినడం కనక జరిగితే మన యస్.రాజేశ్వరరావు గారి పైన గౌరవం ఎన్నో రెట్లు ఇనుమడిస్తుందనడంలో ఏ మాత్రం సందేహించనక్కరలేదు.

## సాంకేతిక నిపుణులు

కెమేరా : యం.మస్తాన్, వేదాంతం చిదానందం
సౌండు : కె.రామచంద్రయ్యర్, కె.ఆర్.రామస్వామి
కూర్పు : ఆర్.రాజగోపాల్
కళ : ప్రసాద్
స్టిల్సు : ఆర్.పి.సారధి
మేకప్ : ఎం.రామస్వామి, ఆర్.రంగస్వామి
డ్రెస్ : పి. పొన్నుస్వామి
ప్రొడక్షన్ మేనేజరు : కె.బాలాజీ
అసోసియేట్ డైరెక్టర్ : గాదిరాజు కేశవరావు
కథ, మాటలు, పాటలు : సదాశివబ్రహ్మం
డైరెక్షన్ : వేదాంతం రాఘవయ్య
నిర్మాత : వి.యల్.నరసు

### సహాయకులు

డైరెక్షన్ : అబ్బూరి శ్రీరామమూర్తి
కెమేరా : సి.డామినిక్, టి.వి.సుబ్రహ్మణ్యం. ఆర్.జగదీష్
సౌండు : ఎ.జగన్నాధన్, ఎస్.వి.వేషన్. ఎ.పి.ఆర్ముగం
కూర్పు : బి.గోపాల్
మేకప్ : ఎస్.ఆర్.దేవ్, ఎం.సుందరం
డ్రెస్ : దావూద్
స్టిల్సు : యన్.కణ్ణప్పన్
ప్రొడక్షన్ : ఎన్. రామమూర్తి
ఆర్టు : పి. నారాయణ







## తారాగణం

నాగేశ్వరరావు : రామకృష్ణ
రేలంగి : అప్పన్న
సి.యస్.ఆర్. : నాగభూషణం
గుమ్మడి : ఇనస్పెక్టర్
గౌరినాధశాస్త్రి : నారాయణబాబు
చలం : గోపాల్
ఎం.పి.రాఘవన్ : రామదాసు
పేకేటి : మేనేజరు
డా॥శివరామకృష్ణయ్య : డాక్టరు
గాదిరాజు కేశవరావు : బన్సిలాల్ శేట్
మాష్టర్ బాబ్జి : చిన్నగోపాల్
సావిత్రి : రూప
గిరిజ : తార
హేమలత : పార్వతి
సీత : బంగారి
బేబి సరస్వతి : చిన్నరూప
బేబి కృష్ణవేణి : చిన్నతార
నృత్యం : ఇ.వి. సరోజ, బాల
నృత్యదర్శకుడు : వసుమర్తి కృష్ణమూర్తి

### నేపథ్య సంగీతం

ఘంటసాల, శ్రీనివాసాచారి, లీల, జిక్కి, రాణి

సంగీతం

ఎస్.రాజేశ్వరరావు




# హాస్యరసరాజు



**ఇది రాజబాబు మొట్టమొదటి సారిగా, నా దగ్గరకొచ్చినప్పుడు ఇచ్చిన కాయితం. "ఇలారాసి అందరికీ ఇస్తున్నానండి. ఫోటో అక్కర్లేదండీ. నేనే కనిపిస్తున్నాను గదా. రోజూ వస్తూ వుంటాను. కావాలంటే" అన్నాడు రాజబాబు నిలబడి వుండే. పక్కనే వున్న పొట్టి ప్రసాద్ నవ్వుతూ ఉంటే "నవ్వకండి - సారీ, నవ్వకురా. సీరియస్‌గా మాట్లాడుతున్నాను" అన్నాడు మళ్లీ.**

**పూర్తి పేరు :**
**పుణ్యమూర్తుల అప్పల రాజు**
**ఊరు :**
**రాజమండ్రి**
**చదువు:**
**పెద్దగా లేదు.**
**అనుభవం:**
**మిమిక్రీ చేస్తాను. నాటకాల్లో వేస్తాను. హాస్యపాత్రలు ఇష్టం.**
**పొడుగు లేదా ఎత్తు:**
**ఆలమారలోని మూడో అరను అందుకోగలను**
**బరువు :**
**సన్నగా వుంటాను. ఈజీగా నన్ను ఎత్తుకోవచ్చు.**
**అడ్రసు :**
**కొత్తగా వచ్చాను గనక, సరైన అడ్రసు లేదు.**

"కథ కంచికి" అని ఓ నాటిక రాశాను. అది చెన్నపురి ఆంధ్ర మహాసభ వారి నాటికల పోటీల్లో వెయ్యాలని. అందులో ఆఫీసుబాయ్ వేషం వుంది. అది తప్ప తక్కిన వేషాలన్నీ నిర్ణయం అయిపోయాయి. పోర్షన్లు చదువుకుంటున్నారు. "చాకులాంటి కుర్రాడు కావాల్రా - మంచివేషం - చిన్నదైనా" అన్నాను పొట్టి ప్రసాద్‌తో. వాడు ఆలోచించి "ఆఁ - రాజబాబు అనీ, కొత్తగా దిగాడులే - సినిమాల్లో వేషాలకి. 'దొంగవీరడు'లో ఇద్దరం వేశాం. వాడు బావుంటాడు. తీసుకొస్తాను. పాండీ బజార్లో దొరకాలి మరి" అని రాజబాబుని వెతికి పట్టుకుని తీసుకొచ్చాడు. వస్తూనే రాజబాబు, ఓ నమస్కారం పెట్టి, ఆ కాయితం చేతిలో పెట్టాడు. నాటిక ఇచ్చి చదువుకోమన్నాను. ఓ అరగంట పోయాక, "చదివేశాను సార్. మీరు వినండి. ఎలా చెయ్యమంటే అలా చేస్తాను' ' అన్నాడు. చదివాడు. అద్భుతం! "బావుంది. అదే ట్రెండ్. మీరు కంఠతా పెట్టేయండి. రిహార్సల్సు ప్రారంభిద్దాం" అన్నాను. "ఓకే కదురా" అన్నాడు ప్రసాదు విజయ గర్వంతో చూసి. "డబుల్ ఓకే".

రాజబాబుకి మంచి పేరు, ఆ పాత్రకి మంచి పేరూ వచ్చాయి. ఆ పోటీల్లో మాకు ఉత్తమ ప్రదర్శన బహుమతి వచ్చింది. రాధాకుమారి ఉత్తమ నటి. రాజబాబుకీ, పొ. ప్రసాద్‌కి ప్రశంసల మీద ప్రశంసలు. ఆడియన్సులో వున్న ఆలిండియా రేడియో జనమంచి రామకృష్ణగారు లోపలికొచ్చి మమ్మల్ని అభినందించి, "ఇక్కడ ఆలిండియా రేడియో వుందన్న సంగతి మర్చిపోకండి. మీ ట్రూపుని ఇలాగే, తీసుకెళ్లి ఈ నాటిక రికార్డు చేద్దాం" అని రామకృష్ణగారు ప్రోత్సహించగానే రాజబాబు దరఖాస్తు ఫారం తీసి ఇచ్చేశాడు ఆయనకి. "ఇంకా ఏవైనా వేషాలుంటే నాకిప్పించండి" అన్నాడు రాజబాబు. "తప్ప కుండాను. ఆడిషను పెట్టిస్తాను" అని, ఆయన వెళ్లిపోయారు. "ఆడిషను అన్నారేమిట్రా ప్రసాదూ - అంటే?" అని అడిగాడు. "నిన్ను మైకు దగ్గర నిలబెట్టి చదివిస్తారు. అందులో నువు పాసవాలి".

"మైకులు నాకు అలవాటే. ఈజీగా పాసయిపోతాను" అని కిచకిచమని నవ్వాడు. ఇక్కడ ప్రైజు కొట్టిన తర్వాత, విజయనగరం రాఘవ నాటక పోటీలకు కట్టాం. ఆంధ్ర నాటక కళా పరిషత్తు పోటీలకి (గుడివాడ) కట్టాం. బహుమతులు వచ్చాయి. మద్రాసులో వేసినప్పుడు కె.వి.రెడ్డిగారు చూశారు. ఆ మర్నాడే రాజబాబు ఆయన ఇంటికి వెళ్లి "జీవిత విశేషాల పత్రం" అందించేశాడు. "చూస్తాను" అన్న

**నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరు తెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు రావి కొండలరావు రాసిన వ్యాసమిది**





కె.వి. 'సత్యహరిశ్చంద్ర'లో కాలకౌశికుడి శిష్యుడి వేషం ఇచ్చారు.

నరసాపురంలో పుట్టినా, రాజమండ్రిలోనే పెరిగాడు. అప్పల రాజుగా ప్రసిద్ధుడయిన తర్వాత, 1960లో మద్రాసులో దిగాడు. "టిక్కట్లకీ వాటికీ డబ్బులెక్కడివీ? మిత్రులే చందాల్లా వేసుకుని నన్ను పంపించారు" అని చెప్పేవాడు. తిరగని డైరెక్టరు ఇల్లు లేదు. చూడని నిర్మాత లేడు. "ఉంటే తినడం, లేకపోతే నీళ్లు తాగడం. ఏమైనా వేషాలు సంపాయించాలి. అదీ నా పట్టుదల" అన్నాడు రాజబాబు. రాజమండ్రిలో వున్నప్పుడు పిల్లలకి పాఠాలు చెప్పేవాడు గనక, అడ్డాల నారాయణరావు ఇంట్లో ఆయన పిల్లలకి పాఠాలు చెప్పడానికి కుదురుకుని, మిమిక్రీలు అవీ చేసి ఆయన్ని నవ్వించి, మెప్పించి ఆయన

తీస్తున్న 'సమాజం' సినిమాలో చిన్నవేషం సంపాయించాడు రాజబాబు. ఆ చిత్రానికి పెట్టుబడిదారు రేలంగి గనుక, ఆయన చూసి "లక్షణాలున్నాయి. పైకి వస్తావు. ఓవర్ చెయ్యకు" అని ఆశీర్వదించారు.

నా 'కుక్క పిల్ల దొరికింది'లో శీను, 'నాలుగిళ్ల చావిడి'లో మాస్టరు, రాజారావుగారి అల్లూరి సీతారామరాజు నాటకంలో ఇన్స్‌పెక్టరూ మంచి పేరు తెచ్చాయి రాజబాబుకి. 'మంచి కమేడియన్ దొరికాడు' అని - వేషాలు వాటంతటవే వచ్చి అతుక్కున్నాయి.

విజయనగరంలో 'కథ కంచికి' వెయ్యడానికి వెళ్లినప్పుడు, ఒక ఇంట్లో దిగాం. లోపలికి వెళ్లగానే పెద్ద బల్లి చచ్చిపోయి కనిపించింది. "అయ్యయ్యో, ఒరే ప్రసాదూ - బల్లి చచ్చిపోయిందిరా ఎవరిదో పాపం" అన్నాడు రాజబాబు. ఇద్దరూ కలిసి వెళ్లి "ఆ బల్లి మీదా, మీదా" అని పక్క ఇళ్ల వాళ్లని అడిగారు. బల్లి ఎవరిదేమిటని వాళ్లు నవ్వుకున్నారు. "మరి దీన్ని దహనం చెయ్యాలి. దీని చుట్టాలూ వాళ్లూ బాధపడుతున్నారేమో - వెయిట్ చేద్దామా?" అని అడిగాడు రాజబాబు. లాభం లేదన్నాడు ప్రసాదు. ఇద్దరూ కలిసి సదరు బల్లి కళేబరాన్ని మోసుకుంటూ గుమ్మం దాటుతూ వుండగా, అది పక్కనే వున్న కుళ్లు కాలువలో పడిపోయి, కొట్టుకుపోయింది! "అరెరె, పాపం" అని ఇద్దరు విచారించారు. "ఆ కళేబరాన్నయినా రక్షించలేకపోయాను. వచ్చే జన్మలో బల్లినై పుడతానేమోరా" అన్నాడు నాతో. "మీరు మీరు సారు" అన్న పదాలు, గౌరవ మర్యాదలూ పరిచయం అయిన వారం రోజుల వరకే వున్నాయి. తర్వాత అందరూ "ఒరే"లే. అలాంటి బల్లి జోకుల్లాంటి ప్రాక్టికల్ జోకులు చేసేవాడు రాజబాబు.

బాగా బిజీ అయిన తర్వాత, "ఇది వరకు మాస్టారుని ఇప్పుడు స్టారుని" అన్నాడు ఓ రోజు. "ఇప్పుడు అభిమానిస్తున్న దర్శకులు, నిర్మాతలూ ''మాస్టారు'' అంటున్నారు'' అన్నాడు ఆనందంగా. పేరూ పెన్నిధీ సంపాదించిన తర్వాత, దానాలూ ధర్మాలూ చేశాడు. చదువుకోవడానికి ఇబ్బంది పడిన వాళ్లని చదివించాడు. తన చుట్టూ చేరిన మిత్రులందరికీ ఏదో విధంగా సహాయపడ్డాడు.

"ఒరే - నేనొక... అమ్మాయిని ప్రేమిస్తున్నాన్రా" అన్నాడు ఒక రోజున సీక్రెట్‌గా - "మంచిదే. మరి ఆ అమ్మాయి?" "ఊఁ - ప్రేమిస్తోంది. పెళ్లి చేసుకుంటాం. మీరంతా రావాలి. అక్షింతలు వెయ్యాలి" అన్నాడు. ఆ అమ్మాయి పేరు అమ్మలు. శ్రీశ్రీ గారి భార్య సరోజిని గారి చెల్లెలు. అందరం సంతోషించాం.

అంతకుముందు-

వేషాలకోసం తిరుగుతున్నప్పుడు - మేము డబ్బింగులు చెబుతున్నాం. "అదేమిటో నేనూ చెబుతాన్రా" అంటే జయంతి స్టూడియోకి తీసుకెళ్లాను.



శ్రీశ్రీ గారు రైటరు. "ఈ అబ్బాయి కామెడీ చేస్తాడండి. ఏదైనా చిన్నవేషం ఇస్తే చెబుతానంటున్నాడు." అని శ్రీశ్రీ గారి దగ్గర నసిగాను. ఒక నౌకరు వేషం వస్తే రాజబాబుని చెప్పమన్నారు. ఇచ్చిన డైలాగు చెప్పకుండా, ఏదేదో చెబుతున్నాడు. శ్రీశ్రీ గారొచ్చి "మీరెవరో గాని, ఉన్న మాట చెప్పడం లేదు. ఓ సారి ఓ మాటా, ఇంకోసారి ఇంకో మాటా చెబితే, డబ్బింగ్ కుదరదు. ఉన్నమాటే చెప్పాలి" అని గట్టిగా గసిరారు. (అటు తర్వాత ఆ ఇద్దరూ తోడి అల్లుళ్లు అవుతారని అప్పుడు వాళ్లకి తెలీదు!) రాజబాబు చెవులకి హెడ్ ఫోన్స్ తగిలించేసుకున్నాడు. శ్రీశ్రీ గారు చెప్పింది సరిగా వినిపించుకోలేదు. ఆయన -- "హెడ్‌ఫోన్స్ తియ్యండి. అవి ఎందుకు ముందే తగిలించేసుకున్నారు?" అని కేకలు వేశారు. "ఇది చెవులకి తగిలించుకోకపోతే రికార్డింగ్ జరగదేమోననుకుంటున్నాను'' అన్నాడు భయంగా. రాజబాబు అమాయకత్వానికి శ్రీశ్రీ గారు నవ్వేసి -- "జాగ్రత్తగా, తెరమీద చూసి లిప్ ప్రకారం చెప్పండి" అని ప్రోత్సహించారు.

రాజబాబు ప్రసిద్ధ తార అయిపోయినా, పొట్టి ప్రసాద్ అంత కాలేదు. ఒక అవుట్డోర్ షూటింగ్‌లో - పాకప్ చెప్పిన తర్వాత అందరం ఒక వాన్ ఎక్కాం. కిటకిటలాడింది. రాజబాబు "ఎక్కడ్రా నేనెక్కడ కూచోవాలి?'' అని అరుస్తున్నాడు. "నువ్వు టాప్‌మీద కూచోరా" అన్నాడు పొట్టిప్రసాద్.



"ఏం?"

"టాప్ స్టార్‌వి కదా" అని పొ.ప్ర. జోక్ చేస్తే - ''నువ్వే ఎక్కురా. ఇలాగైనా టాప్‌స్టార్ వనిపించుకోవచ్చు" అని రాజబాబు గలగలా నవ్వాడు. పొట్టి ప్రసాద్ నవ్వకపోతే - "ఏం రా - జోకు బాగులేదా - పోరా ప్రభుత్వ సారా దుకాణం" అన్నాడు రాజబాబు. ప్రభుత్వం సారా దుకాణంని షార్ట్‌కట్ ప్రసాదు అని వివరిస్తే అప్పుడు నవ్వాడు పొ.ప్ర.

తన పుట్టిన రోజునాడు - ఒక ప్రముఖుణ్ణి సన్మానించే వాడు. నాటకాలు ప్రదర్శింప జేసేవాడు రాజబాబు. కృతజ్ఞత! భక్తి! జోకులు వేస్తూ గలగలా నవ్వుతూ బతికాడు. షూటింగులో వుంటే సందడే సందడి. సీను చదివి, ఇంప్రొవైజ్ చేసేవాడు. మంచి టైమింగ్. షూటింగుల్లో, భోజనాలు చేసినప్పుడు అందరూ కలిసి చెయ్యాలని అనేవాడు. ఎక్స్‌ట్రా కారియర్ తెప్పించి, అందరికీ వడ్డించేవాడు. సరదా అయిన వాడూ, నలుగురూ తింటుంటే ఆనందించే వాడు. "మనిషి రోడ్డున పడ్డాడు" అని సొంతంగా సినిమా తీశాడు. "షూటింగ్ ఖర్చుల కంటె, భోజనాలకే ఎక్కువ ఖర్చయింది" అని చెప్పుకునే వారు.

తెలుగులో తీసిన తమిళ చిత్రాల్లో నాగేష్ ధరించిన చాలా పాత్రలు రాజబాబు చేసాడు. ఇద్దరూ మంచి మిత్రులు. "నీలాగే నాకు వేదాంతం అలవాటవు తోందిరా నాగేషా - నా డైరీలోని పేజీలు చివరి కొచ్చేశాయి. మంచి పన్లు చెయ్యాలి" అన్నాడు ఒక రోజు.

వేదాంతిలాగా మాట్లాడేవాడు. జోకులు తగ్గించేశాడు. కొవ్వొత్తిలా కరిగిపోయాడు - రాజబాబు. స్నేహానికి సందడికీ మారుపేరు రాజబాబు. నవ్వడానికీ నవ్వించడానికీ మరోపేరు రాజబాబు. సినిమా హాస్య యుగాల్లో ఆదో యుగం - రాజబాబు యుగం.

**చిత్రం: ముగ్గురు అమ్మాయిలు** సంగీతం: టి.చలపతిరావు
రచన: ఆరుద్ర గానం: ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం

అహా ... ఎహే... ఓహో... అబ్బబ్బబ్బా
ఆకాశం నుండి నాకోసం వచ్చావా
పొంగే అందాల మిఠాయి పొట్లం తెచ్చావా ॥ఆకాశం॥
నువు పక్కపక్కగా ఉంటే స్వర్గం దున్నేస్తా
నువు కనబడకుండా పోతే... బాల్చీ తన్నేస్తా ॥ఆకాశం॥
నీ జడపిన్ను... నా తలరాతకు పెన్ను
నీ సిగపూవు... అదేంటమ్మా.... ఆ బుజబుజరేకుల నవ్వు
నీ చిలిపి బిడియం
అమృతంలో... ఊరిన ఒడియం
నీ పెదవులు రెండు
నా ముక్కుకు దొండ పండ్లూ
ఓహో రోజా తెగ ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడీ రాజా ॥ఆకాశం॥
నీ లేడి కళ్ళు... వేస్తాయి నాకు సంకెళ్ళు
నీ లేత ఒళ్ళు చూస్తే... నాకు ఎక్కిళ్ళూ...
నీకు నేను ముద్దుల బంది
నన్ను పెట్టకే ఇబ్బంది ॥నీకు॥
నీకంత చెలగాటం నాకెంతో ఇరకాటం
నీకంతా చెలగాటం నాకెంతో ఇరకాటం
ఓహో రోజా తెగ ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడీ రాజా
అందాల ఓ రామచిలకా
నేనూ అవుతున్నానెందుకో తికమక
ఈ దేవదాసు లైలావేనా... హోయ్ లైలా
ఈ మజునూ పార్వతివేనా... హోయ్ పారూ
అయ్యో బుల్‌బుల్
నాకెందుకే ఈ ట్రబుల్

స్వరంతో నటించడం - బాలూ వచ్చాక చాలా ఎక్కువై పోయిందని గమనించమని వాళ్ళకి ఈ పాటని ఒక ఉదాహరణగా చూపించచవచ్చు. రాజ్‌బాబు ఎక్స్‌ప్రెషన్స్‌ని దృష్టిలో పెట్టుకొని అనితరసాధ్యంగా పాడిన బాలు కాంట్రిబ్యూషన్ ఎంతటిదో పాట వినగానే తెలిసిపోతుంది. ఆయన ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్స్‌ని మైనస్ చేసుకుని పాడుకుని చూడండి - అలా పాడడం ఒక్క బాలూకే చెల్లింది అని మీకు అనిపించి తీరుతుంది.

రాజ్‌కపూర్ నిర్మించిన 'హమ్‌తుమ్ ఎక్ కమ్‌రేమే బంద్ హో' అనే పాట దేశవిదేశాలలోనున్న సంగీతాభిమానులందరినీ ఒక ఊపు ఊపేస్తున్న రోజుల్లో పుట్టిన పాట ఇది. "ఎందుకలా కాపీ చేశారు?" అని స్వర్గీయ జి.కె.వెంకటేశ్‌ని ఆ రోజుల్లో అడిగితే "దాన్ని కాపీ అనరు. ఇమిటేషన్ అని అంటారు" అని అన్నారాయన కూల్‌గా "సరే ఇమిటేషన్ అనుకోండి.. ఎందుకు చేశారో చెప్పండి." అని రెట్టించి అడిగితే "కామెడీకోసం బాబీ పాటని దోబీ పాటగా మారిస్తే ఎంత కామెడీ పుట్టిందో చూశావా?" అని అన్నారాయన. రాజ్‌బాబుని అనుకరించాలంటే బాలూయే ఉండాలి అనే ఇంప్రెషన్ కొనసాగుతున్న రోజుల్లో మాధవపెద్ది రమేష్‌తో రాజ్‌బాబులాగే పాడించి పాటను చేశారు జి.కె.వెంకటేష్.

**చిత్రం: సంసారంలో సరిగమలు** సంగీతం: శంకర్ గణేష్
రచన: కొసరాజు గానం: ఎస్పీబాలసుబ్రహ్మణ్యం

పాయి పాయి పాయి ప్ప ప్ప ప్ప పాయి పాయి
రావే మాలతీ
హాయి హాయి హాయి కలుపు చేయి చేయి
నిన్నే కోరితీ
ఐ లవ్ యూ ఓ మై డార్లింగ్
ఐ లవ్ యూ ఓ మై డార్లింగ్ ॥పాయి॥
నీ సొగసు చూసి నే వలచి నాను
నిదురమాని నిను పిలిచినాను
రూములో దూరి ఒంటిగ చేరి...
రూములో దూరి ఒంటిగ చేరి...
టైమంతా వేస్టు చేస్తావు
ఎందుకు పరీక్ష చేస్తావు ॥పాయి॥
అందాల భామ ఓ చందమామ
ఇద్దరమొకటై విహరించుదామా ॥అందాల॥
తలుపు తెరువూ.... ఎదుట నిలువూ
తలుపు తెరువు ఎదుట నిలువు
కమ్‌కమ్ లేడీ కమాన్ లేడీ
నా ఒళ్ళంతా వేడి వేడి
ఓ మై లే... ఎ... డీ... హో... హో... హో... హో... ॥ పాయి॥

**చిత్రం: జమిందారు గారి అమ్మాయి** సంగీతం: జి.కె.వెంకటేష్
రచన: కొసరాజు గానం: రమేష్, పుష్పలత

అ : చాకిరేవు కాడ నీ సోకు
చూడగానే జిల్లంది నాకు
రాసిపెట్టి వున్నాది మనకు
ఇలా రాసిపెట్టి వున్నాది మనకు
మంగమ్మా! నువ్వు ఉతుకుతుంటే అందం
అబ్బ! వేశావె బంధం
ఆ : ఒరె, నీ సోకు ఆపరా రాజూ - గంగరాజూ
రాజూ - నిన్ను వదలకుండా ఉతుకుతా
బండనేసి రాస్తా - రాతి బండనేసి రాస్తా
అ : నీ పైటలోనే ఉన్నది బింకం
ఆ : ఏం; వొళ్లు తీపుగా ఉందా?
అ : నీ వొంపు సొంపులో వుంది పొంకం
ఆ : ఏం; వొళ్లు జిలగా వుందా?
అ : నీ కోపంలో వున్నాది కైపు
ఆ : నా చెయ్యి పడితె తెలుస్తుంది తీపు
అ : అబ్బ! మంగమ్మా....
నువ్వు నడుస్తుంటే అందం - అబ్బ వేశావే బంధం
తడిసిన నీ వొళ్లు తాకుతూంటే - తాకుతూంటే
ఆ : వెచ్చవెచ్చగా వేడి పుడుతూంటే - ఆఁ అలాగా?!
అ : ఎక్కడో వున్నట్టు నాకుందీ
ఆ : ఇక్కడే వున్నట్టు నాకుందీ
అ : అబ్బ! మంగమ్మా.... మనం కలిసుంటే అందం
అబ్బ - వేశావె బంధం
ఆ : ఒరే; నీ సోకే సోకురా రాజూ - గంగరాజూ
అ : మంగమ్మా - ఆ: రాజూ - అ: మంగమ్మా - ఆ: రాజూ

